ఆయుర్వేద తత్వవివేక,

# మహారాజ పోషకులు.

జలసూత్రం రామకృష్ణయ్యగారు. ( రిటైర్డ్ ) P. W. D. ఆఫీసర్ కూడేరు.

## పోషకులు.

| | | |
|---|---|---|
| దూబగుంట సుబ్రహ్మణ్యంగారు. | ( ప్రొప్రైటర్ ) | బెజవాడ. |
| నండూరి వీరభద్ర పాకయాజిగారు. | ( ప్రొప్రైటర్ ) | ,, |
| పాటిబండ అప్పారావుగారు. | ( వకీల్ ) | ,, |
| పాటిబళ్ళ రామమూర్తిగారు. | ( వకీల్ ) | ,, |
| చక్రవర్తుల నరశింహాచార్యులుగారు. | ( డాక్టర్ ) | ,, |
| నేరెళ్ళ లక్ష్మీనారాయణగారు. | ( రైల్వే O, S గారు. ) | ,, |
| శివలంక సూర్యనారాయణగారు. | | ,, |
| లింగభట్ల అప్పయ్యశర్మగారు | | బెజవాడ. |
| వెంట్రప్రగడ వెంకటకృష్ణారావుగారు. | (మునసబ్) | వేమండ |
| డాక్టర్ వేమూరి వెంకటకృష్ణశాస్త్రిగారు. | (కంట్రాక్టరు) | అవనిగడ్డ |



# తత్త్వనివేదిక.

అగ్రాహిణః కౌశల్యం కింస్యుమశ్శాస్త్ర వాదినాం।
అన్యయే భ్యోపి యే చార్థా న్నిష్కర్షన్తి సహస్రశః॥

శ్రీ చయనులవారి గ్రంథమునకంతయు యీవాక్యమే నాయభిప్రాయవేదిక. పదార్థసేకరణము, అర్థవితరణము, పండితలక్షణము, స్వతంత్రకుశలత, అన్యశాస్త్రాభిజ్ఞత తత్వనుందు జీర్ణించిన శ్రీచయనుల వారి " ఆయుర్వేద తత్వ వివేకము, " ఆయుర్వేద చికిత్సకలోకమునకు మహార్థ ప్రదము. ఋతు, రస, త్రిదోషవిమర్శనము, ఆహార పరిణామము, పురుషోత్పత్తి హేతువివరణము, వాతాదుల మూర్తిత్వ నిరూపణము, సర్వశాస్త్రసమన్వయము, ..వాత పిత్త శ్లేష్మములకుగల క్రియావత్వనిరూపణము, సర్వసంశయవిచ్ఛేదనము, ఈచిన్న గ్రంథమున గొప్పగా రూపొందింపబడినది.

శ్రీ శంకర భగవత్పాదుల గురుపాదులు శ్రీ గోవింద భగవత్పూజ్యపాదులు, చరకుడే యనియు రసహృదయ తంత్రముతోపాటు లోహకల్పముగూడ యీయన రచించెననియు ఒకరహస్య గ్రంథమున వెల్లడిచేయబడినది. తైత్తిరీయ శిక్షాభాష్యమున శ్రీ శంకరభగవత్పాదులు అతోమాం మాం ప్రతిప్రభావిం ప్రకాశయ ఆత్మానంప్రపద్యస్వచ। మాం రసవిద్ధమివ లోహం త్వన్మయం త్వదాత్మానం కుర్విత్యర్థః॥ అని వివరించుటచే వారిగురుపాదుల లోహవేధ రసవాదముల ప్రజ్ఞాప్రభావములు వెల్లడిజేయబడినవి. గోవింద భగవత్పూజ్య పాదులే చరకుడు అనుట పరంపరానుభూతముగ శ్రీ చయనులవారు ఆయుర్వేద పండిత లోకమునకుపదేశించిరి. యీగ్రంథమున ఆయుర్వేద విద్యార్థులు, పండితులు, విమర్శకులు లాభమునంద గలరు.

గుణదోషములను తెలియజేయుట విమర్శకునివిధి. మూలగ్రంథమున నిగమనము, అనుశీర్షిక యందు ఆనియిట్లు వేద, కపిల, కణాద, చరక, సుశ్రుత, వ్యాస, జైమిని, శంకర, విద్యారణ్యాదుల యాశయముల ననుసరించి పైవిషయములను అనగా మూర్తద్రవ్య, శక్తియనెడి పదములను గూర్చి విమర్శనము సంక్షేపముగ వ్రాసితిని. ఆదునిక యుక్తివాద ప్రియులకై కొన్ని యుక్తులనుకూడ జూపితిని. షేవర్, అనివ్రాసిరి. ఆధునిక యుక్తివాదులప్రపన్నతకై శ్రీ చయనులవారిచటు తమశక్తిని వృథావ్యయ మొనర్చిరని చెప్పవలసియున్నది. బ్రహ్మాపి నరం న రంజయతి, యనిగదాలోకోక్తి.

ఆయుర్వేదతత్వ శక్తిస్వరూప నిరూపణము గ్రంథమున మహోత్తమస్థాయియందు గలదు. అనర్ఘ విద్యా సంపన్నులగు శ్రీ చయనులవారు అనేకములగు యిట్టిగ్రంథరచనలచే ఆయుర్వేద చికిత్సకజగమును గుణరత్న ప్రభాభాసితముగా చేయవలయును. ఇదివిమర్శనమును, ఆదేశముగాదు. ఆయుర్వేద వైద్యక లోక విజ్ఞానాభివృద్ధికై సవినయమగు నునవి మాత్రమేయిది.

బహువిధ వాద విచిత్రము, మనోహరార్థ ప్రతిపాదనము, బహువిధ శుభశబ్ద సంధియుక్తము, అగు యీగ్రంథమున గుణములను సుగుణులు గ్రహించెదరుగాత. రిక్తదోసిలిని భక్తినీరాజనము దప్ప పండితులకు పండితులేమీయ గలరు. పండితులు పండితులను పోషించి నిగూఢమగు ప్రాచీన శాస్త్రార్థములను ప్రకాశింపచేయ గలుగునట్లు పరమేశ్వరుడు తోడ్పడుగాత.

ఇట్లు
(ఆయుర్వేదాచార్య.)
పండిత, శతావధాని, వేదాల తిరుమల వెంకట
రామానుజస్వామి.

౧౫ - ౧౨ - ౫౫
ఆయుర్వేద కళామందిరం
హైదరాబాద్.

(అధ్యక్షుడు, ఆయుర్వేద మండలి.) (మెంబరు, ఇండియన్ మెడిసన్ బోర్డు.)

# పండితాభిప్రాయములు.

బ్రహ్మశ్రీ " వైద్యవల్లభ " రాణీ వేంకటాచలపతి ప్రసాదశాస్త్రి చయనుల వారు సర్వతంత్రములందును ననల్పమైన పాండిత్య ప్రతిభావంతులు. ఈ విషయము లోగడ వారు వ్రాసిన వ్యాసముల వలనను, గ్రంథముల వలనను నిర్ణీతమైయుండుటయే గాక ప్రస్తుతము వారిచే రచింపబడిన ఈ " ఆయుర్వేద తత్త్వవివేకము " వలన గూడ స్పష్టమగుచున్నది. చరక, సుశ్రుతాది మహోత్కృష్ట గ్రంథములలో గల వచనములకు పరస్పర భేదములుగనాభాసించు విషయములను సమన్వయించి, ఏకవాక్యతను గలిగించుటకై, వీరు సామ జ్యోతిష, రసతంత్రాది విజ్ఞాన విశేషములను ప్రదర్శించి, లోకోపకారమొనర్చియున్నారు. ఆయుర్వేద గ్రంథములన్నియు, " సారతోచ్చయః క్రియతే " యనినట్లు, బహుసూత్రప్రాయముగ నుండుటచే, వాటియర్థమును యథావస్థగ ప్రకటించుట సామాన్యులకు శక్యముగాదు. " అనూపస్కృతవిద్యః " అను చరకసూత్రము ననుసరించి వైద్యులకు బహుశాస్త్ర పరిజ్ఞాన మావశ్యకమను నంశమును శ్రీ చయనుల వారు తమ విమర్శయందు స్పష్టపరిచియున్నారు. ఈరీతిగనే వీరు వియర్శోత్కర్షను జూపి లోకమునకుపకారము జేయునట్లు శ్రియఃపతి వీరిననుగ్రహించుగాక యని కోరుచున్నాను.

" ఆయుర్వేదభూషణ " పండిత నోరి రామశాస్త్రి.
( శ్రీ వెంకటేశ్వర ఆయుర్వేద కళాశాల స్థాపకులు. ) విజయవాడ.

... ... ...

నా మాన్య మిత్రులు శ్రీ వైద్యవల్లభ బ్రహ్మశ్రీ రాణీ వేంకటాచలపతి ప్రసాదశాస్త్రి మహాగ్నిచిత్ గారు తమ అపార శాస్త్రపాండిత్యమును కేంద్రీకరించి, అధునాతన వైజ్ఞానిక లోకమునకుగూడ సంతృప్తికరమగురీతిని ఆయుర్వేదశాస్త్రమునందలి నిగూఢతత్త్వమును తదనుస్యూత జ్యోతిషసాంఖ్య వైశేషికాదిదర్శన సహాకృతి మార్గములను విపులముగా దడవుచు రచించిన " ఆయుర్వేద తత్త్వవివేకము " అను గ్రంథముయొక్క పూర్వార్థమును చదివితిని.

నా మిత్రులకుండు ఆయాశాస్త్రములందలి పాండిత్యమిందు ప్రతిఫలించుచున్నది. సామాన్యముగా ప్రాచీనమగు ప్రాచ్య విద్యలయందు పాండిత్యముండు వారికధునాతన పాశ్చాత్య విజ్ఞానమునందు పరిచయము పూజ్యమైయుండుట పరిపాటి. వీరట్లుకాక నవీన వైజ్ఞానికులకుండు తత్త్వశాస్త్ర పరిచయమునకు తీసిపోని విజ్ఞానము కలిగియుండిరని యీ గ్రంథమే నిరూపింపుచున్నది.

ఈ మహనీయుని గ్రంథమునుతమపత్రికలో సావకాశముగా ప్రకటించి వైద్యలోకమున కుపకారమును జేసిన " శ్రీ ధన్వంతరి " పత్రికాధిపతులు ప్రశంసా

పాతులనకతప్పదు. అచిరకాలములోనే మిగిలిన భాగమునుగూడ గ్రంథకర్తగారు వైద్య లోకమున కందజేతురని ఆశించుచున్నాను.

బహుకాలమునుండి ఆయుర్వేద వైద్యులు కనుచుండుకలలు కాలపరిపాకవశమునను, దేశపరిపాలకుల మనః పరిపాకవశమునను ఏనాడైన ఫలించి ఆయుర్వేద కళాశాలలు సర్వలక్షణోపేతముగా నెలకొల్పబడి సక్రమ పాఠ్యక్రమ మేర్పడు శుభ సమయము వచ్చినచో నిట్టి సద్గ్రంథములు పాఠ్యములలో నగ్రస్థానమును లభింపగలవని నా దృఢవిశ్వాసము.

నా మిత్రులితోధిక సముత్సాహముతో దామింతవఱకు చేసిన యావత్కృషిని గ్రంథరూపమున నిట్లే ప్రకటించి ఆయుర్వేద వైద్యలోకమునకు హస్తావలంబము నిచ్చుటకు ఆయుర్భాగ్యమును, స్వస్థజీవనమును లభించి మనుదురుగా తమని యాశాసింపుచున్నాను.

తి. ప. రామానుజస్వామి.
(రామతీర్థము,) విశాఖజిల్లా.

... ... ...

శ్రీ రాణీ ప్రసాదచయనులుగారు రచించిన 'ఆయుర్వేదతత్వవివేకత్త్వము'ను తుదముట్ట ఆసక్తితో చదివి నేనెంతో ఆనందించినాను. ఆయుర్వేదతత్వము నెరుగ గోరువారందరును, తప్పక దీనిని చదివి జ్ఞానాభివృద్ధిని చేసుకోవచ్చునని నాతలంపు.

ఆయుర్వేదార్థములను క్షుణ్ణముగా నెరిగి పాఠము చెప్పగలవారేఅరుదుగానున్న ఈదినములలో అన్య శాస్త్రార్థములనుగూడ కూలంకషముగా నెరిగి, ఈశాస్త్రముతో సమన్వయపరిచి గ్రంథమును రచించుట సామాన్య విషయముగాదు. జ్యోతిశ్శాస్త్రముతో సమన్వయపరిచి, విషయవిస్తరణ జేయుట అటుండ, అందును ఆధునికమైన 'ఫిసిక్సు' శాస్త్రవిషయములగూడ నెరిగి, ఆయుర్వేద తత్త్వార్థములతో సమన్వయపరిచి, ఈ గ్రంథమును రచించిన శ్రీ చయనులవారి పాండిత్యము, ప్రతిభ, విమర్శనాపాటవము నాకెంతో ముచ్చట గొలిపినది.

అభిమానమునువీడి చెప్పవలెనంటే నేనెన్నో క్రొత్తవిషయములను అర్థము చేసుకోగలిగినాను - వీరిగ్రంథపఠనమువల్ల.

పూర్వార్థమైన ఈ గ్రంథమునకు ఉత్తరార్థమునుగూడ పూర్తిచేసి శ్రీచయనులుగారు ఈ గ్రంథ సమగ్రస్వరూపమును ఆంధ్ర వైద్య లోకమునకందిచ్చెదరు గాకయని ప్రార్థించుచున్నాను.

శ్రీ చయనులుగారివంటి ప్రతిభావంతులైన పండితులు ఇట్టివారురచించిన విమర్శాపూర్వకమైన గ్రంథములేయిప్పుడు మనకు కావలసినవి.

ముక్త్యాల, 
25—11—55

వేటూరి శంకరశాస్త్రి.

# పండితాభిప్రాయములు.

బ్రహ్మశ్రీ "వైద్యవల్లభ" రాణీవేంకటాచలపతి ప్రసాదశాస్త్రి చయనుల వారు సర్వతంత్రములందును ననల్పమైన పాండిత్య ప్రతిభావంతులు. ఈ విషయము లోగడ వారు వ్రాసిన వ్యాసముల వలనను, గ్రంథములవలనను నిర్ణీతమైయుండుటయే గాక ప్రస్తుతము వారిచే రచింపబడిన ఈ "ఆయుర్వేద తత్త్వవివేకము" వలన గూడ స్పష్టమగుచున్నది. చరక, సుశ్రుతాది మహోత్కృష్ట గ్రంథములలో గల వచనములకు పరస్పర భేదములుగనాభాసించువిషయములను సమన్వయించి, ఏకవాక్యతను గలిగించుటకై, వీరు స్వమ జ్యోతిష, రసతంత్రాది విజ్ఞాన విశేషములను ప్రదర్శించి, లోకోపకారమొనర్చు యున్నారు. ఆయుర్వేద గ్రంథములన్నియు, "సారతరోచ్చయః క్రియతే" యనినట్లు, బహుసూత్రప్రాయముగ నుండుటచే, వాటియర్థమును యథామార్గ ప్రకటించుట సామాన్యులకు శక్యముగాదు. "అనూపస్కృతవిద్యః" అను చరకసూక్తిము ననుసరించి వైద్యులకు బహుశాస్త్ర పరిజ్ఞాన మావశ్యకమను సంశయమును శ్రీ చయనులవారు తమ వివర్యయందు స్పష్టపరిచి యున్నారు. ఈరీతిగనే వీరు వివరోత్కర్షను జూపి లోకమునకుపకారము జేయునట్లు శ్రియఃపతి వీరిననుగ్రహించు గాక యని కోరుచున్నాను.

"ఆయుర్వేదభూషణ" పండిత నోరి రామశాస్త్రి.
(శ్రీ వెంకటేశ్వర ఆయుర్వేద కళాశాల స్థాపకులు.) విజయవాడ.

... ... ...

నా మాన్య మిత్రులు శ్రీ వైద్యవల్లభ బ్రహ్మశ్రీ రాణీ వేంకటాచలపతి ప్రసాదశాస్త్రి మహాగ్నిచిత్ గారు తమ అపార శాస్త్రపాండిత్యమును కేంద్రీకరించి, అధునాతన వైజ్ఞానిక లోకమునకుగూడ సంతృప్తికరమగురీతిని ఆయుర్వేద శాస్త్రము నందలి నిగూఢతత్త్వమును తదనుసృత జ్యోతిషసాంఖ్య వైశేషికాదిదర్శన సహాకృతి మార్గములను విపులముగా దర్శించు రచించిన "ఆయుర్వేద తత్త్వవివేకము" అను గ్రంథముయొక్క పూర్వార్ధమును చదివితిని.

నా మిత్రులయందు ఆయాశాస్త్రములందలి పాండిత్యమిందు ప్రతిఫలించుచున్నది. సామాన్యముగా ప్రాచీనమగు ప్రాచ్య విద్యలయందు పాండిత్యముండు వారికధునాతన పాశ్చాత్య విజ్ఞానమునందు పరిచయము పూజ్యమైయుండుట పరిపాటి. వీరట్లుకాక నవీన వైజ్ఞానికులకుండు తత్త్వశాస్త్ర పరిచయమునకు తీసిపోని విజ్ఞానము కలిగి యుండిరని యీ గ్రంథమే నిరూపించుచున్నది.

ఈ మహనీయుని గ్రంథమునుతమపత్రికలో సావకాశముగా ప్రకటించి వైద్యలోకమున కుపకారమును జేసిన "శ్రీ ధన్వంతరి" పత్రికాధిపతులు ప్రశంసా

పాత్రులనకతప్పదు. అచిరకాలములోనే మిగిలిన భాగమునుగూడ గ్రంథకర్తగారు వైద్య లోకమున కందజేతురని ఆశించుచున్నాను.

బహుకాలమునుండి ఆయుర్వేద వైద్యులు కనుచుండుకలలు కాలపరిపాకవశము నను, దేశపరిపాలకుల మనః పరిపాకవశమునను ఏనాడైన ఫలించి ఆయుర్వేద కళా శాలలు సర్వలక్షణోపేతముగా నెలకొల్పబడి సక్రమ పాఠ్యక్రమ మేర్పడు శుభ సమ యము వచ్చినచో నిట్టి సద్గ్రంథములు పాఠ్యములలో నగ్రస్థానమును లభింపగలవని నా దృఢవిశ్వాసము.

నా మిత్రులితోధిక సముత్సాహముతో దామింతవఱకు చేసిన యీావత్కృషి ని గ్రంథరూపమున నిట్లే ప్రకటించి ఆయుర్వేద వైద్యలోకమునకు హస్తావలంబము నిచ్చుటకు ఆయుర్భాగ్యమును, స్వస్థజీవనమును లభించి మనుదురుగాక యని యాశా సింపుచున్నాను.

తి ప. రామానుజస్వామి.
(రామతీర్థము,) విశాఖ జిల్లా.

... ... ...

శ్రీ రాణీ ప్రసాదచయనులుగారు రచించిన 'ఆయుర్వేదతత్వవివేకత్త్వము'ను తుద ముట్ట ఆసక్తితో చదివి నేనెంతో ఆనందించినాను. ఆయుర్వేదతత్వము నెరుగ గోరు వారందరును, తప్పక దీనిని చదివి జ్ఞానాభివృద్ధిని చేసుకోవచ్చునని నాతలంపు.

ఆయుర్వేదార్థములను క్షుణ్ణముగా నెరిగి పాఠము చెప్పగలవారేఅరుదుగానున్న ఈదినములలో అన్య శాస్త్రార్థములనుగూడ కూలంకషముగా నెరిగి, ఈశాస్త్రముతో సమన్వయపరిచి గ్రంథమును రచించుట సామాన్య విషయముగాదు. జ్యోతిశ్శాస్త్ర ముతో సమన్వయపరిచి, విషయవిస్తరణ జేయుట అటుండ, అందును ఆధునికమైన 'ఫిసిక్సు' శాస్త్రవిషయములగూడ నెరిగి, ఆయుర్వేద తత్త్వార్థములతో సమన్వయ పరిచి, ఈ గ్రంథమును రచించిన శ్రీ చయనులవారి పాండిత్యము, ప్రతిభ, విమర్శనా పాటవము నాకెంతో ముచ్చట గొలిపినది.

అభిమానమునువీడి చెప్పవలెనంటే నేనెన్నో క్రొత్తవిషయములను అర్థము చేసుకోగలిగినాను - వీరిగ్రంథపఠనమువల్ల.

పూర్వార్థమైన ఈ గ్రంథమునకు ఉత్తరార్థమునుగూడ పూర్తిచేసి శ్రీచయ నులుగారు ఈ గ్రంథ సమగ్రస్వరూపమును ఆంధ్ర వైద్య లోకమునకందిచ్చెదరు గాక యని ప్రార్థించుచున్నాను.

శ్రీ చయనులుగారివంటి ప్రతిభావంతులైన పండితులు ఇట్టివారురచించిన విమ ర్శాపూర్వకమైన గ్రంథములేయిప్పుడు మనకు కావలసినవి.

ముక్త్యాల, 25—11—55

వేటూరి శంకర శాస్త్రి.

M. Koteswararao. M, A, B Sc. (Hons).
Lecturer S. R. R. & C. V. R. College. VIJAYAWADA.

When I was asked to write an opinion about this great book, I felt diffident and incompetent. But the profound erudition and scholarship of the author and his earnest desire, have made me bow to his wish.

Science of Ayurveda, suffered in popularity, due to lack of critical literature and modern experimental technique. But, anybody, who has taken pains to study, knows that the historical and traditional background is really vast and highly intellectual. Modern medicine is based upon Physiology and Therapeutics. But according to our Hindu Science, there are many abstract, invisible forces active in our system. They cannot be detected by stethoscopes and instruments. The basic principle of Homeopathy, that the prescription should depend on the nature of the patient as well as the ailment was fully recognised by Ayurveda. Not only that, they went further andcoherently put together the interdependance of seasons, planets, drugs and human nature and Physiology.

The author is a seasoned teacher of this science for many years. He has a perfect grasp of all the connected sciences like Astrology, Chemistry Physics, Astronomy and Materia Medica. The extraordinarypains, he must have taken to give a rational and Scientific basis for many theories of Ayurveda, compel our great admiration. I believe, this is the first book of its type and will be an eyeopener to any intelligent student of science.

The zeal and the spirit with which the author expounds this unique synthesis of various branches of knowledge, is really celestial. He tells, me that he has undertaken this work to leave his critical approach and original thesis to the posterity.

In the portion between 44 — 55 pages, the author has given a correct and detailed account of electronic theory and subatomic Physics. He has gone deep and explained the genesis and behaviour of atoms. All his conclusions are in conformity with the latest views on the subject.

I feel that more books of this kind, will certainly stimulate the interest of scientists in Ayurveda and raise it to the pedestal, which it richly deserves The monumental and inspired researches and teachings of sages like Dhanvantari, Charaka, etc, cannot be allowed to rust away in the running of time They must be made to shine and help humanity.

E. V. Seshavataram. ( Lectur in chemistry. )
S. R. R. & C. V. R. College. VIJAYAWADA.

I am specially interested in the section on Anutpatti, dealing with periodic classification of elements and atomic theory. The autor must be congratulated the excellent translations adopted by him for some technical terms in English. This shows that it is posible to express seientific theories with ease and felicity, in our mother tongue Telugu.

The author shows that the concepts regarding the fundamental particles are not new to our ancient seers. The ideas pertaining to Peelu Pakam and Pithara Pakam desrve to be carefully pondered over. At least this much is certain. The ideas expressed by Kanada in his Vaisestrikadarsana are certainly more advanced than the atomic theories of ancient greeks.

# విషయసూచిక.

# తప్పు ఒప్పుల పట్టిక.

| పేజి, | వంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3- | 8 | ఇట్లె | ఇట్లే |
| 4- | 20 | ఈక్వినాక్షల్ | ఈక్వినాక్షల్ సర్కల్ |
| ,,- | 22 | Declin. | Diclin. |
| 5- | 13 | మేఘ | మేష |
| 6- | 16 | విసర్గె | విసర్గె |
| ,,- | 29 | 30–32 | 30–22 |
| ,,- | 31 | 22–98 | 22.98 |
| 8- | 4 | 26.38 సూ | 26-అ38-సూ |
| 8- | 31 | నున్న | నున్న |
| ,,- | 32 | జాతక | జాత |
| 9- | 10 | అగ్నిష్టో | అగ్నిష్టో |
| ,,- | 14 | ఛిదమూ | చిమూ |
| 10- | 25 | ష్వనుగుణేష్వే | ష్వనుగుణేష్వే |
| 11- | 3 | శుతి | శ్రుతి |
| ,,- | 6 | సోధిష్టా | సోధిష్ఠా |
| ,,- | 10 | ధను | ధమున |
| ,,- | 22 | మొకటి | మొకటి |
| 12- | 14 | షడ్వి | షడ్వి |
| 13- | 15 | ప్రావట్వృ | ప్రావృట్ప |
| 14- | 1 | నభవతి | నభవతి |
| ,,- | 2 | 7 అ. | 8 అ. |
| ,,- | ,, | నక్షు | నక్షు |
| ,, | 32 | చ సూ 7 | చ సూ 8 |
| 15- | 15 | గ్రహించు | గ్రహించి |
| 16- | 6 | ములందు | మునందు |
| 17- | 16 | పెనుగు | పెరుగు |
| ,,- | 21 | కు పోద్బల | కుపోద్బల |
| ,,- | 26 | అశ్విన | ఆశ్వీన |
| ,,- | ,, | యటె | యట్లె |
| 19- | 2 | తను | తు |
| 23- | 2 | మనసులో | మ..ములో |
| 24- | 4 | వత్వా | యేత్వా |
| 25- | 1 | చార్యె | చార్యై |
| 26- | 18 | యేత | వత |
| ,,- | 21 | దైనా | దైవా |
| ,,- | 25 | చైత | చైతె |
| 30- | 5 | చున్నది | చున్నవి |
| 33- | 1 | భిన్నాధి | భిన్నాధి |
| ,,- | 2 | లోకి | యొకి |
| 34- | 5 | రసాద్యె | రసాద్యై |
| ,,- | 11 | చిత | చిత్ర |
| ,,- | 23 | ప్రభా | ప్రభా |
| ,,- | 25 | స్వైవ | స్వైవ |
| 35- | 7 | దంత్యాతి | దంత్యాది |
| ,,- | 21 | చక | చక్ర |
| 36- | 7 | పరిశిష్ట | పరిశిష్ట |
| ,,- | 15 | కులునును | కులును |
| 37- | 8 | పర్యంత | పర్యంత |
| ,,- | 12 | పీఠర | పిఠర |
| ,,- | 13 | పీఠర | పిఠర |
| ,,- | 21 | ఘటమును | ఘటమును |
| 38- | 31 | పరమాణువులవె | పరమాణువు |
| 39- | 22 | భావమును | భావమును (లనె |
| 40- | 4 | సహజము | సహము |
| ,,- | 7 | ఇట్లె | ఇట్లే |
| ,,- | 15 | Natric | Nitric |
| ,,- | 16 | ఇట్లె | ఇట్లే |
| ,,- | 25 | కటాలిక్ | కెటాలిక్ |
| 41- | 22 | యద్దైవ | ద్యైరేవ |
| ,,- | ,, | స్వదైవ | స్త్రైరేవ |
| ,,- | 25 | దిని | దీని |
| 43- | 11 | దవ్య | ద్రవ్య |

| పేజీ, పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 44- 3 | మున | ముమన |
| ,,- 5 | కల్పనా | కల్పనాః |
| 45 పేజీతప్పులకు ఎరాటా చివరచూడుము | | |
| 46-18 | వాలియం | హీలియం |
| 47-11 | అవిగాక | వానిలోలేయర్ల సంఖ్యకు |
| 47-18 | గానహైడ్రోజన్‌లో | అట్లులేయ |
| | నుండుసంఖ్యనుమించి | (రు |
| | లేయరు | |
| 48- 6 | (రేర్) రేర్ బఫ్స్ | రేర్ యర్ థ్స్ |
| ,,- 7 | హాఫియం | హాఫ్నియం |
| ,,- ,, | రీనియం | ర్హీనియం |
| 48-14 | రోము | జీరో |
| ,,-15 | ఫొరాన్, కొరాన్ | ఫ్లోరీన్, క్లోరీన్ |
| ,,-18 | చనిది | చనివి |
| 48 19 | ఇక్లై | ఇట్లే |
| 49-14 | బెకరల్ | పి మురీక్యూరీ |
| ,, 20 | వర్తనం | వర్తనసం |
| 50-10 | పంచ | పంచీ |
| ,,-11 | [illegible] | అపంచ |
| ,,-12 | త్రిద్గం | తిత్తి ద్గం |
| ,,-26 | సంగతో | పంగలో |
| ,,-30 | అగ్నిషస్నీ | అగ్నిస్నీ |
| 51-7 | భూతెద | భూత |
| ,,- ,, | అయినదని | అయిదని |
| ,,-1[illegible] | [illegible]భా | నిర్బభా |
| 52 1 | [illegible] | 32—32 |
| ,,-[illegible] | [illegible] | పైని |
| ,,-26 | ఎల్లక్లా | ఎలక్ట్రా |
| 53- 2 | బెలీరియం | బెరీలియం |
| 53- 3 | రిన్ | రీన్ |
| 55-10 (ఈపంక్తిక్రింద) | | సమాన విచిత్రప్రత్యయారబ్ధ ద్రవ్య నిరూపణము |
| ,,-14 | ములభేద | ములు అనిఅర్థము చెప్పవలెనేగాని మహాభూతముల |
| 57-29 | సర్పిః | సర్పిః |
| 59-27 | నల | వలన |
| 60-15 | నిశ్చ | నిశ్చి |
| ,,-29 | కృతము | కృత్యము |
| 61- 3 | తరతను | తరతమ |
| ,,- 4 | జన్య | జనక |
| 63 10 | పాయశః | ప్రాయశః |
| ,,-16 | పకారమే | ప్రకారమె |
| 64-9 | ద్యనుచిత | నుపచిత |
| 65-28 | మున | మును |
| 66-13 | జెప్పన | జెప్పిన |
| ,,-27 | త్వాపచిత | త్వానుపచిత |
| ,,-32 | వ్యవాయత్వా | వ్యవాయక్షయిత్వా |
| 67-11 | రసాయనమును | రసాయనము |
| ,,-17 | యనకు | యనమునకు |
| 68-1 | భ్వరక | భర్త్రుక |
| ,,-18 | త్వాంశ | త్వాంశ |
| 69-6 | రహితో | సహితో |
| ,,-27 | దేపా | దీపా |
| 70 15 | తివైః | తిలైః |
| ,,-17 | దగం | దుగ్ధం |
| ,,-25 | నయ | నీయ |
| ,,-32 | స్పస్థో | స్వస్థో |
| 71-1 | కరణం | కరణంచ |
| ,, ,, | ప్రదర్శ | పదర్శ |
| ,,-16 | ముకు | మును |

| పేజీ, పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 72—9 | దెహి | దేహి |
| 73—9 | ఈపంక్తి క్రింద13పంక్తి నుండి4పంక్తులు చదువవలెను. పిదప 10 పంక్తుల గాయతుశిపంక్తులున్ను 17 18పంక్తులున్ను కలిపిచదువవలెను. | |
| 76—3 | ప్రకృతులు | 7ప్రకృతులు |
| ,,—4 | యథష్టించుచు | మగుచు |
| ,,-11 | చున్నవి | చున్నది |
| 76-14 | దాగ్యో | దాఖ్యో |
| ,,—15 | స్వాహా | త్వాహార |
| ,,—21 | నిధ్యనీ | నిధ్యని |
| ,,—22 | శరర | శరీర |
| 77—1 | నిధీయ | విధీయ |
| 79-24 | భిధాయ | భిధీయ |
| ,,-34 | 206 | 20—అ— |
| 80—6 | లక్షణ | ఫలిత |
| 80—7 | కిరా | కరా |
| ,, 10 | నిని | ని |
| 80-21 | వాసి | ప్రవాసి |
| 80 25 | రేని | లేని |
| 84—1 | సాధి | పాధి |
| 84 24 | వర్మ | దర్మ |
| 86 10 | నని | వని |
| 86-25 | గుణప | గుణ |
| 87—22 | సలితా | సవితా |
| 87 22 | దని | దీని |
| 83 21 | వాతగు | వాతముగు |
| 90—2 | స్థాన | స్థానీయ |
| 94 5 | ప్రతిహార | ప్రతిహారి |

45 పేజీలో ఎలిమెంట్సు నంబరు.

| పేజీ, పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 4 | జెరీలియం | బేరియం |
| 10 | నియాన్ 9 | నియాన్ 10 |
| 31 | గాలియం | గాల్లియం |
| 35 | బ్రోమీన్ | బ్రామైన్ |
| 37 | రొబీడియుం | రుబుడియం |
| 38 | స్టాన్షియం | స్ట్రాన్టియం |
| 40 | ఝిర్కాన్ | జిరికాన్ |
| 46 | వెలెడియం | వెల్లెడియం |
| 52 | టెలుర్యారియ | టెలుర్యారియం |
| 55 | సీజియం | సీసియం |
| 85 | రీనియం | ర్హీనియం |
| 86 | రాడాన్ | రేడాన్ |

N, B ...... ...... ......
79,80,81,82 ఎలిమెంట్లపంక్తిని ఒకలైను క్రిందికి దించి చదువ వలెను.

48-10 తప్పు: బడినవి; ఒప్పు: బడినవి. ఇది గాక1954 వసంత్సరంవరకు యీామధ్యకాలములో నెప్ట్యూనియం ప్లూటోనియం: మొదలగు...87 మూలతత్వములు కనిపెట్ట బడినవి. కాని వానిస్వరూప స్వభావములు సరిగా తెలియుట లేదు.

50 2 సంభవించును. ఈప్రోటానులననుసరించియుండునని తర్కించబడిన పాజిట్రాన్లుగూడ ఎటామిక్ వెయిట్ కుతోడ్పడును.

81 4 జెప్పినను అవయవిత్వము గుణకర్మలు గలది ఆమూర్తముకాదు అనెడి

91 16 అనెడి మః రూప; అనబోలిజం—కెటబోలిజం మెటబోలిజం అనెడి ప్రపాద రూప

*

# ఆయుర్వేద తత్త్వ వివేకము
## (పూర్వార్ధము)

శ్లో. ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేదిత్యుక్తేః పరమార్థతః
యతస్స్యాదాయు రారోగ్యం ముహుర్ధ్యాయతి యద్ద్విజః
యద్జ్ఞానాన్మనుజోఽమర్త్యః స్యాజ్జగన్మంగళప్రదం
త్రయీమయస్య యద్భర్గః సావిత్రం తద్ధి ధీమహి॥

ఆర్యులారా !

"కుశలాన్న ప్రమదితవ్యం" అనెడి శ్రుతినిబట్టి ప్రతి మానవునకు తన యారోగ్యమును గాపాడుకొనుట యావశ్యకము. అట్టి ఆరోగ్యమును చేకూర్చుకొనుటకు నిర్దుష్టమగుమార్గము "ఆయుఃకామయ మానేన ధర్మార్థ సుఖసాధనం। ఆయుర్వేదోపదేశేషు విధేయః పరమాదరః" [వా. సూ. 1 అ. 1 శ్లో] ఇత్యాది ప్రమాణములచే నాయుర్వేదము తప్ప వేరొకటి కానరాదు. దీనికి ప్రకృతమున చరక—సుశ్రుత—వాగ్భటము లనునవి మూలగ్రంథములుగా నెన్నబడుచున్నవి. వానిలో విరోధాభాసలు కొన్ని యుండుటచే నయ్యవి నిశ్చయ జ్ఞాన ప్రతిబంధకము లగుటయేగాక అపార్థ—సంశయములను గూడ గల్గించుచున్నవి. వానిని నివారించుటకై కేవలాయుర్వేద సహాయమేగాక తర్క - సాంఖ్య — జ్యోతిష - రసాయన— పదార్థవిజ్ఞానాది శాస్త్రముల సహాయముగూడయవసరమైయున్నది. సుశ్రుతుడుగూడ నీ విషయమై "ఏకంశాస్త్ర మధీయానో నవిద్యా చ్ఛాస్త్ర నిశ్చయం। తస్మాద్బహుశ్రుతః శాస్త్రం విజానీయాచ్చికిత్సకః" (సు. సూ 4 అ 7 సూ) అని చెప్పియున్నాడు. ఇది యుక్తిసహముగూడ యగుచున్నది. యెట్లన:— మనుజుని కుండు అవయవములు పరస్పరము గుణ-కర్మ-స్వరూపములలో పూర్ణమగు భేదముగలవైనను అవసరమైనపుడు స్వాంతపరిచారకులువలె వాని (మనుజుని)కార్యములందుపయోగపడుటలో వెనుకాడవు. ఉ॥ కాలులో ముల్లు విరిగినదనుకొనుడు. తోడనే ఆకాలి జోక్యము మన కెందుకని యూరకొనక కన్ను ఆ ముల్లును వెదుక నారంభించును. చేయి యూడబెరుకుట కుద్యమించును. నోరు నూదికొరకు గోలచేయును. కారణ

మేమనః—వీనిలో వీనికి పరస్పరము గుణ—కర్మ—స్వరూపములలో పూర్ణమగు భేద మున్ననూ ఇవన్నియు తమ యజమానుని క్షేమముగోరుటలో నైకాగ్ర్యత గలవగు టచే సమయము వచ్చినపుడు "వయం పంచోత్తరం శతం" యనున శ్లోకటియే యగును. గనుకనే "సర్వేషాంశాస్త్రాణాంపరబ్రహ్మణి తాత్పర్యత్వాత్" అని యభి యుక్తవచనము గూడగలదు. దీనిం బట్టిజూడ సర్వశాస్త్రములున్ను, స్వరూపాదు లలో పూర్ణభేదము గలవైనను ఫలితమునందు యొకే తత్వమును తెలుపుచున్నట్లు తేలుచున్నది. యీ విషయము ప్రచారమందుగూడ గలదు. యెట్లనః—

చరకుడు తా జెప్పబోవు వైద్యశాస్త్రమునకు కణాదఋషిప్రోక్తమగు ద్రవ్య —గుణ—కర్మ—సామాన్య—విశేష సమవాయములనెడి షట్పదార్థములను బునాది వేసి నాడు. సుశ్రుతుని శారీరాద్యంశములకు కపిలసాంఖ్యము చేయూతయిచ్చినది. ఋతు విభాగాది విషయములను బాగుగా దరచిజూడ జ్యోతిశ్శాస్త్ర పరివర్తనమే వైద్య శాస్త్రమని బొడసూపకమానదు. ద్రవ్యముల కార్యక్రమముల దిలకించినచో రసా యన—వైద్యశాస్త్రముల కభేదము వాటిల్లక మానదు. పదార్థ విజ్ఞానశాస్త్రము— నిఘంటువు మొ॥ వాటి వర్ణనలను గమనింప నవి వైద్య శాస్త్రోక్తదేశములే యని దెల్లమగుచున్నది శాఖారూపములగు వీనికన్నిటికి అధర్వణవేదము స్కంధస్థానీయు మని జెప్పకతప్పదు ఇట్లే శాస్త్రములన్నియు నాయుర్వేదమునకు సహకారులే యగుచున్నవి. ఈ తీరున ఋషులుజేసిన పరస్పర శాస్త్రానుప్రవేశరూపమైన ప్రచార మునుబట్టియైనను పై జెప్పబడిన సర్వశాస్త్రైకాగ్ర్యతచదువరులకుగోచరింపకబోవునా! గోచరించును. పిమ్మట యేవిషయమును విమర్శింపబూనిననూ ఇతరశాస్త్రజ్ఞానమావ శ్యకమని దెలియకుండునా? తెలియును. అందువలన సామాన్యముగా శాస్త్రము జెప్పిన విషయముల నాచరించుటకు ఇతర శాస్త్రజ్ఞాన మావశ్యకము కాకున్నను విషయ విమర్శనకు అనగా సోపపత్తి జ్ఞానమునకు మాత్ర మావశ్యకమని తెలియును. యెట్లనః—ఉ॥ పిత్తజ్వరమునందు పర్పాటక కషాయ మీయవలెననెడి శాస్త్రోపదేశ ముసు బట్టి చికిత్సనుజేసి ఫలమునందుటలో ఇతరశాస్త్రజ్ఞాన మనావశ్యకమైనను పర్పాటకమునకు పిత్తజ్వరహారత్వ మెట్లు సంభవించెనని విమర్శకు బూనినచో వాది ప్రతివాదుల జ్ఞాన బలానుగుణ్యముగా సురసాంజనేయులవలె వాదములు పెరుగుట కును, తుదకు పరబ్రహ్మలో విలీనమగుటకును శాస్త్రాంతరజ్ఞాన మావశ్యకమని తెలియుచున్నదిగదా! అట్టి విమర్శజ్ఞానాభిలాషులకొరకు "ఆయుర్వేద తత్వ వివేక" మనుపేర యీ చిన్ని పొత్తమును రచించబూనితిని.

## ఆయుర్వేద తత్వ వివేక శబ్దార్థ విచారము

ఈ చిన్నిపొత్తము విషయములను దిఙ్మాత్రముగా సూచించుచున్నదైననూ,

క్షీరము దధిగా మారుటకు తక్రబిందువువలె సుధీవరుల జ్ఞానప్రసారమునకు తోడ్పడుచుండును. ఇందలి తత్త్వశబ్దము ప్రకృతి మహదాది పంచవింశతితత్త్వబోధకమైననూ ఆయుర్వేదమునందు "భూతేభ్యోహి పరంయస్మాత్ నాస్తి చింతా చికిత్సితే॥" (సు. శా. 1 అ.) "షడ్ధాతు మయః పురుషః" ఇత్యాది వచనములచే మహాభూతములకు పైనున్న మూలప్రకృత్యాదులను విడనాడి జీవయుక్త పంచమహాభూతములను మాత్రము ప్రకృతోపయోగముగా పరామర్శించుచున్నది. ఈ పంచభూతములనుండి త్రివృత్కరణ విధానమున, మధ్యనున్న భూతత్రయమునుగ్రహించిరి. గాన వాటివలన క్రమముగా వాత-పిత్త-శ్లేష్మములు నిష్పన్నములైనవి. ఇట్లే వాత పిత్త-శ్లేష్మములు తత్త్వపదముచే నిచట వాచ్యములగుచున్నవిగాన ఆయుర్వేద తత్త్వము లనగా వాత-పిత్త - శ్లేష్మములని స్పష్టమగును; వానిని గూర్చి వివేకమనగా విమర్శన పూర్వకజ్ఞానమిందు కలదు గనుక దీని కీ నామ మన్వర్థమాయెను.

## ఆయుర్వేద చికిత్సలు - సార్వకాలిక ఫలప్రదములు

మరియు తత్త్వమనగా "కల్పాంత స్థాయిత్వం తత్త్వస్యలక్షణం" అనెడి లక్షణ వాక్యమునుబట్టి సృష్టిలగాయతు లయమువరకు యుండెడి పదార్థమగుటచే నట్టి కల్పాంత స్థాయిత్వ లక్షణముగల వాతాదిదోషముల నాధారముజేసికొని బుట్టిన ఆయుర్వేదమందలి చికిత్సలు పురాతనకాలమున జెప్పబడినవైనను నేటికిన్నీ, నేటికన నేల మానవశరీరమున్నంతవరకునూ మార్పునొందక యొకేతీరున దేదీప్యమానము లగుచూ సార్వకాలిక ఫలప్రదములుగనే యుండుునను విషయముగూడ యీ తత్త్వ పదముచే సూచింపబడుచున్నది. దానంజేసి "ఆయుర్వేద చికిత్సలు పురాతన కాలీనము లగుటచే ప్రకృతకాలమున కనుపయుక్తములు" అనెడి యధునాతనాక్షేపణలు నిరస్తము లగుచున్నవి.

అవతరణిక:—ఇచట చికిత్సలో కాల మత్యవసర మగుటచే కాలరూపమగు ఋతువుల విమర్శనము ప్రస్తుతాంశముగా నున్నది. ఆ విమర్శనమువలన ఆయుర్వేదము జ్యోతిశ్శాస్త్ర పరివర్తనమే యని తేటబడగలదు. గావున అందుప సంబంధించిన జ్యోతిశ్శాస్త్ర పరిచయముతోడ పరివర్తనమును సంక్షేపముగా ముందుగా వివరింప బూనితిని.

## జ్యోతిశ్శాస్త్ర పరివర్తన నిరూపణము

జ్యోతిస్సు అనగా "అగ్నిర్జ్యోతి ర్జ్యోతిరగ్నిః" "సూర్యో జ్యోతి ర్జ్యోతి స్సూర్యః "అనెడి శ్రుతులనుబట్టి అగ్ని-సూర్యుడు మొ॥ తేజఃపదార్థములు జ్యోతిస్సు లనబడును. వానిని ప్రతిపాదించునది జ్యోతిశ్శాస్త్రము. దీనినిగూర్చి ఉత్తరార్థమున

విస్తరింతును. ప్రకృతోపయోగి ఋతువులు కాలరూపములుగదా! అట్టి కాలము నకు పై జెప్పిన జ్యోతిస్సులలో నొకటగు సూర్యుడనునదిసూచకపదార్థముగానున్నది. యీ విషయమునే "సూర్యోమరీచిమాదత్తే। సర్వస్మాద్భువనాదధి। తస్యాః పాక విశేషేణ స్మృతం కాలవిశేషణం" అని యిట్లు శ్రుతి ఘోషించుచున్నది. గాన కాల బోధక శాస్త్రముకూడ జ్యోతిశ్శాస్త్ర మనబడును. ప్రకృతవిషయమును వివరించు చుంటిని. గమనింపుడు.

"ప్రాణాదిః కథితో మూర్తః త్రుట్యాద్యోఽమూర్తసంజ్ఞికః" (సూ. సి. 1అ.) అనెడి ప్రమాణమునుబట్టి ప్రాణాది పరిమేయము మూర్తమనియు. తద్భిన్నమగు అపరిమేయము అమూర్తమనియు, కాలము రెండుగా విభక్తమైనది. ఇట్టి మూర్త కాల భాగములలో నొకటగు సంవత్సరమును ప్రజాపతియనిరి. కావున నయ్యది ముఖ్యమైన కాలభాగమగుచున్నది. "సంవత్సరోవై ప్రజాపతిః" అని శ్రుతి॥ సంవత్స రమనగా సూర్యునియొక్క భగణకాలము. అనగా సూర్యుడు అశ్వనీనక్షత్ర ప్రథమక లయందు ప్రవేశించినది మొదలు తిరిగి యచటకు జేరినట్లు [1]ఆపాతదృష్టికి కాన వచ్చెడి కాలము. దీనినే "పౌష్ణాంతో భగణః స్మృతః" (సూ. సి. 1అ. 27 శ్లో) అని సూర్యసిద్ధాంతము జెప్పుచున్నది. ఇయ్యది ప్రకృత పాశ్చాత్యసమ్మతమైన సూక్ష్మ వేధసిద్ధ భగణకాలముకంటె భిన్నమైనది. [2]సూర్యుడు తిరిగెడి యీ మార్గమునకు క్రాంతివృత్తము (Ecliptic = ఇక్లిప్టిక్) అని పేరు. మనము నివసించియున్న యీ భూమియొక్క దక్షిణోత్తర ధృవముల మధ్యభాగమగు నిరక్షదేశమున కభిముఖ ముగా ఆకాశములో ప్రాక్పశ్చిమములకు వ్యాపించిన వృత్తమునకు విషువవృత్తము Equi - noctial = ఈక్వినాక్షిల్) అని పేరు. యీ వృత్తమును పై జెప్పిన క్రాంతి వృత్తము సుమారు 24 అంశలు తిర్యక్త్వము కలుగునట్లు రెండు సమభాగములుగా ఛేదించుచున్నది. (తిర్యక్త్వము= Declin = డిక్లిన్) యీ ఛేదించుటలో విషువ వృత్తమున రెండు స్థలములయందు కోతలు బడును; ఈ కోతలనే సంపాతములు

---

1 ఆపాతదృష్టి - బాహ్యమందు చూచినతోడనే స్ఫురించెడిజ్ఞానము. వాస్తవమగు సూర్యభగణమనగా "మహాయుగో వాస్తవసౌరవర్షః" అనెడి కాలమానోపపత్తి వచనప్రకారం 4320000 సంవత్సరములకాలము.

2 ఇచట సూర్యుడు తిరిగెడి అనగా భూమితిరిగెడి అని అర్థము. సూర్యునిచుట్టూ భూమి తిరుగుట వాస్తవమైననూ ఆపాతదృష్టిచే సూర్యుడే మనభూమిచుట్టూ తిరుగుచున్నట్లు గానవచ్చుచున్నదిగాన యట్లే వ్యవహారము గల్గినది. ఇట్టి వ్యవ హారము "అదోఖ్యవా ఏష ప్రాతరుదేతి" అపస్సాయం ప్రవిశతి" ఇత్యాది శ్రుతుల యందుగూడ గానవచ్చుచున్నది.

(Equinoxs = ఈక్వినాక్సెస్) అందురు. అందులోనొక సంపాతము అశ్వనీప్రథమ కలయందు 3స్థిరముగా నున్నదనుకొనుడు. అపుడు దీనిని స్థిరమేష సంపాతమందురు. దానికి 180 అంశములపైని రెండవదగు తులాసంపాతము గలుగును. ఈ రెండుసంపాతములకు మధ్య అనగా మేషమునుండి తులవరకు యుండెడి క్రాంతివృత్త భాగమును ఉత్తరగోళమనియు, కర్కవృత్తమనియు Tropic of cancer=(ట్రాపిక్ ఆఫ్ కాన్సర్) అనియు అందురు. ఇయ్యది భూమియొక్క నిరక్షదేశమునకు ఉత్తరముగా

---

3 సంపాతముగతి గలదైనను "స్థిరముగా నున్నదనుకొనుడు" అనుమాటను విషయ సుబోధముకొరకు వ్రాసితిని. వాస్తవమున చరమేషము ననుసరించియె భూమి యందలి శీతోష్ణస్థితులు మారుచుండును. గాన ఋతువులు మారుచుండును. అట్టి ఋతువులనుబట్టి ఫలములు భేదించుచుండును. ఇందులకు జ్యోతిర్వైద్య శాస్త్రములలో ననేక దృష్టాంతములుగలవు. మచ్చుకొరకు కొన్నిటినిటజూపెద:– ఉ[ శ్రీరాముని జాతకములోని నవమితిథి – పునర్వసు నక్షత్రము–సూర్యునకు ఉచ్చ అనగా సూర్యుడు మేషములోనుండుట–అనెడి విషయములు మూడున్ను చర మేష పక్షముననే సంభవించునుగాని స్థిరమేషపక్షమున సంభవింపవు. ఇట్లే వైద్య శాస్త్రమునసుశ్రుతుడు వాతాది దోషములయొక్క ఉపచయ–ప్రకోప– ఉపశమములు నిమిత్తము భాద్రపదమాసము మొదలు రెండేసి మాసముల కొక ఋతువుచొప్పున లెక్కించి క్రమముగా వర్ష – శరత్ – హేమంత – వసంత – గ్రీష్మ – ప్రావృట్ అని 6 ఋతువులను గల్పించెను. ఉక్తంచ:–ఇహతు వర్షాశరద్ధేమంత వసంత గ్రీష్మ ప్రావృషః షడృతవోభవంతి। దోషోపచయ ప్రకోపోపశమనిమిత్తం। తేతు భాద్రపదాద్యేన ద్విమాసికేన వ్యాఖ్యాతాః" (సు, సూ. 6. అ. 10 సూ.) అని. యీ ఋతుకల్పన చరమేషమునుబట్టి జేయబడెనని, దీనికి పూర్వసూత్రములో జెప్పబడిన మాఘ ఫాల్గుణాది ద్వంద్వములకు క్రమముగా శిశిరాది ఋతువుల నామకరణము స్థిరమేషమునుబట్టి అనగా సంపాతము అశ్వినిలో యుండునపుడు జెప్పిన "మధుశ్చ మాధవశ్చ వాసంతికా వృతూ" ఇత్యాది వేదవాక్యానుసారముగా జేయబడెననియు గ్రహించవలెను. మరియు యొకానొక కాలమున సంపాతము కృత్తికలోయున్నట్లుగూడ శ్రుతి జెప్పుచున్నది. యెట్లన:—కృత్తికాః ప్రథమం విశాఖే ఉత్తమం। తానిదేవ నక్షత్రాణి అనూరాధాః ప్రథమం అపభరణీ ఉత్తమం తాన్నియమ నక్షత్రాణి" ఇతి॥ దీనినిబట్టి సంపాతముయొక్క సంచారవశముచే ఫలములను నిర్ణయించవలెననియు, స్థిర మేషపక్షము సార్వకాలికము కాదనియు అయ్యది సూర్యసిద్ధాంతములో గ్రహసాధనకొరకు మాత్రము "పౌష్ణాంతో భగణః స్మృతః" ఇత్యాదివచనములచే గ్రహింపబడెననియు వ్యక్తమగుచున్నది.

24. అంశలవరకు వ్యాపించియుండును. తులనుండి మేషమువరకుయుండెడి క్రాంతి వృత్తభాగమునకు దక్షిణగోళమనియు మకరవృత్తమనియు(Tropic of capricorn_ ట్రాపిక్ ఆఫ్ కాప్రికార్న్) అనియుబేరిడిరి. ఇయ్యదినిరక్షదేశమునకుదక్షిణముగా 24 అంశలవరకూ వ్యాపించియుండును. ఈ సంపాతములలో సూర్యుడు గతివశముచే వచ్చి నొక్కొక రోజుండును. ఆ రెండుదినములను విషువద్దివసము లందురు. ఆ రోజులలో దిన - రాత్రి ప్రమాణములు సమముగా నుండును. ఇక సూర్యుడు ఉత్తరగోళమందలి కర్కట ప్రథమకలలో ప్రవేశించినతోడనే దక్షిణదిక్కున కభిము ఖుడగును. తులలో ప్రవేశించువరకు [1]వర్ష చతుర్థాంశకాలము పట్టును. అది సుమారు 3 మాసములుండును. అంతవరకు విషువవృత్తమునకు ఉత్తరదిశయందే యుండును. గాని వాడు దినదినమూ దక్షిణముగాబోవుచునే యుండును గాన యీ 3 మాస ముల కాలమును దక్షిణాయన ప్రథమఖండముగా గ్రహించిరి, ఈ ఖండమున సూర్యుడు దక్షిణాయనగతుడైనంతమాత్రమునబలహీనుడుగాక తులాదివిషువత్తునకు వచ్చువరకూ క్రమక్రమముగా చంద్రకళాన్యాయమున క్షీణించుచున్ననూ బలము గలిగియేయుండును కావుననే యీ కాలములో ప్రథమమున అమ్లరసము పిదప లవణ రసము అనెడి ఆగ్నేయరసములు బుట్టుచున్నవి.

తథాచోక్తం:-"సౌమ్యేనిసర్గేతయోశ్చాగ్నేయయోః (అమ్లలవణయోః) ఉత్పాదః కథమితి నవాచ్యం యతః బలప్రకర్షవతో ఉర్కస్య క్షీయమాణ బలస్యాపి విషువ పర్యంతం బలవత్త్వమ స్త్యేవేతివ్యుత్పాదితమేవ" (చసూ 6అ 7సూ వ్యా,) అని చక్రపాణి వచించెను. పిదప తుల లగాయితు మకరమునకు బోవుటకు సుమారు 3 మాసములు కాలముపట్టును. ఈకాలములో సూర్యుడువిషువవృత్తము నకు దక్షిణ దిశయందుండి గమనములోగూడ దినదినమూ దక్షిణముగనే బోవు చుండును. ఈ మూడుమాసములలో సూర్యుడు బలహీనుడుగా నుండును. మొత్తం 6 మాసములకు దక్షిణాయనమని పేరు. దీనినే విసర్గకాలమని వైద్యులనుచున్నారు.

---

1 ఇచట వర్ష చతుర్థాంశకాలమును స్థూలదృష్టితో చెప్పితిగాన సుమారు అను పదముపయోగింపబడెను. వర్షప్రమాణములు వేరు వేరు సిద్ధాంతములనుబట్టి వేరు వేరు విధములుగా గానవచ్చుచున్నవి. యెట్లన.

| | రో. | ఘ. | వి. | పర. |
|---|---|---|---|---|
| సూర్యసిద్ధాంతమున | 365 | 15 | 31 | 31 |
| సిద్ధాంతశిరోమణి | 365 | 15 | 30 | 32 |
| ఆర్యాభట సిద్ధాంతం | 365 | 15 | 31 | 15 |
| ఇంగ్లీమతప్రకారం సూక్ష్మయంత్రవేధ సిద్ధం | 365 | 15 | 22·98 | |

దీనినే రెండేసి మాసముల కొకఋతువు చొప్పున వర్ష – శరత్ – హేమంతము లని 3 ఋతువులుగా విభజించి వీనిలో క్రమముగా ఆమ్ల–లవణ – మధుర రస ములు బుట్టునని జెప్పిరి. ఉక్తంచ:– వర్షాశరద్ధేమంతేష్వృతుషు.....ఆమ్లలవణ మధురా యథాక్రమం'' ఇతి (చ. సూ. 6. అ. 7. సూ.) ఈ విసర్గ కాలములో సూర్యునకు బలము తగ్గుననియు అందుచే చంద్రునకు బలము హెచ్చునుగాన ఈ కాలము సౌమ్యకాలమనియు, ఇందు చంద్రుడు ప్రాణులకు బలమునిచ్చునుగాన విసర్గ కాలమనియు జెప్పిరి. విసర్గ మనగా యిచ్చుటయని అర్థము. అయితే యీ కాలము సౌమ్యముగాన ఇందు బుట్టెడి రసములన్నియు శీతవీర్యము గలవిగా నుండ వలెనుగదా! అట్లుగాక మొదటి రెండురసము లాగ్నేయము లగుటకు కారణమేమి? అనినచో సూర్యునకు బలము యొకేసారి తగ్గక పై జెప్పిన రీతిన్ క్రమక్రమముగా తగ్గుచుండునుగాన యీ దక్షిణాయనములో మొదటిదగు వర్షఋతువునందు బుట్టెడి ఆమ్లరసములో ఆగ్నేయాంశ మధికముగా నుండును. దానిపిమ్మట వచ్చెడి శరదృ తువునందు బుట్టెడి లవణరసములో ఆగ్నేయాంశ మల్పముగా నుండును. దాని వెనుక వచ్చెడి హేమంత ఋతువులో బుట్టెడి మధురరసములో 1 ఆగ్నేయాంశము బొత్తిగా తగ్గునుగాన లేదనియె చెప్పుచున్నారు. ఇట్లే మకరసంక్రాంతి మొదలు మేషవిషువమువరకు సూర్యుడు విషువవృత్తమునకు దక్షిణ దిక్కులోనుండియే యుత్తరాభిముఖుడై నడచుచుండును. ఇట్లు నడుచుకాలము సుమారు 3 మాసము లగును. ఈ కాలములో రవికి క్రమముగా బలము పెరుగును. గాని యొకేసారి బలముగలుగదు గాన యీకాల మాగ్నేయమైనను సౌమ్యగుణములు గలదిగనే యుండును. పిమ్మట మేషమునుండి కర్కటమువరకు రవి విషువవృత్తమునకుత్తర దిశలోనేయుండి ఉత్తరాభిముఖుడై నడుచుచుండును. ఈ నడకకు గూడ సుమారు 3 మాసముల కాలముబట్టును. ఇందగ్నిగుణ మధికముగానుండును. మొత్తము యీ 6 మాసములకు, రవిగతి యుత్తరదిక్కుగా యుండుటచే ఉత్తరాయణమనిరి. ఇందు సూర్యుడు ప్రాణుల బలమునాకర్షించునుగాన దీనిని చరకాదులాదానకాలమను చున్నారు. ఇందు రెండేసి మాసముల నొక్కొక్క ఋతువుగా విభజించి వానికి. శిశిర – వసంత – గ్రీష్మములని పేరిడిరి. ఈ ఋతువులలో క్రమముగా – తిక్త– కషాయ – కటురసములు బుట్టునని జెప్పిరి. ఉక్తంచ:– "శిశిర వసంత గ్రీష్మేష్వృతు షుయథాక్రమం రౌక్ష్యముత్పాదయంతో రూక్షాన్ రసాన్ తిక్త కషాయకటుకాంశ్చ అభివర్ధయంతో నృణాం దౌర్బల్యమావహంతి'' ఇతి॥ (చ. సూ. 6 అ. 6 సూ.)

---

1 యీ రసములయందలి ఆగ్నేయాంశముయొక్క న్యూనాధికభావము వీటివీర్యము లలోవ్యత్యాసముగా నుండును. దానినిగూర్చి రసవీర్యాదుల వైలక్షణ్య నిరూపణ మును జూడుడు.

రసనిష్పత్తివిచారణలో పెక్కుమంది పెక్కు భంగులను జెప్పినను, సంవత్సరమునకు ఆరే ఋతువులుగాన వానిలో బుట్టెడి రసములుగూడ ఆరేయని కొసకు సిద్ధాంతీకరించిరి. ఉక్తంచ—"షడృతుకత్వాచ్చకాలస్యోపపన్నో మహాభూతానామూనాతిరేక విశేష." ఇతి (చ. సూ. 26. 38 సూ.) అయితే షడ్రసములున్ను మహాభూతముల న్యూనాధికభావమును బట్టి పుట్టుచున్నవని యీ సూత్రములోనే "ఏవమేషాం షణ్ణాం రసానాం షట్త్వముప పన్నమూనాతిరేక విశేషాన్మహాభూతానాం" అని చెప్పియుండుటచే ఋతువులు రసములకు కారణములు కావని తోచుచున్నది. అందులకు చక్రపాణి, వ్యాఖ్యలో "యద్యపిచ ఋతుభేదేపిభూతోత్కర్ష విశేష ఏవకారణం; యదుక్తం "తావేతావర్కవాయూ" ఇత్యాది, తథాపి, బీజాంకురకార్యకారణ భావవత్సంసారానాదితయైవ భూతవిశేష ఋత్వోః కార్యకారణభావో వాచ్యః" హేమంతకాలె సోమగుణాతిరేకో భవతి శిశిరే వాయ్వాకాశాతిరేకః, ఏవంతస్యాశితీ యోక్తరసోత్పాద క్రమేణ వసంతా దావపి భూతోత్కర్షో జ్ఞేయః అని యిట్లు సమాధానమిచ్చి యున్నాడు. అనగా రసనిష్పత్తికి భూతములే కారణమని చెప్పుచున్ననూ, సంసార మనాదియగుటచే చెట్టుముందా? విత్తుముందా? అనెడి ప్రశ్నకు వలెనే భూత-ఋతువులకు కార్యకారణ భావము అన్యోన్యాశ్రయమని చెప్పవలెను. గనుక హేమంతమున సోమగుణాతిరేకము శిశిరమున వాయ్వాకాశ భూతాతిరేకము; ఇట్లే వసంతాదులలో ఆయాభూతము లధికమగుటయు అట్లా భూతము లధికమగుటచే ఆయా ఋతువులు నిష్పన్నములగుటయు. సంభవించుచున్నదని తాత్పర్యము. ఇట్లీ రసనిష్పత్తికి-మూర్తమగు కాలమునకు సమవాయ సంబంధము జూపబడినది.

## గ్రహములకు - వైద్యమునకు గల సంబంధము

పై జెప్పిన సంవత్సరరూప కాలమందలి దక్షిణోత్తరాయణములకు ప్రధానముగా చంద్రసూర్యులే కారకులయి "ద్వేకాలం విధత్తః"అనెడియభియుక్తవచనమునకు లక్ష్యమగుటచేతనున్ను ఆ చంద్రసూర్యులు "చంద్రమామనసో జాతః చక్షోః సూర్యోఅజాయత" (శ్రుతి) "అథసృష్టాం మనశ్చక్రే బ్రహ్మాహంకారమూర్తిభృత్ మనసశ్చంద్రమాజజ్ఞే సూర్యోక్ష్ణోః తేజసాంనిధిః (సూ. సి. 12 అ. 22 శ్లో||) అనెడి ప్రమాణములచే "మనసః ఖంతతోవాయు రగ్నిరాపోధరాక్రమాత్ గుణైక వృద్ధ్యాపంచైవ మహాభూతానిజజ్ఞిరే" (సూ. సి. 12. అ. 23 శ్లో) అనెడి భూతసృష్టికంటె విలక్షణమైన ప్రథమసృష్టియగుటచేత "అగ్నిషోమౌ మహాబలౌ" అనెడి వచనములకు లక్ష్యులై ఉష్ణశీతవీర్యములకు కారకులై బలాఢ్యులగుటచేతనున్న పై జెప్పిన ప్రకార మీ సంవత్సరాంశలగు ఋతువులలో బుట్టిన 6 రసములకు ఆశ్రయమగు ద్రవ్యజాతకమంతయు సౌమ్యమనియు - ఆగ్నేయ

మనియు రెండుగా విభజింపబడినది. సౌమ్యమువకే ఆప్యమనియు చాంద్రమనియు పేరు. ఆగ్నేయమునకు సౌరమని పేరు. ఇయ్యదియుక్షు స్నిగ్ధాదిగుణములు గలదిగాన గుణియనిగూడ జెప్పబడెను. పై జెప్పిన మధురాదిరసములు గుణములనబడును. గుణి—గుణములకు సమవాయ సంబంధముండును. అనగా గుణములేని గుణియు, గుణిలేని గుణమున్ను యుండదని భావము. అందుచే పైన జెప్పుటలో రసములు బుట్టుననగా అట్టి రసములుగల ద్రవ్యములు బుట్టునని తాత్పర్యము. రసనిష్పత్తిలో ప్రతిరసము పంచ భూతాత్మకమైనను దానియందు ప్రత్యేకముగా రెండేసిభూతము లధికముగా నుండునని "క్ష్మాంభోగ్ని క్ష్మాంబుతేజః ఖవాయ్వగ్న్య నిలగోనిలైః ద్వయోల్బణైః క్రమాద్భూతైః మధురాది రసోద్భవః" (వా. సూ. 10 అ. 1 శ్లో) అని యిట్లు వాగ్భటాదులు వచించిరిగాన ద్రవ్యాజాతము పై రీతిని అగ్నిషోమాత్మక మగుటచే రెండు విధములైనను తిరుగా పంచభూతాత్మకమగుటచే పార్థివ ఆప్య-ఆగ్నేయ-వాయవ్య—నాభసములని 5 గా విభజింపబడినది. ఇచట ద్రవ్యము పంచభూతాత్మకమైనను దేనియందేభూత మధికముగా నుండునో దానికా భూతముతో పేరును గల్పించిరి. ఇట్టి ద్రవ్యము నిష్పన్నమగుటకు "సూర్యోమరీచిదమాదత్తే సర్వస్మాద్భువనాదధి తస్యాః పాకవిశేషేణ స్మృతం కాలవిశేషణం" అనెడి శ్రుతినిబట్టి పాక మావశ్యకము. పాక మనగా విజాతీయ తేజస్సంయోగము.

ఉక్తంచః...“పాకోనామ విజాతీయ తేజస్సంయోగః (న్యాయబోధిని) ఆ పాక మనునది చంద్రసూర్యుల శీతోష్ణతలపై నాధారపడియున్నది. గనుకనే వారిరువురును జగద్రచనకు ముఖ్యకారకు లగుచున్నారు. ఆరచనయందు నైవిధ్యమును గల్గించుటకు పంచభూతము లావశ్యకములగుటచే భూగోళ గతములైన భూజలాది పంచభూతములు సూర్యచంద్రులచే పై ప్రకారము (అనగా "స్మృతం కాల విశేషణం" అనెడి శ్రుతినిబట్టి సూర్యరశ్మివలన కాలము బుట్టుచున్నది. గాన యట్టి దక్షిణోత్తరాయణ రూపకాలమువలన) పాకము నందుచుండగా వానియందు నైవిధ్యము గల్గించుటకు "తప్తేనతప్త మయసాఘటనాయ యోగ్యం" (కాలిన ఇనుము కాలిన ఇనుముతో కలుపుటకు యోగ్యమైనది) అన్నట్లు పాక దశనందుచున్న భూతములనే జేర్చుట యుచితము; అట్లుకానిచో బాగుగా నీరువలె కరిగినరాగి మొదలగు ధాతువులలోనంత వేధచేయతగిన పారదమును, తగు పాకము నందింపక అనగా కరిగింపక కలపినయెడల నయ్యది యారాగి మొదలగు ధాతువులను ఎట్లుస్వర్ణాదులరూపము నొందింపజాలదో యట్లే ప్రాణిరచనయందుగూడ యభీష్టసిద్ధిగలుగనేరకదోషములుగూడ సంభవించును. దానిని నివారించుటకై దయామయుడగు పరమేశ్వరుడు తన మనోనేత్రములనుండి చంద్రసూర్యులను సృజించినపిదప తన మనస్సునుండి ఆకాశాది పంచభూతములను సృజించి వానినుండి కుజాదితారాగ్రహ పంచకమును రచించెను. ఉక్తంచః— అగ్ని

షోమహాభౌను చంద్రా తత స్త్వంగార కాదయః తేజోభూఖాంబు వాతేభ్యః క్రమశః పంచజజ్ఞిరే" (సూ. సి. 12 అ.) అనగా అగ్ని — భూమి — ఆకాశము—జలము—వాయువు—అనువానివలన క్రమంగా అంగారక-బుధ-బృహస్పతి-శుక్ర-శనులు బుట్టిరని భావము; ఇంకను మన సూర్యునిచుట్టు తిరుగుచున్న నెప్ట్యూన్ - యురేనస్ ప్లూటో- మొదలగు ఇతరగ్రహము లధికముగా నున్నను మన భూగోళమండలి ప్రాణిరచన కావశ్యమగు పంచమహాభూతములయొక్క పక్వాంశముల నిచ్చుటకు నీ కుజాదిపంచకమే జాలునని మన పూర్వులు జ్యోతిశ్శాస్త్రములో కుజాదిపంచకమును మాత్రము స్మరించి మిగిలిన వానిని విడనాడుటకు; వైద్యులు పంచవింశతి తత్త్వజ్ఞులయ్యును తమ చికిత్సోపయోగమగు చేతనాధాతు విశిష్ట మహాభూత పంచకమును మాత్రము గ్రహించి మిగిలినవానిని విడనాడుటయే దార్కాణము. అంతమాత్రమున వారికి అనగా 1 బ్రహ్మ ప్రాజాపత్యమానములను స్మరించునంతటి దివ్యజ్ఞానముగల వారికి నెప్ట్యూన్ మొదలగు గ్రహముల స్వరూపస్వభావము లగమ్యములైన వనుట కేవలమూ హాస్యాస్పదము. ఈ పై సంగతులవలన కుజాది పంచకము పంచమహాభూత పక్వాంశముల నిచ్చుచూ భూగోళమండలి ప్రాణిరచనను నిర్వర్తించుచున్నట్లు స్పష్టమగుచున్నది. కావున జ్యోతిశ్శాస్త్రికదేశములగు జాతక-సంహితా స్కంధములలో ఈ కుజాది గ్రహములయొక్క స్థిత్యాదులనుబట్టి అవి భూగోళగతపచ్యమాన భూతపంచకమున కిచ్చెడి భూత పంచకాంశముల పరిమితిని నిశ్చయించి దాని యాధారముచే ప్రాణులకు గల్గెడి సుఖదుఃఖములు నిరూపింపబడినవి. యెట్లన:— వాతాగ్ని జలభూతములవలన బుట్టినవగుటచే శని - కుజ - శుక్రులు క్రమముగా వాత-పిత్త - శ్లేష్మముల కధిపతు లగుచున్నారు. వీరలు జాతకచక్రములో బలిష్ఠులై తను భావమందున్నను, ఆభావమును జూచుచున్నను, ఆజాతకుడా యా ప్రకృతులు గలవాడగుచున్నాడు. ఇట్లే జాతకఫలములను సయుక్తికముగా సోపపత్తికముగా సాధింపవచ్చును. కావుననే వైద్యుడు రోగిని చికిత్సింపబోవునపుడు వాని జాతకమును పై రీతిని బాగుగా పరిశీలించి అందువలన రోగముయొక్క సాధ్యాసాధ్యతలను గ్రహించి చికిత్సింపవలెనని "గ్రహేష్వనుగుణేష్వేకదోష మార్గోనవస్సుఖః" (వా. సూ. 1 అ. 31 శ్లో) అనెడి వాగ్భట శ్లోకము సూచించుచున్నది.

ఇట్లు కుజాదిపంచకము తమతమ కిరణములద్వారా భూమిగత భూతపంచకమునకు తమతమ యంశములను సమర్పించుచూ ద్రవ్యజాతమందలి గుర్వాదిగుణము

---

1 బ్రహ్మ ప్రాజాపత్యమానముల స్వరూపమునుగూర్చి అస్మత్పితృచరణులగు దైవజ్ఞ సార్వభౌములవారిచే రచింపబడిన "కాలమానోపపత్తి" యనెడి గ్రంథమునందు జూడుడు.

లకు కారణము అగుచుండును. అందువలన ముఖ్యముగా భూమియందలి ఓషధి వర్గము చక్కగా వృద్ధిజెందును; దానివలన అన్నము దానివలన జంగమ ప్రాణి కోటియు పుట్టుచుండును. ఉక్తంచః- పృథివ్యాఓషధయః ఓషధీభ్యోన్నం" (శ్రుతి) ఇట్లు షడ్రసాశ్రయమగు ద్రవ్యజాతము సూర్యాదిగ్రహసప్తకమున కవయవమగుచున్నది. "అన్నాత్పురుషః" (శ్రుతి) "పంచమహాభూత శారీర సమవాయః పురుషఇత్యుచ్యతే తస్మిన్ క్రియా సోధిష్టానం" (సు. సూ.) అనెడి వచనములనుబట్టి యట్టి ద్రవ్యజన్యు పురుషుడు వైద్యశాస్త్ర ప్రవృత్తికి కథానాయకు డగుచున్నాడు. దీనినిబట్టి జ్యోతి శ్శాస్త్రము వైద్యశాస్త్రము యనునవి మానవునకు ప్రకారాంతరముగా ఏక ఫల బోధకములుగాని భిన్నశాస్త్రములు కావనిసిద్ధమగుచున్నది. కనుక జ్యోతిశ్శాస్త్రము జాతకస్కంధము మానవుని భౌతికఫలములను దెల్పునూ సంహితాస్కంధములో ప్రపంచమంతటియొక్క భౌతికఫలములనుగూడ యెట్లు దెల్పుచున్నదో యట్లే మన వైద్యశాస్త్రముగూడ ప్రపంచములో నీషన్మాత్రమగు యొకప్రాణియొక్క భౌతికధర్మములను నిదాన శారీరాది ఇతర స్థానములలో దెల్పుచు విమానస్థానములో జనపదోధ్వంసనాది ధర్మముల దెల్పుటద్వారా సర్వజగత్తుయొక్క యోగక్షేమము లను దెలియజేయుచున్నది. కావున జ్యోతిశాస్త్రవైద్య శాస్త్రముల కేకవాక్యత ఘటించుకొని ఫలములను సాధించుటకు ఘనుకొందురుగాక యని దేశీయులను హెచ్చరించుచున్నాను.

## ఋ తు వి భా గ వి మ ర్శ న ము

అవతరణిక:- ఆయుర్వేద మూలగ్రంథములలో కొన్ని విరోధాభాసలు కన్పించుచున్నవనియు, వానిని వారించుటకు జ్యోతిషాది వివిధశాస్త్రముల సహాయ మవసరమనియు, ఇదివరలో వివరించియుంటిని. అట్టి విరోధాభాస ఘట్టములలో "ఋతువిభాగ విమర్శన" మొకటి జీవులయందును వారు భక్షించు పదార్థముల యందును, ఆయాఋతువుల శీతోష్ణ వర్షరూపములగు ధర్మములవలన కఫపిత్త వాతములనెడి శారీరధాతువులయందు మార్పుగలుగుచుండును. ఆ యా ధాతువుల హెచ్చుతగ్గులను సమపరచుట కాయాఋతువులయందు ఋతుచర్యయనుపేర శోధన పాచనాదిక్రియలు వస్తువుల బలప్రకర్షాదిజ్ఞానము ఉపదేశింపబడినది. ఈ మార్పు రోగికి రోగజమనియు, స్వస్థునకు కాలవ్యత్యయమున గలుగునదగుటచే కాలస్వభా జమనియు రెండు విధములై యుండును. కాలభేదము ననుసరించి వస్తువుల బల ప్రకర్షాదు లెరుగుటకును స్వస్థునికి గలుగు కాలస్వభావసిద్ధమైన యా ధాతువుల యుపచయాపచయముల సమపరచుటకును శోధనాదులకొరకును, కాలభాగములగు ఋతువులనుగూర్చిన జ్ఞానమవసరమైనది. ఇది కేవలము జ్యోతిషముమీద సాధార పడిన విషయము. సర్వతంత్ర స్వతంత్రులగు మూలగ్రంథకర్తలగు చరక - సుశ్రు

తులు, వారికి జాలపిమ్మటివాడగు వాగ్భటుడును, వస్తుబల ప్రకర్షాదిజ్ఞానమునకు గాని, శోధనాదిక్రియలకుగాని, యొకేవిధమగు ఋతువిభాగపక్షము నాశ్రయించి నట్లు కనబడుచున్నది. సమ్యగ్దర్శను లగువారిలో నన్యోన్య భేదాభిప్రాయములు లేవు. కాని వారిగ్రంధములపై వ్యాఖ్యలను వ్రాసిన డల్హణ—చక్రపాణులవంటి యర్వాచీన పండితప్రకాండులు పురుషబుద్ధికృతములగు కృతకములైన హేతువు లంబట్టి ప్రావృట్ పక్షము – శిశిరపక్షము అని రెండుపక్షములు భిన్న ప్రయోజన సాపేక్షములని పెడదారుల బడినట్లు కాన్పించుచున్నది. వీరి వ్రాతలమీద మూల గ్రంథములందలి ఋతు-విభాగ ఘట్టము విరోధాభాసముగా గన్పడి దానిమీద నాధారపడిన ఆయుర్వేదమంతయు విరోధాభాసముగానే కన్పించుచున్నది. దానిని జ్యోతిషాదుల సహాయమున వారింపబూనితిని.

విరోధ బీజము

"హేమంతో గ్రీష్మో వర్షాశ్చేతి శీతోష్ణ వర్షలక్షణాః త్రయఋతవో భవంతి తేషా మంతరే ష్వితరే సాధారణలక్షణాస్త్రయ ఋతవః ప్రావృట్ – శరత్ – వసంతా ఇతి. ఏవమేతె సంశోధన మధికృత్య షడ్విభజ్యంతె (చ. వి. 8 అ. 14_18 సూ.) "ప్రావృట్ శుచినభౌజ్ఞేయా శరదూర్జ సహౌపునః తపస్యశ్చ మధు శ్చైవ వసంతశ్శోధనం ప్రతి ఏతాన్ ఋతూన్ విచింత్యైవ దద్యా త్సంశోధనం నృణాం" (చ. సి. 6 అ. 3 సూ. )

ఇట్లు చరకులు శోధనమునుగూర్చిన ఋతువిభాగమును జేసినారు. ఇందు శిశిరమును విడచి "ప్రావృట్" అనుపదముచే వేరొక్క-ఋతువును పేర్కొన్నట్లు కనబడుచున్నది. దీనికే ప్రావృట్పక్ష మని పేరు. అది యెట్లన:_ ఫాల్గుణ – చైత్ర ములు వసంతము; వైశాఖ – జ్యేష్టములు గ్రీష్మము; ఆషాఢ – శ్రావణములు ప్రావృట్ (యీ 3 ఋతువులు ఆదానకాలమని. ఉత్తరాయణమని పిలువబడును.)

భాద్రపద – ఆశ్వయుజములు వర్షఋతువు; కార్తిక – మార్గశిరములు శరత్తు; పుష్య – మాఘములు హేమంతము; (యీ 3 ఋతువులు. విసర్గకాలమని దక్షిణాయన మని పిలువబడును.)

ఇతడే మరొకచో, (తస్యాశితీయాధ్యాయమునందు) "ఇహఖలు సంవత్సరం షడంగం ఋతువిభాగేన విద్యాత్ తత్రాదిత్యస్య ఉదగయనమాదానంచ త్రీన్ ఋతూన్ శిశిరాదీన్ గ్రీష్మాంతాన్ వ్యవస్యేత్ వర్షాదీన్ పునర్హేమంతాంతాన్ దక్షిణాయనం విసర్గంచ" (చ. సూ. 6 అ.) అని వచించెను.

ఇదియే శిశిరపక్ష మనబడును. యెట్లన:— మాఘఫాల్గుణములు శిశిరము: చైత్ర – వైశాఖములు వసంతము: జ్యేష్టాషాఢములు గ్రీష్మము: (యీ 3 ఋతువులు, ఆదానకాలమనియు, ఉత్తరాయణమనియు పిలువబడును) శ్రావణభాద్ర

పదములు వర్షర్తువు; ఆశ్వయుజకార్తికములు శరత్తు; మార్గశిరపుష్యములు హేమంతము; (యీ 3 ఋతువులు విసర్గకాలమనియు, దక్షిణాయనమనియు పిలువబడును.) ఇందు శిశిరము ఋతువుగా చేర్కొనబడినది గావున దీనికి శిశిరపక్షమని పేరు వచ్చెను.

ఇట్లొకేచరకమున రెండుపక్షములు పొడసూపుటచేతను, ప్రావృట్ పక్షము శోధనాధ్యాయమున నున్నదిగనుక శోధనమునకు ప్రావృట్ పక్షమును బలప్రకర్షాదుల విషయములో శిశిరపక్షమును గ్రహింపవలయునని, యుభయ పక్షములకు ఆయుర్వేదమున నిత్యగతిని కల్పించుచు "చరకె పితస్యాశితీయె రసబల నిష్పత్త్యర్థం శిశిరాది విభాగో దర్శితః తత్ర వాతాది హేతూనాం రసానాంనిష్పత్తేః తదేవదర్శనం ప్రాకృతం" (సు. సూ.6 అ.6–10 సూ) అనగా రసబల నిష్పత్తికి శిశిరాదివిభాగము చరకమున తస్యాశితీ యాధ్యాయంలో. గనుపరుపబడినదనియు, రసనిష్పత్తి ప్రథమముగానున తత్కాలమగు శిశిరపక్ష విభాగమిందు తొలుత చేయబడిదనియు సుశ్రుత వ్యాఖ్యాత డల్హణుడు వ్రాసెను.

చరకమున నదేయధ్యాయమునందు శోధనముంగూర్చియు జెప్పబడినది. చరక వ్యాఖ్యాతయగు చక్రపాణి ప్రావట్ వృక్షములో వసంతఋతువులో చివరిదిగానున్న చైత్రమాసములో శ్లేష్మశోధనమును, మార్గశిరమున పిత్తశోధనమును చేయవలయునని యెనిమిదవ అధ్యాయములో వ్రాసెను.

ఈ యిద్దరి వ్యాఖ్యలును మూలగ్రంధకర్తల యభిప్రాయమునకు భిన్నముగానే యున్నవి. "తావేతా వర్కవాయూ సోమశ్చ కాలస్వభావ మార్గపరిగృహీతాః కాలర్తురసదోష దేహబలనిర్వృత్తి ప్రత్యయభూతా స్సముపదిశ్యంతే" (చ సూ. 6 అ. 4–8 సూ.) సూర్యవాయుచంద్రులు కాలస్వభావాదులతో గూడి, ఋతు–రస–దోష దేహ బలములకు కారణులగుచున్నారు అని ఇట్లు శిశిరాది విభాగము మధురాది రసములకే కారణమనక వాతాదిదోషములు – దేహబలము అనువానికిగూడ కారణము లగుచున్న వని కంఠోక్తిగా ననుటచే కేవల రసనిష్పత్తికి శిశిర పక్షము చెప్పబడె ననుట పొసగకున్నది.

ఇక శోధనమునుగూర్చి యదే తస్యాశితీ యాధ్యాయంలో చరకమునందు "తస్మాద్వసంతే కర్మాణివమనా దీనికారయేత్" అని వసంతఋతు చర్యలోను, "తిక్తస్య సర్పిషః పానం విరేకోరక్తమోక్షణం" అని శరదృతుచర్యలోను శోధన క్రియలు చెప్పబడెను.

చక్రపాణిశోధనమునుగూర్చి వివరించుచూ "వసంతాదీ నామృత మాసెష్వృతువమనా ద్యభిధానం, సంపూర్ణ ప్రకోపేభూతే, నిర్హరణోపదేశార్థం! ప్రథమెష్వహిమాసెషు ఫాల్గుణాషాఢకార్తికేషు ప్రకోపః ప్రకర్షప్రాప్తో నభవతి!

చితస్యాహ్యా సమ్యక్ ప్రకుపితస్య అవిలీనస్య సమ్యా జ్నిర్హరణంసభవతీతి" (చ. సూ. 7 అ. 46 సూ. వ్యా) అని వ్రాసిన వ్యాఖ్యంబట్టి ప్రావృట్ పక్షము నాశ్ర యించినట్లు స్పష్టబడుచున్నది. తస్యాశితీయము నందు ప్రకరణ వశముగా వేరొకన్న శిశిరపక్షమును వీడి, ప్రావృట్ పక్షము నాశ్రయించుటకు తనకు గల కారణములనుగూడ పైమాటలో వివరించి యున్నాడు. అనగా, వసం తాది ఋతువులయొక్క ప్రథమమాసములలో, అనగా ఫాల్గుణాషాఢ కార్తి కములలో, దోషములు పూర్తిగా ప్రకోపించి నిర్హార్య ద్రవ్యములలో విలీనత నొందవు; అవి ఆయా ఋతువుల తుదిమాసములగు చైత్ర–శ్రావణ–మార్గ శిరములందు పూర్తిగా ప్రకోపించి లీనములగును; కాన ఈ మాసములే వమ నాదిశోధన కర్తవ్యములని భావము.

ఈ పైవ్రాతకు మూలము సుశ్రుతవ్యాఖ్యాతయగు డల్హణుడే. కారణ ములగు రసములు ముందుబుట్టి, పిదప నవి ప్రాణులచే భక్షింపబడి జఠరమున జీర్ణించి వాతాది దోషములుగా మారును గాన అట్లుజరుగుటకు "ఏవంమాసె నశుక్రీభవతి" అన్నాడి సుశ్రుతుని శోణితవర్ణనీయాధ్యాయమందలి సూత్రముచే, సుమారు మాసకాలము పట్టునని యూహించి కాబోలు నితని మతానుయాయి యగు చక్రపాణి శోధనార్థముగా ప్రావృట్ పక్షము నొప్పినట్లు తెలుచున్నది. గాని యిది సంగతముగా గన్పట్టుటలేదు,

శిశిరపక్షము ననుసరించి వర్ష–శర–ద్ధేమంతముల బుట్టిన అమ్ల–లవణ–మధుర రసములచేత కఫము మాఘాంతమునకు చయమగును, గాన అది ఫాల్గుణ ములో ప్రకోపించి, యప్పుడె శోధనకాలము కావలసి యుండును. కాని యీ మత ములో చైత్రము శోధనకాలమైనది. అట్లే శిశిర–వసంత–గ్రీష్మముల బుట్టిన తిక్త–కసాయ–కటురసములవలన శ్రావణాంతమునకు వాతము చయమగును, కాన భాద్ర పదమున ప్రకోపము చెందిన యాదోషము భాద్రపదమున శోధింపతగి యుండును. అట్లుగాక యీ మతమున దానికి పూర్వ మాసమే (శ్రావణమె) శోధనకాలమైనది. అదేరీతున గ్రీష్మ – వర్ష – శరత్తులలో బుట్టినకటు – అమ్ల – లవణములవలన మార్గ శిరాంతమున పిత్తము చయమై పుష్యమాసమున ప్రకోపదశనొంది, యందేశోధనకు సిద్ధము కావలెను. అట్లుగాక తత్పూర్వపుదియగు మార్గశిరము శోధనకాలమైనది. రసనిష్పత్తికి శిశిరపక్షమును, దోషశోధనకు ప్రావృట్ పక్షమును, చెప్పుట చరక కర్త యభిమతమె యైనచో కఫ – వాత – పిత్తములకు వరుసగా ఫాల్గుణ – భాద్ర పద – పుష్యములు శోధనకాలములు కావలయునుగదా! ఇట్టి తరినదే గ్రంథములో "మాధవప్రథమె మాసి నభస్యప్రథమె పునః సహస్యప్రథమె చైవహారయేద్దోష సంచయం" (చ. సూ. 7 అ.46సూ.) అను సూత్రమున్నది. దీనికి వ్యాఖ్యచేయుట

లోచక్రపాణి, చైత్ర – శ్రావణ – మార్గశిరములు క్రమముగాశోధనకాలములనియు, నియ్యవి ప్రావృట్ పక్షమునందలి వసంత – ప్రావృట్ – శరత్తులలో తుదిమాసము లగుననియు, ప్రథమమాసములగు ఫాల్గుణాషాఢ కార్తికములలో కఫ – వాత – పిత్తములు సరిగా ప్రకోపింపవనియు, కావున నప్పుడే వానిని శోధించుట యుక్తము కాదనియు, యుక్తిజూపెను. అందుల కుపబలకముగా "మధౌ సహే నభసిచమాసి దోషాన్ ప్రవాహయేత్। వమనైశ్చ విరేకైశ్చ నిరూహైస్సానువాసనైః" అనెడి కపిలబలుని వచమునుట్టంకించెను. ఈ చక్రపాణి వచనము; డల్హణుని (1) రసప్రకోప సిద్ధాంతముచే శోధనార్హములుగా తేలిన ఫాల్గుణ–భాద్రపద–పుష్యముల కెట్లునూ సరిపడుట లేదు. మరియు, "శ్రావణేకార్తికేచైత్రే" అనిమార్గశిరమునకు బదులుగా కార్తికమును వాగ్భటుడు పేర్కొనుటలో, సహశ్శబ్దము అకారాంతమనియు,దాని యర్థము మార్గశిరమనియు, దానికి ప్రథమమాసము కార్తికమనియు వాగ్భటుడు తెల్పినమాటను పేలవముగా జూపెనెగాని, దోషచయోపచయాద్యవస్థలను గమనించి వ్యాఖ్యానించినట్లు తోచదు. వాగ్భటుడన్ననో హెచ్చుతగ్గులు లేని శీతోష్ణ వర్షధర్మములు గలిగినట్టియు, శోధనకు ముఖ్యమైనట్టియు. సాధారణకాలములైన శ్రావణ – కార్తిక – చైత్రములను తాను గ్రహించునట్లు "శ్రావణే కార్తికే చైత్రేమాసి సాధారణే క్రమాత్" (వా. సూ. 13. అ.) అని వ్రాసెను. సాధారణ కాలమనగా ఋతుసంధులు – అపుడు నాతి శీతోష్ణ వర్ష మగు కాలము లభ్యమగును. అపుడు స్వస్థునకు శోధనార్హ కాలమని ఘంటాపథముగా జాటినాడు. అట్టి కాలము శిశిరపక్షమే కానిండు, ప్రావృట్ పక్షమే కానిండు ఎపుడు లభించునో అపుడే స్వస్థునకు శోధనచేయవలయు నని మునుల యభిప్రాయము గాని, కేవలము మూడేసి మాసముల సంఖ్య ప్రధానము కాదని తెలియుచున్నది.

రోగి విషయములోగూడ అత్యుష్ణ శీతవర్షములం దాత్యయిక రోగము సంభవించినచో సమశీతోష్ణాదికాలముల రాకడదాక ఆగక, తాత్కాలిక దోష శోధనకై అత్యుష్ణాదులకు ప్రతిక్రియజేసి యాగ్రీష్మాదులను సాధారణ కాలములుగా మార్చి పిదప వానియందే శోధనచేయవలెను అని "వ్యాధౌ వ్యాధిన శేనతు కృత్వా శీతోష్ణ వృష్టీనాం ప్రతీకారం యథాయథం ప్రయోజయేత్క్రియాం ప్రాప్తాం క్రియాకాలం నహాపయేత్" (వా. సూ. 13 అ) అని యిట్లు జెప్పెను. గాన శోధనమునకు శీతోష్ణవర్షముల సామ్యావస్థ ముఖ్యమని తేలినది.

---

1శిశిరపక్షము రసములు పుట్టుటకున్ను ప్రావృట్ పక్షము పుట్టిన రసములవల్ల గలిగెడి దోషముల ప్రకోపమును శోధించుటకున్ను నిర్ణయింపబడుటచే త్రోలుత రస జననము. ఆపిదపమాసమునకు దోషప్రకోపము గల్గుననెడి సిద్ధాంతమునకు రసప్రకోప సిద్ధాంతమని సంకేతము.

మరియు, వాగ్భటుడు కాలికములగు శీతాది ధర్మములే శోధనకు ముఖ్య బీజములని, యుపపత్తులతో "చయప్రకోప ప్రశమాః" ఇత్యాది గ్రంథముచే పన్నెండవ అధ్యాయమున వివరించెను. అనగా గ్రీష్మవర్ష శరత్తులు వాతమునకు వర్ష శరద్ధేమంతములు పిత్తమునకు, శిశిరవసంత గ్రీష్మములు కఫమునకు చయ (పోగుపడుట) ప్రకోప (హెచ్చుగుట) ప్రశమము (అణగుట) లకు కాలములని దెల్పెను. గ్రీష్మములందు ఓషధులందును వాతము చయమగునుగాన వానిని సేవించు ప్రాణులయందు నది ప్రకోపింపవలసియున్నను "కాలస్యౌష్ణ్యాన్న కుప్యతి" అని యుపపత్తిని జూపెను. ఇట్లే తక్కినపిత్త – కఫములకుగూడ 'నతుకాలస్య శైత్యతః; స్కన్నత్వాన్న ప్రకుప్యతి" అనిక్రమముగా నుపపత్తులను జూపెను. దీనింబట్టి శోధనబీజములు శీతోష్ణాది ధర్మములేయని స్పష్టమగుచున్నది. "వ్యాధౌ వ్యాధి వశేనతు" ఇత్యాదివచనములు మున్ను తెలిపినట్లు ఈ విషయమునే బలపరచు చున్నదికదా!

మరియు "తద్విధ స్తద్విధే దేహే" అనుటచే కట్వాదిరసముల కాశ్రయములగు నోషధులతోబాటు దేహములోగూడ లఘురూక్షాది గుణము లొకేకాలమందు సంభ వించుననియు "తుల్యేపి కాలే దేహేచ" అనుటచే రసములుగల ఓషధులు – దేహ ములు–దోషములు అనునవన్నియు నొకేకాలమందు తుల్యగుణములుగలవై వృద్ధి నొందుననియు తెలియుచున్నది. ఇది "కాలస్వభావోయం" (వా. సూ. 12 అ. 28 శ్లో) అని వాగ్భటుడు కాలస్వభావముగా వర్ణించెనుగాని దల్హణు డన్నట్లు ఒక కాలములో రసములుబుట్టి యవి కాలాంతరమున కాలికదోషము లగుననుట కెంతమాత్రము నిందు వీలుగానరాదు. ద్రవ్యజదోషములను కాలికములని జెప్పుట గూడ యసంగతమే. యెట్లనః–కాలికదోషములనగా కాలమందలి శీతోష్ణాది ధర్మము లచే జనించెడి దోషములు. ఇయ్యవి స్వస్థుని శోధనాదులకు కారణము లగుచుండును. ఇక ద్రవ్యజ దోషము లన్ననో ద్రవ్య సేవాజనిత దోషములు. ఇయ్యవి అకాల మునగూడ దోషములను ప్రకోపింపజేసి ప్రాణిని రోగినిగా జేయుచుండును. ఉక్తంచః—"ఆహారాదివశాత్ పునః। చయాదీన్యాంతి సద్యోపిదోషాః కాలేపివా పునః" (వా. సూ. 12 అ. 28 శ్లో) గాన నట్టిసమయమున "వ్యాధౌవ్యాధివశేనతు" ఇత్యాది వచనానుసారముగ కాలిక శీతోష్ణాదులకు తగు ప్రతీకార మొనరించి దోషశోధనల జేయుటచేతను; నిదానపరివర్జనము జేయుటచేతను, రోగికి సుఖమును గల్గింపవలెను. నిదాన పరివర్జన మనునది ద్రవ్యాది సేవాజనిత దోషములయందే వర్తించును; కాల మనివార్యము, గాన కాలికదోషములయందు వర్తింపదు. గాన శోధనార్హదోషములను ఈదోష శోధనప్రకరణమున కాలికములనియు–

ద్రవ్యాది సేవాజనితములనియు రెండువిధములుగా గ్రహించియే తీరవలెను. లేనిచో "తుల్యేపి కాలే దేహేచ" ఇత్యాదివచనము లనన్వయముగానుండును. ఈ పై విమర్శనమునుబట్టి వాతమునకు శీతము – పిత్తశ్లేష్మముల కుష్ణము – ప్రకోపావస్థయందు సహాయకారణములు అనగా అసమవాయి కారణములగుచున్నవని స్పష్టమగుచున్నది. ఈ విషయము, పైన వ్రాసిన తీరుగా రసనిష్పత్తికొరకు శిశిర పక్షమున్ను, అట్టిరసములవలన కాలాంతరమునబుట్టిన దోషములశోధనకు ప్రావృట్ పక్షమున్ను ఈరెండున్ను భిన్నప్రయోజనసాపేక్షము లని చూపిన డల్హణ మతములోగాని, మాససంఖ్యల సామ్యతను ప్రధానముగా గణించిన చక్రపాణిమతమున మార్గశిర మాసములోగాని యెంతమాత్రము మూలానుసారమైనట్లు తోపదు. యేలయన:— డల్హణమతమందు శోధనార్హకాలము లని దేలిన ఫాల్గుణ – భాద్రపద – పుష్యములుగాని, చక్రపాణి మతమున దేలిన చైత్ర – శ్రావణ – మార్గశిరములలో మార్గశిరముగాని, వాతాదిదోషములకు సహాయకారణములగు శీతోష్ణాది ధర్మములను గలిగియుండవు. యెట్లన:— శిశిరపక్షమున ఆషాఢమాసములో దక్షిణాయన మారంభమగును. భాద్రపదాంతమువరకు అనగా విషువ పర్యంతము) సూర్యుడు బలవంతుడై యున్నను, ఆషాఢమునుండియే వేడితగ్గుట కారంభమగును. నీటియావిరి, వేడిహెచ్చుగుచున్నంతవరకల్లే యుండి, అది తగ్గుముఖము పట్టినంతనే గలిగెడి చల్లదనముచే రూపాంతరమొంది మేఘమగును. అందుచే దక్షిణాయనారంభముననే చల్లదన మేర్పడును. అందుచ్చే ఆషాఢమున గ్రీష్మములో చయమైనవాతము ప్రకోపించుట కారంభించి శ్రావణములో శోధనకు సిద్ధమగును. "ఆషాఢస్య ప్రథమదివసే మేఘ మాశ్లిష్టసానుం" అని కాళిదాసు గూడ ఆషాఢమున మేఘోదయమగునని చెప్పుట యీవిషయమునకు పోద్బలకముగా నున్నది.

అట్లే గ్రీష్మముచే తపించిన భూమిపై శ్రావణ భాద్రపదములలో వర్షించిన వర్షములవలన ఆవిరి బుట్టును. ఉదకములు క్రొత్తవగుటచే ఆమ్లపాకము సంభవించును. అట్టిభూబాష్ప – ఆమ్లపాకములచే శ్రావణ భాద్రపదములలో చయమైన పిత్తము అశ్వీనములో భూబాష్పాదులు లేనందున యటే నిలచిగాని, వృద్ధి కారణమగు తీక్ష్ణమైన రవిరశ్మి లేమింజేసి స్వల్పముగా వృద్ధినందుచు యుండి; కార్తికము రా వేగమే "వర్షా శీతోచితాంగానాం సహసైవార్క రశ్మిభిః తప్తానాం సంచితం వృష్టౌపిత్తం శరది కుప్యతి" అనుటచే వర్షకాలపు చల్లదనమున కలవాటు పడిన ప్రాణులకు మేఘ నిరోధము తొలగుటచే హఠాత్తుగా సూర్యరశ్మి సోకును గాన పిత్తము వెనువెంటనే ప్రకోపించి యామాసమునందే శోధనకు సిద్ధమగును.

ఇట్లే పూర్ణమగు శీతమునకు ఉత్తరాయణ ప్రవృత్తి పరమావధిగాన యీ సమయము, శిశిరపక్షములో పుష్యమాసమున సంభవించుటచే దాని పూర్వాపరమాసములగు మార్గశిరమాఘములు గాఢ శీతము గలవిగనే యుండును, ఫాల్గుణములో సూర్యుడు మేషవిషువమునకు సమీపించుటచే బలవంతు డగుచుండును. అందుచే ఉష్ణత హెచ్చును. దానంజేసి మార్గశిరాది మాసత్రయ ములో చయమైన కఫము ఈ మాసములో ప్రకోపించుట కారంభించి చైత్రమున శోధనకు సిద్ధమగును.

కావున వాగ్భటశోధనకాలమే సయుక్తికముగా నున్నది. కాని దక్షిణాచ క్రపాణుల శోధనకాలములు యుక్తియుక్తముగా గానరావు. కాలమందలిహీనమిథ్యాతి మాత్రలు (అనగా కాలమునకు తగిన, వర్ష శీతోష్ణధర్మములుకంటె మిక్కిలిగాగాని, అల్పముగాగాని, వ్యత్యయముగాగాని, గలిగెడి శీతోష్ణాది ధర్మములు)కు "వ్యాధా వ్యాధి వశేనతు" అనెడి వాక్యముచే తాత్కాలికముగా ప్రతిక్రియలను గల్పించు కొండని స్పష్టమగుచున్నది. ఇది పై సిద్ధాంతమునకు మరికొంత యుపబలకముగా నున్నది.

ఇంత విమర్శపై నొక్క ప్రశ్నము మిగిలియున్నది. చరక సుశ్రుతాదులలో ప్రావృట్ పక్షము, శిశిరపక్షము అనునవి రెండును గనబడుటకు కారణ మేమి యనునది:

ఇందుల కాయా చరక సుశ్రుతుల కాలమునం దాచరణలోనున్న ఋతువు లను బట్టిన భేదమే కారణముకాని వేరు ప్రయోజనాపేక్ష లేదనుటయే సిద్ధాం తము. ఆవిషయమున ముందు నా యీ గ్రంథకర్తల కాలనిర్ణయ విమర్శన మావ శ్యకముగాన దాని నిట వివరించెద.



ఇంతవరకు చెప్పినగ్రంథములో శిశిరపక్షము–ప్రావృట్పక్షము అను రెండు పక్షములు చరక సుశ్రుతముల గ్రంథములలో కానవచ్చుచున్నవనియు, అవి భిన్న భిన్న ప్రయోజనసాపేక్షములు కావనియు ఆ యా మూలగ్రంథకర్తల కాలమున నాపక్షములుండుట కారణమనియు తెలిపియుంటిని. జ్యోతిషము నాధారముచేసికొని యావిషయము నిపుడు విపులముగా జర్చించుచున్నాను.

ఆయుర్వేదమును ప్రథమమున చతుర్ముఖబ్రహ్మ స్మరించి, దక్షప్రజాపతి కుపదేశించెను. అటనుండి క్రమముగా అగ్నివేశునకు లభ్యమైనది. (యీదిగువ కుల వృక్షమును జూడుడు) ఇతడే నేడు చరక మను పేరుతో నున్న తంత్రమునకు మూలకర్త. దీనికానాడు అగ్నివేశతంత్రమనుపేరు వ్యవహారమందుండెను. ఇంద్ర శిష్యుడగు భరద్వాజునకు రెండవ శిష్యుడైన దివోదాసుని (ధన్వంతరి–కాశీరాజు) శిష్యుడు సుశ్రుతుడు. ఇతడు విశ్వామిత్రుని కుమారుడని భారతమందున్నది. ఇతడు వ్రాసినదే "సుశ్రుతము". అది నేడు వ్యవహారమునందున్నది. అగ్నివేశసుశ్రుతు లిద్దరు నించుమించుగా సమకాలికులు.

అగ్నివేశ తంత్రమును చరకుడు సంస్కరించెను. చరకు డనగా పతంజలి మహర్షి. ఇతనినే యీ క్రిందిశ్లోకము వర్ణించుచున్నది.

శ్లో. యోగేన చిత్తస్యపదేన వాచాం మలం శరీరస్యచ వైద్యకేన।
యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం పతంజలిం ప్రాంజలి రానతోస్మి.

ఈ శ్లోక ముద్భటుడు వ్రాసిన దని కొందరు, యోగవార్తికమందు విజ్ఞాన భిక్షువు వ్రాసె నని కొందరు అనుచున్నారు.

శ్లో॥ పాతంజలమహాభాష్య చరక ప్రతిసంస్కృతైః। మనో
వాక్కాయ దోషాణాం హర్త్రేఽహి పతయే నమః.

అని చరకవ్యాఖ్యాత చక్రపాణి పైయంశమును స్మరించెను. ఈ చరకుని సంస్కృతి నందిన గ్రంథమే నేడు ప్రచారమందున్నది. ఈ గ్రంథములో శిశిర పక్ష - ప్రావృట్ పక్షములు రెండును కంఠోక్తిగా నుదహరింపబడి యున్నవి. ఇందొకటి యున్నచో రెండవదానికి ప్రసక్తిలేదని నేను వెనుకటినుండియు నిరూపించుచునే యున్నాను. ఇందుమీదట నవిరెండును ఈగ్రంథమున నెందులకువచ్చిన వని విమర్శింపగా ఈ గ్రంథమునకు మూలకర్త యొకరు, ఉద్ధారకు డొకడు కావున వారివారి కాలములో నున్న ఉభయపక్షములకు నీగ్రంథమునం దనుప్రవేశము

గలిగినదని నాయభిప్రాయము. ఇందులకు వారి కాలమునుగూర్చి తెలిసికొనవలసిన యవసర మేర్పడినది. ఇందులకు అందుబాటులోనున్న అర్వాచీనులగు కాళిదాస - వరాహమిహిర - వాగ్భటుల కాలమునుగూర్చి ప్రాసంగికముగా కొంత వివరింపవలసి యున్నది.

# ఆయుర్వేద కులవృక్షము

చతుర్ముఖబ్రహ్మ (వేదము)

|

దక్ష ప్రజాపతి

|

అశ్వినీ దేవతలు

|

ఇంద్రుడు

|

భరద్వాజుడు

- ఆత్రేయ (పునర్వసు)
  - భేడ (ఇతడు భేడ సంహితకు కర్త) ఇది తంజావూరు లైబ్రరీలో నున్నట్లు తెలియుచున్నది.
  - జాతూకర్ణి
  - అగ్నివేశుడు. (ఇతడగ్నివేశ తంత్ర కర్త) యీ తంత్రమును ప్రతి సంస్కరించినవాడు చరకుడు ఇతడే పతంజలి.
  - క్షారపాణి
  - హారీత (ఇతని గ్రంథము తప్పులతో నొకటి కనబడుచున్నది)
  - పరాశర
- దివోదాసుడు ఇతనికే ధన్వంతరి అని కాశిరాజు అని నామాంతరములు
  - కరవీర్య
  - గోపుర రక్షిత
  - వైతరణ
  - పుష్కలావత
  - సుశ్రుత (ఇతని గ్రంథమునకు ప్రతి సంస్కర్త నాగార్జునుడు) (ఇందొక మంత్రశతమే నేడు కనిపించుచున్నది)
  - ఔపధేనవ
  - ఔరభ్ర

## కాళిదాస - వరాహమిహిర - వాగ్భటుల కాలనిర్ణయము

పై జెప్పినట్లాషాఢాదియందు మేఘోదయమగుచున్నట్లు శిశిరపక్షము వ్యవహారములోనున్న కాలమందలి కాళిదాసుడు "ఆషాఢస్య ప్రథమదివసే మేఘమాశ్లిష్టసానుం" అని మేఘ సందేశమున వచించియున్నాడు. ఇతడు వరాహమిహిరునకు సమకాలికుడనియు, విక్రమ సభయందలి కవియనియు, చరిత్రకారులు "ధన్వంతరి క్షపణకామర సింహ శంకు బేతాళభట్ట ఘటకర్పర కాళిదాసాః। ఖ్యాతో వరాహమిహిరో నృపతే స్సభాయాం రత్నానివై వరరుచి ర్నవ విక్రమస్య" అని యిట్లు చెప్పుచున్నందునను, వరాహుని సమయమున అయనాంశలు శూన్యమని వరాహుడే "సాంప్రత మయనం సవితుః కర్కటకాద్యాన్మృగాది తశ్చాన్యత్" అని యిట్లుచెప్పినందునను, శూన్యాయనంగల శిశిరపక్షము వీనికాలమున ప్రచారములోనుండెనని చెప్పుటకు సందియములేదు. క్రీస్తుశకము అయిదవ శతాబ్దాదియందుండె నని చరిత్రకారులచే నొప్పుకొనబడుచున్న యీ వాగ్భటుడుగూడ వీరియనంతరమున వీరి కించుమించుగా సమకాలికుడగుటచేత ఈశిశిరపక్షమునే యవలంబించి వాతాది దోషశోధనలకు శ్రావణాదిమాసములను జెప్పియున్నాడు. ఇతడు చరకసుశ్రుతములను బాగుగావిమర్శించి తనగ్రంథమునకాధారముగా గ్రహించినవాడైనను వానిలోజెప్పబడిన ప్రావృట్పక్షమును కంటిలో కలికమునకైనను తన గ్రంథమున స్మరించియుండలేదు. ఇందుల కీ ప్రావృట్పక్షము తనకాలమున కప్రస్తుతమని యతడు గ్రహించియుండుటయే కారణము. ఈవిషయము డల్హణచక్రపాణులకు గోచరింపనందున వారు, శిశిరపక్షము రసనిష్పత్తి కనియు, ప్రావృట్పక్షము శోధన కనియు, వికల్పించి పక్షద్వయమునకుగూడ గతిని కల్పించిరి.

అయితే "ప్రావృట్శుచినభౌజ్ఞేయా.........వసంతశ్శోధనంప్రతి" (చ. సి. 6 అ.) "ప్రావృట్శరద్వసంతా ఇతి......ఏవమేతే సంశోధన మధికృత్య షడ్విభజ్యంతే" (చ. వి. 8 అ.) "ఇహతువర్షాశరద్ధేమంత గ్రీష్మప్రావృషః షడృతవో భవంతి। దోషోపచయ ప్రకోపోపశమనిమిత్తం" (సూ సూ. 6 అ.) అని యిట్లు మూలములలోనే శోధనకొరకు ప్రావృట్పక్షము చెప్పబడెనని చెప్పియుండగా డల్హణాదులీవిషయమును వికల్పించిరనుట యుచితముకాదనవచ్చును; కాని చరకసుశ్రుతములనాటికి సంపాతము వాగ్భటుని కాలమందువలె మేషారంభమునందుండుటచే వారు వాగ్భటునివలెనే శిశిరపక్షమునుగ్రహించి తదనుసారముగా శోధనలను గూడజెప్పిరి. శిశిరపక్షమునుగూర్చి వర్ణించిన చరకసూత్రస్థానము 6 అధ్యాయములో "తస్మాద్వసంతే కర్మాణి వమనాదీని కారయేత్" (చ. సూ. 6 అ.) అని వసంత ఋతుచర్యలోనున్న, "తిక్తస్యసర్పిషః పానంవిశేకోర క్తమోక్షణం" (చ. సూ. 6అ.)

అని శరదృతుచర్యలోనున్న జెప్పబడిన శోధనలు ప్రాకరణికముగా శిశిరపక్షముననే సమన్వయించును. సుశ్రుతములోగూడ "హరేద్వసంతే శ్లేష్మాణం పిత్తం శరది నిర్హరేత్। వర్షాసుశమయేద్వాయుం ప్రాగ్వికారసముచ్ఛ్రయాత్" (సు. సూ. 6 అ. 39 శ్లో) అని చెప్పబడెను. ఈశ్లోకముగూడ శిశిరపక్షములోనే సమన్వయించును గాని ప్రావృట్ పక్షములో సమన్వయింపదు. ఏలయన:— ఈసూత్రములో వసంత శరద్వర్ష ఋతువులు క్రమముగ కఫపిత్త వాతములకు శోధనకాలములుగా జెప్పబడినవి. ప్రావృట్పక్షములో ఫాల్గుణ చైత్రములు వసంతము, కార్తిక మార్గశిరములు శరత్తు, భాద్రపదాశ్వయుజములు వర్ష ఋతువుకదా! ఇందు వసంత శరత్తులలో అంత్యమాసములగు చైత్ర మార్గశిరములు చరకమందలి మాధవప్రథమే మా సీత్యాది శ్లోకమునకు చక్రపాణి చేసిన వ్యాఖ్యాప్రకారము సరిపోవును; గాని యందలి శ్రావణమాసముమాత్రము ఈ ప్రావృట్ పక్షీయ ఋతువులో గానరాదు. గాన ఈ సౌశ్రుతసూత్రము ప్రావృట్పక్షమునకు సమన్వయింపదు. ఇక శిశిరపక్షములో సమన్వయించు విధానము "శ్రావణే కార్తికే చైత్రే" ఇత్యాది వాగ్భటశ్లోక సమన్వయసమయమున ఇదివరలోనే వ్రాసితిని. చరక సూత్రస్థానములో 6 అధ్యాయమగు తస్యాశితీయ మను దానియందలి ఋతువిభాగము శిశిరపక్షీయమని డల్హణ చక్రపాణు లంగీకరించినట్లు చదువరుల కీవరకే తెలుసును. అందువలన యీ చెప్పిన మూడువచనములు శిశిరపక్ష ఋతు క్రమానుసారముగా శోధనలనుగూర్చి చెప్పబడినవని చెప్పక తప్పదు. అందుచే శిశిర – ప్రావృట్ పక్షముల రెంటియందును శోధనకాలము లగపడుచున్నవి. వీటిలో నేయొకపక్షము జెప్పినను, రెండవ పక్షము జెప్పవలెనని సందర్భమున రెంటిని యేల చెప్పెనని బహుదూర మాలోచింప, చరకమునుగూర్చి "భ్రశ్యతితు కృతయుగే" (చ. వి. 3 అ. 26 సూ.) అనియు, సూర్యసిద్ధాంతమునుగూర్చి "అల్పావశిష్టేతు కృతే మయనామా మహాసుర:" (సూ. సి. 1 అ.) అని చెప్పుటచే నీ రెండుగ్రంథములు కృతయుగాంతమందు బుట్టినవని తెలియుచున్నది. అప్పటికి రేవతీభోగము "అష్టారణ్వా: శూన్యకృతా:" (సూ. సి 8అ) ఇత్యాది గ్రంథముతో 11 రా. 29అం. 50క. అనియు, చిత్రాభోగము 6 రా. 0అం. 0క. అనగా తులాదియందు చిత్రానక్షత్ర మున్నదనియు వర్ణింపబడినది. దీనినిబట్టి చరకకాలమందుగూడ నక్షత్రభోగము లిట్లేయున్నవని చెప్పుటలో సందియములేదు. దినరాత్రిప్రమాణములు సమముగా గల విషువత్తు నారంభించి వసంతాది ఋతువిభాగము చేయబడునుగాన చరకాదులు చైత్ర వైశాఖములు "వసంతము" ఈ మొదలగు శిశిరపక్షమును వ్రాసిరనియు, పిదప ద్వాప

రాంతమున చరక సంస్కర్తయగు పతంజలి తన నాటికి సంపాతము ([1])అనులోమగతి గలదై మనసులో 4. న. అంశారంభమున యున్నందున అప్పటినుండి ప్రస్తుతము విలోమగతిగలిగి మీనములో 7 అంశల 1 కల 41 వికల యందున్న సంపాతము వరకు లెక్కింపగా వచ్చిన సుమారు 104 అంశలకు 6900 సంవత్సరములగును గాన అంతకాలముక్రిందట వ్యవహారములోనున్న ప్రావృట్ పక్షమును పతంజలి చరకమం దిరికించె ననియు బోధపడుచున్నది.

## పతంజలి కాలనిర్ణయము.

పతంజలికాలమునాటికి సంపాతము పైరీతినియున్నదని తెలియుట కాధారమేమనః— వ్యాసులు తానువ్రాసిన బ్రహ్మసూత్రములలో "ఏతేనయోగః ప్రత్యుక్తః" (2-1-3)అని సూత్రించెను దీనిననుసరించి భాష్యములో శంకరులు యోగశాస్త్రమును నిరసించుచు "సతీష్వధ్యాత్మవిషయాసు బహ్వీషు స్మృతిషు సాంఖ్యయోగస్మృత్యో రేవ నిరాకరణాయయత్నః కృతః। సాంఖ్యయోగౌహి పరమపురుషార్థసాధనత్వేన లోకే ప్రఖ్యాతౌ శిష్టైశ్చ పరిగృహీతౌ" అని వ్రాసినందున వేద విరుద్ధ ధర్మబోధకత్వము లక్షణముగాగల ఈ పాతంజల యోగశాస్త్రముగూడ చిరకాలమునుండి ప్రచారములోనున్నది గాన దానిఖండనకై వ్యాసులు యత్నించిరని తెలియుచున్నది. అందుచే మేము చెప్పబోవు వ్యాసపతంజలుల కంతరకాలము షుమారు 19 వందల సంవత్సరములుండుననుమాట సమంజసముగనే యున్నది. అయితే ఈయోగమును హిరణ్యగర్భాదు లతిప్రాచీనకాలములోనే జెప్పియుండిరిగాన దానినే వ్యాసులు లక్ష్యముజేసి ఖండించిరేమో యను సంశయము గలుగవచ్చును. దానిని వారించుటకై శంకరులు "యత్తు దర్శనముక్తం, తత్కారణం సాంఖ్యయోగాభిపన్నం ఇతి వైదికమేవ తత్రజ్ఞానం ధ్యానంచ సాంఖ్యయోగ శబ్దాభ్యా మభిలప్యేతే" అని యిట్లు సమర్థించిరి. అనగా పూర్వపు యోగము వేదవిరుద్ధము కాదుగాన గ్రాహ్యమగుటచే దానిని ఖండించలేదని భావము.

---

([1]) సంపాతమునకు మేషారంభమునుండి మేషములో 27 అంశలవఱకు అనులోమగతియు అచటినుండి మీనములో మూడవఅంశవరకు విలోమగతియు పిమ్మట అచటనుండి మేషారంభమువరకు అనులోమగతియు నుండును. ఇదిడోలాగతిగల యొకవిలక్షణభగణము. అనగా సంపాతము మేషారంభమునుండి ఇరుప్రక్కలకు 27 అంశములవరకు బోవుచుండునని భావము. "త్రింశత్కృత్వోయుగే భానాం చక్రం ప్రాక్పరిలంబతే" (సూ. సి. 3 అ.) అని ఇట్లు సంపాతమునకు మధ్యమమానముచే 54 వికలలు వార్షికగతిని చెప్పుచున్నది గాన యిట్టియొక భగణము పూర్తియగుటకు 7200 సంవత్సరములు పట్టుచుండును.

మరియు పతంజలికృత యోగశాస్త్రమునకు వేదవ్యాసులు భాష్యమును వ్రాసిరి. ఆ భాష్యమునకు టీకను వ్రాయుచు భామతీకారుడగు వాచస్పతి మిశ్రు డీ దిగువరీతిని వివరించెను. ఎట్లన:-"నత్వా పతంజలి మృషిం వేదవ్యాసేన భాషితే సంక్షిప్త స్పష్టబహ్వర్థా భాష్యే వ్యాఖ్యా విధాస్యతే" టీక:-"ఏత్వాహుః ఏతేన యోగః ప్రత్యుక్తః" ఇతి సూత్రేణ భగవతా వ్యాసేన యోగస్య ప్రత్యాఖ్యాతత్వాత్ నేదం వైయాసికంభాష్యమితి; తన్నస్థానే; తత్సూత్రస్య యోగప్రత్యాఖ్యానే తాత్పర్యాభావాత్" అనగా పతంజలిని నమస్కరించి వేదవ్యాసమునిచే వ్రాయబడిన యోగభాష్యమునకు టీకను వ్రాయుచున్నాను. "ఏతేన యోగః ప్రత్యుక్తః" అని బ్రహ్మసూత్రములలో సూత్రము గానవచ్చుటచే ఈ యోగభాష్యము వ్యాసకృతము కాదని కొందరనుచున్నారు. గాని యది సమంజసముగాదు. ఏమన ఆసూత్రము యోగమును నిరాకరించుటలేదు అని భావము. అది యెట్లు నిరాకరించుటలేదనగా యోగశాస్త్రము ప్రధానాది సత్తను సాధించునదికాదు. యోగస్వరూప - తత్సాధన - తదనాంతర ఫలవిభూతి - తత్పరమఫల కైవల్యములను బోధించునది. అయితే వికారయుక్తమగు ప్రధానమును, యోగస్వరూపాదులకు "తచ్చ కించి న్నిమిత్తీకృత్య వ్యుత్పాదిత మితి ప్రధానం సవికారం నిమిత్తీకృతం, నతు తద్వివక్షితం అతో యోగశాస్త్రా దపి న ప్రధానకారణవాదస్య ప్రామాణ్యం తస్యతత్ర తాత్పర్యాభావాత్" ఇత్యాది వచనములచే నిమిత్తముగా జేసెనేగాని దానిని సాధించుటలేదు. గాన వ్యాససూత్రమునకు యోగమును నిరాకరించుట తాత్పర్యము కాదు.

అయితే యోగమందలి ప్రధాన మప్రమాణమైనచో యమ నియమాదులు గూడ నప్రమాణములు గావాయను శంకకు "చక్షుస్సు రసగ్రహణమం దప్రామాణ్యము గదా యని రూపగ్రహణమందుగూడ నప్రమాణ మగుననుట యుక్తముకాదు" అనుటయే సమాధానము. "నానేన యోగశాస్త్రస్య హైరణ్యగర్భ పాతంజలాదేః సర్వథా ప్రామాణ్యం నిరాక్రియతే" ఇత్యాదినా భామతీ నిబంధః - ఇతి అనగా ఇందువలన హిరణ్యగర్భ పతంజలాదుల యోగశాస్త్రములు బొత్తిగా అప్రమాణములని త్రోసివేయతగినవి కావని భామతీనిబంధము చెప్పుచున్నది అని భావము.

నారాయణ తీర్థైర ప్యేతదభిహితం "స్వాతంత్ర్య సత్యత్వముఖం ప్రధానే సత్యంచ చిద్భేదగతంచ వాక్యైః వ్యాసో నిరాచష్ట నభావనాఖ్యం యోగం స్వయం నిర్మిత బ్రహ్మసూత్రైః॥ అపిచాత్మప్రదం యోగం వ్యాకరో న్మతిమాన్ స్వయం భాష్యాదిషు తత స్తత్రాచార్య ప్రముఖైః రక్షితః" ॥ఇతి॥

మాధవాచార్యై రపి పరాశరస్మృతి వ్యాఖ్యానాదిషు గ్రంథేషు భాష్యస్య వైయ్యాసికత్వ ముక్తం ఇతి నాత్ర వ్యామోహావకాశః" ఇత్యాది॥ ఇట్లుపాతంజల యోగశాస్త్ర పీఠికలో గానవచ్చుచున్నది. వీటినిబట్టి పతంజలి వ్యాసులకు పూర్వు డని చెప్పుట నిర్వివాదము.

## వ్యాసుల కాలనిర్ణయము.

వ్యాసులు 100 సంవత్సరములు తపంబుజేసి శ్రీశుకులను గనుట, ఆయన నిర్యాణానంతరము ధృతరాష్ట్ర పాండురాజులను గనుట, వారల వృద్ధాప్యమందు ధర్మరాజాదులు బుట్టుట, వారికి 86 వత్సరముల వయస్సులో భారతయుద్ధము సంభవించుట యీ మొదలగు సంగతులు భారతమువల్ల వెల్లడగుచున్నవి. గాన వ్యాసులు పాండవులకు కనీసపక్షము ఆరువందల వత్సరములకు పూర్వు డని తేట బడుచున్నది. ఇతడు ద్వాపరాంతమందలివా డని ప్రమాణములుగూడ గలవు. పాండవుల కాలమునుగూర్చి వెనువెంట వ్రాయుచుంటిని. అయితే జైమిని-వ్యాసులు వీరలచే రచింపబడిన పూర్వోత్తర ,మీమాంసలకు వృత్తిని వ్రాసిన యుపవర్షాచార్యులకు శిష్యుడగు పాణినిచే రచింపబడిన వ్యాకరణ సూత్రములకు భాష్యము జేయు కాలమునకును పై పతంజలికాలమునకును మధ్య సుమారు 19 వందల వత్సరము లంతర ముండుగాన ఆ పతంజలి భాష్యకార పతంజలికంటె భిన్నుడని వ్యాకరణ భాష్యోపోద్ఘాతమందు దధిమధవంశజుడగు శివదత్తశర్మగారు (లక్నో కాలేజీ ప్రొఫెసర్) వ్రాసిరి. గాని ఉద్భటాచార్యులుజెప్పిన "యోగేన చిత్తస్య" ఇత్యాదిశ్లోకమున్ను, చరకవ్యాఖ్యాతయగు చక్రపాణిజెప్పిన "పాతంజలమహాభాష్య" ఇత్యాదిశ్లోకమున్ను, యోగశాస్త్ర - వ్యాకరణమహాభాష్య - చరక సంస్కరణము అనెడి మూడుగ్రంథములను ఒకేవ్యక్తి రచించె నని చెప్పుటచేత పతంజలు లిద్దరు గారని సిశ్చయము. అయితే యోగశాస్త్ర - వ్యాకరణ భాష్యములకు మధ్యకాలము 19 వందల వత్సరములుగదా! ఇంతకాల మొకేవ్యక్తి జీవించియుండుట సంభవమా! అనిసంశయము పొడసూపక మానదు. గాని యోగాభ్యాసముగల వారెంతకాలమైనను జీవింపగలరుగదా!

## పాండవుల కాలనిర్ణయము

భీష్ముడు కురుపాండవ యుద్ధమునోజితుడై ఆవత్సరమున మాఘశుద్ధ సప్తమి నాడు మకర సంక్రాంతి యగుటచే అంతవరకు అనగా ఉత్తరాయణము వచ్చువరకు శరశయ్యయందుండి అష్టమినాడు మధ్యాహ్న సమయమున నిర్యాణమునందినట్లు "ప్రవృత్తమాత్రే త్వయన ముత్తరేణదివాకరే శుక్లపక్షస్య చాష్టమ్యాం మాఘమాసస్య పార్థివ! ప్రాజాపత్యేచ నక్షత్రే మధ్యంప్రాప్తే దివాకరే" (శాంతిపర్వ

46 అ.) అని భారతము చెప్పుచున్నది. దీనినిబట్టి సంపాతము అప్పటి కనులోమగతి గలదై మేషములో కనీసము 7 అంశలు ముందుకుబోయి యుండవలెను. "శతేషు షట్సు సార్ధేషు త్ర్యధికేషుచ భూతలే। కలేర్గతేషు వర్షాణా మభవన్ కురుపాండవాః" యనెడి రాజతరంగిణీ శ్లోకమునుబట్టి కలిలో 653 వత్సరములు గతించిన పిదప భారతయుద్ధము జరిగినట్లు తెలియుటచేతను, కల్యాదిలో సంపాతము మేషారంభములో నున్నందునను అట్టి సంపాతము 650 వత్సరములలో సుమారు 9 అంశలు వరకు ముందుకుబోయి యుండవలెను. ఇట్లైనను మాఘశుద్ధ సప్తమినాడు మకర సంక్రాంతి సంభవించవచ్చును. గాన ఇదివరలోనే నిర్ణీతమైన ఈపక్షమునే మనము గ్రహింతము.

ఇట్లు భీష్మనిర్యాణ సమకాల మగు యుధిష్ఠిర రాజ్యకాలమున సప్తర్షి మండలము మఘానక్షత్రమున నున్నట్లు వరాహమిహిరుడు "ఆసన్ మఘాసు మునయః శాసతి పృథ్వీం యుధిష్ఠిరే నృపతౌ" (వ. సం.) అని యిట్లు చెప్పినాడు. ప్రస్తుతము సప్తర్షి మండలమునందలి ప్రథమనక్షత్రమగు మరీచి చిత్రసమీపములో గానవచ్చుచున్నది. గాన మఘనుండి చిత్రవరకు లెక్కింప 33 నక్షత్రములగును. సప్తర్షిమండలము ఒక్కొక నక్షత్రమందు నూరేసి వత్సరములుండు నని "శతం శతంతు వర్షాణా మేకైకస్మిన్ మహర్షయః। నక్షత్రే నివసంత్యేతే ససాధ్వీకా సుహాతపాః" అని కశ్యపవరాహమిహిరాదులు చెప్పియున్నారు. అయితే "యావత్పరీక్షితో జన్మ యావన్నందాభిషేచనం। ఏతద్వర్ష సహస్రంతు జ్ఞేయం పంచోత్తరం శతం। తేతుపారిక్షితే కాలే మఘాస్వాసన్ ద్విజోత్తమ। తదాప్రవృత్తశ్చకలిః ద్వాదశాబ్ద శతాత్మకః। యదైవ భగవాన్ విష్ణో రంశోయాతో దివం ద్విజ। వసుదేవకులోద్భూత స్తదైవాత్రాగతః కలిః। యావత్సపాదపద్మాభ్యాం పస్పర్శేమాం వసుంధరాం। తావత్పృథ్వీ పరిష్వంగే సమర్థో నాభవత్కలిః॥ గతేసనాతనస్యాంశే విష్ణోస్తత్ర భువోదివం। తత్యాజసానుజో రాజ్యం ధర్మపుత్రో యుధిష్ఠిరః। నిమిత్తానిచ దృష్ట్వాస విపరీతాని పాండవః। యాతే కృష్ణే చకారాథ సోభిషేకం పరీక్షితః। ప్రయాస్యంతి యదాచైతే పూర్వాషాఢాం మహర్షయః। తదానందా త్ప్రభృత్యేవ కలిర్వృద్ధిం గమిష్యతి॥" (విష్ణుపురాణం 4-24-104 శ్లో॥ మొ॥)

అనెడి గ్రంథములో పరీక్షిత్తురాజ్యకాలమునుండి నందరాజ్య కాలమువరకు 15 వందల సంవత్సరము లగుననియు, సప్తర్షులు పరీక్షిత్తుకాలమున మఘలోను, నంద కాలమున పూర్వాషాఢలోను ఉన్నారనియు జెప్పెడిమాటలను సమన్వయించుటలో దాధిమథుడగు శివదత్తశర్మగారు "శతం శతంతు వర్షాణాం" అనెడిపాఠమును "శతం సత్ర్యంశవర్షాణాం" అని సమర్థింపవలెనని జెప్పుచు అందుకుగాను "అర్థతో

న్యూనప్రాప్తౌ త్యజ్యతేఽధికప్రాప్తౌ త్వేక మేవగణ్యతే ఇతి గణితవిదాం నియమః" అనగా గణితములో అర్ధాధికమును ఒగా, (గ్రహించుట, అర్ధమునకు తక్కువైనచో దానిని వదలివేయుట గణితజ్ఞుల నియమము) అనెడి నియమమును జూపిరి. ఈనియమానుసారము మన 33 నక్షత్రములకు సుమారు 44 వందల సంవత్సరము లగును. కలిలో 653 వత్సరములు గడచినపిదప యుద్ధము జరిగినట్లు రాజతరంగిణీ వచనమువల్ల గోచరమగుచున్నది. గాన వానిని కలిపినచో కలి ప్రారంభించి 5053 వత్సరములగును. నేటికి కల్యాది గతవత్సరములు పంచాంగరీత్యా 5038 అయి యున్నవి. ఈపద్వైషమ్యం మవివక్షిత మగుటచే లెక్కసరిపోవును.

ఇందువల్ల పాండవులిప్పటికి 44 వందల వత్సరములకు పూర్వులనియు వారికి కనీసము 6 వందల వత్సరములకు పూర్వము ద్వాపరములో వ్యాసులు జన్మించె ననియు యుధిష్ఠిర - పరీక్షిత్తుల కాలమున సంపాతము, మేషములో 9 అంశల యందును, సప్తర్షిమండలము మఘలోను ఉన్న దనియు తెలియుచున్నది.

సంపాత మట్లుండుటవల్ల ఆనాడు ప్రావృట్పక్షము వ్యవహారములో నుండె ననిచెప్పుటకు కారణముగలదు. ఎట్లన:— చాంద్రమాసములకు చైత్రాదినామలు గలుటకు "నక్షత్రనామ్నా మాసాస్తు జ్ఞేయాః పర్వాంతయోగతః।" (సూ. సి 14అ.) (అనగా పూర్ణిమతో నక్షత్రములు కలియుటచే ఆమాసముల కానక్షత్రనామలు గలైనవిభానము) అని యిట్లుచెప్పుటచే చంద్రునకు నక్షత్రయోగ మానశ్యకము. ఇయ్యది స్థిరమేషపక్షములోనే సంభవించును. అట్లు సంభవించిన చైత్రాదిమాసము లను అనుసరించి వరాహసంహితయందు "అన్నం జగతః ప్రాణాః ప్రావృట్కాల స్యచాన్నమాయత్తం। తస్మాదతః పరీక్ష్యః ప్రావృట్కాలః ప్రయత్నేన। ........। మార్గశిర శుక్లపక్షప్రతిపత్ప్రభృతి క్షపాకరేఽషాఢాం పూర్వాంవా సముపగతేగర్భా ణాం లక్షణం జ్ఞేయం (వ. సం. 21 అ) ఇత్యాది గ్రంథములో వర్షాది ఫలములు జెప్పబడినవి. "ఆదిత్యా జ్జాయతే వృష్టిః" ఇత్యాది ప్రమాణములనుబట్టి వర్షాది ఫలములకు సూర్యుని యుష్ణతగూడ యావశ్యకము; దాని మార్పునుబట్టి ఋతు వులుగూడ మారుచుండును. ఉక్తంచ:—"ధనిష్ఠాద్యాత్ పౌష్ణార్ధాంతం చర శ్శిశిరః। వసంతః పౌష్ణార్ధాత్ రోహిణ్యంతం। సౌమ్యా దాశ్లేషార్ధాంతం గ్రీష్మః। ప్రావృడాశ్లే షార్ధాత్ హస్తాంతం। చిత్రాద్యాత్ జ్యేష్ఠార్ధాంతం శరత్। హేమంతో జ్యేష్ఠార్ధాత్ వైష్ణవాంతం"

(అనగా :—

| అం. క. | | అం. క. | | | |
|---|---|---|---|---|---|
| 293—20 | మొదలు | 353—20 | వరకు | శిశిరము | ఉత్తరాయణము |
| 353—20 | ,, | 53—20 | ,, | వసంతము | |
| 53—20 | ,, | 113—20 | ,, | గ్రీష్మము | |
| 113—20 | ,, | 173—20 | ,, | వర్షఋతు | దక్షిణాయనము. |
| 173—20 | ,, | 233—20 | ,, | శరత్ | |
| 233—20 | ,, | 293—20 | ,, | హేమంత | |

ఇట్లు పరాశర సంహితాకాలమున ఋతువు లుండెనని భావము.)

ఇట్లు ఋతువులు మారుచుండునుగాన మూలములో "చరశ్శిశిరః" అని చరపదము నుపయోగించిరి.

ఇట్టి ఈ ప్రావృట్ పక్షములో స్థిర వసంతమందలి చైత్రముకంటె చరవసంత చైత్రమున్ను, స్థిర శిశిర ఫాల్గుణముకంటె చరవసంత ఫాల్గుణమున్ను నక్షత్ర పర్వయోగ విషయములో యథాప్రకారమున్నను పూర్వోష్ణతకంటె యెక్కువ యుష్ణతగలవై భిన్నఫలముల నిచ్చును. ఇంతియుగాక అప్పటి శీతబాధ తగ్గును. అందుచే శిశిరఋతువును త్రోసివేసిరి.

ఇంక ఆశ్వినారంభమునుండి వృద్ధి నొందదగిన శీతము భాద్రపదమునుండియే వృద్ధినొందును. గాని భాద్రపదాది మాసత్రికము వార్షికఋతు సంయోగము గలదిగాన యందలి శీతము స్నిగ్ధగుణవిశిష్టమై రూక్షమగు శిశిర శీతముకంటె భిన్నముగా నుండుటయు శిశిరపక్షీయ వార్షికశీతముకంటె ఇందలి వార్షికశీతము మాసాధికముగా నుండుటయు సంభవించుటచే స్నిగ్ధగుణమధికమై ప్రక్కనున్న మార్గశిరమందలి శీతములోనున్న రూక్షతను మాపుచేయును. ఇట్లు వార్షికశీతము హైమంతికశీతబాధను తగ్గించుననుటకు మొన్నగడచిన కార్తికబహుళ త్రయోదశి మొదలు 3 రోజులలో (అనగా క్రీస్తుశకం 1938 సం॥ నవంబరు 18, 19, 20, తేదులలో) వచ్చిన గాలివానయే దృష్టాంతము. ఆ 3 రోజులలో గాలివానకు చెట్లు చేమలతోపాటు చలికూడ యెగిరిపోయినది. అట్లు శీతబాధతగ్గిన యట్టి మార్గశిరమును శరదృతువులో జేర్చిరి. ఇట్లీ ప్రావృట్పక్షము నిష్పన్నమై యీనాడు వ్యవహారములో నుండెను. గాన చరక సంస్కర్తయగు పతంజలి చరకములో

యీ ప్రావృట్ పక్షమును శోధనకొరకు జేర్చెనని జెప్పుట సమంజసము. ఇట్టి రెండు పక్షములు చరకమున గానవచ్చుటకు కారణములు దెల్పబడెను. దానిననుసరించియే సుశ్రుతముగూడ దాని సంస్కర్తయగు నాగార్జునిచే సవరింపబడిన దనుటలో సందియములేదు. వాగ్భటుని కాలమునాటికి సంపాతము స్థిరమేషారంభమున యుండుటచే వానికీ ప్రావృట్ పక్షముతో నగత్యముగలుగలేదు. ప్రస్తుతము సంపాతము మేషారంభమునుండి సుమారు 23 అంశలవరకు పతంజలి కాలమందువలెనే వెనుకకుబోయి యున్నందున మనకా ప్రావృట్ పక్షమే ప్రకృతమందు వ్యవహార యోగ్యముగానున్నదని దెల్పుచు నీ విషయము నింతటితో ముగించుచుంటిని.

అయితే వాగ్భటుడు "శిశిరాద్యైస్త్రిభిస్తైస్తు విద్యాదయనముత్తరం" (వా. సూ. 3-2 శ్లో) అని చెప్పినందున ఉత్తరాయణ ప్రవృత్తి మాఘారంభమున గలుగుచున్నట్లు తెలియుచున్నదిగదా! అపుడు సంపాతము మేషప్రథమకలను విడచి ముందుకుపోవలసి యుండును. గాన "వాగ్భటుని కాలములో మేషాదిని సంపాతముండెను" అని ఇదివరలో స్థిరపరచిన యంశము సమంజసముగా దోచకున్నదని చదువరులకు తోచవచ్చును. దీనికి సమాధానం బెద్దియనిన:- మేషసంక్రాంతి యేమాసము (అనగా చాంద్రమాసము)లో సంభవించునో అట్టి చాంద్రమాసము చైత్రమనియు ఇట్లే వృషభాది సంక్రాంతులనుబట్టి క్రమముగా వైశాఖాదిమాసములు నిష్పన్నములగుచున్నవనియు జ్యోతిర్వేత్తల సిద్ధాంతము. గాన ఈ సంక్రాంతులనునవి ఈచైత్రాదిమాసములయొక్క శుద్ధపాడ్యమి మొదలు అమావాస్యవరకు ఉండెడి 30 తిథులలో యేతిథియందైనను సంభవింపవచ్చును. కావున పుష్యమాసాంతమున మకరసంక్రాంతి యైనదనుకొనుడు. అపుడు మాఘఫాల్గుణములనెడి మాసద్వయరూపమగు శిశిరఋతువు ఉత్తరాయణమున కారంభమగుచున్నదిగదా! దానంజేసి "శిశిరాద్యైః" ఇత్యాది సూత్రమును వాగ్భటుడు వచించెను. గాన పైన వివరించినట్లు వాగ్భటుని కాలమున సంపాతము మేషాదిలోనే నుండెననుమాట సమంజసమనియే చదువరు లెరుంగవలెను. ఇట్లు ఋతువిమర్శన ముగిసెను

## రసాద్యుత్పత్తి నిరూపణము

అవ:- ఋతువులు ఆరేగాన మధురాదిరసములుగూడ ఆరేయనెడి సిద్ధాంతమునవలన వ్యక్తమగుచున్న ఋతు-రసములకుగల గాఢానుబంధమునుబట్టి వెనువెంట రసాదుల యుత్పత్తి, నిరూపింపబడుచున్నది. (రసములకు గుణ వీర్యాదులకు యుండు అనుబంధముగూడ యిట్టిదే.) రస గుణ వీర్యవిపాక ప్రభావము లను

నవి ద్రవ్యము నాశ్రయించి యుండు పదార్థములుగాన వానియుత్పత్తిని విమర్శించి నచో చికిత్సోపయోగి యగు ద్రవ్య స్వరూపావబోధయు, అందువలన రోగికి సుఖా రోగ్యములను గల్గించెడి నిపుణతయు. సంభవించును.

విమర్శనము:— ద్రవ్యమునందు మధురాది రసములు తమ కుపాదానకారణ మగు భూతపంచకమందలి హెచ్చుతగ్గునుబట్టి కలుగుచున్నది. గుర్వాది గుణములు కుజాదిపంచతారా గ్రహములయొక్కయు, వీర్యము సూర్యచంద్రుల యొక్కయు, విపాకము జఠరాగ్నియొక్కయు అనుప్రవేశముచేతను గలుగును. దీనినిబట్టి రస— గుణ—వీర్య—విపాకములు భిన్నభిన్నములగు పాంచభౌతిక సముదాయమువల్ల బుట్టిన వనియు, వానియందలి సమత్వవిషమత్వ ధర్మములనుబట్టి రసాదులు, పరస్పరము మైత్రిగలవై వాని కార్యములకు సహాయము జేయుట (ఉ॥ పాలయందలి మధుర రసము జేయు శుక్రవర్ధన క్రియకు అందలి శీతవీర్యముగూడ తోడ్పడి మిక్కుటముగా శుక్రమును వృద్ధిజేయుట); శత్రుత్వముగలవై వాని కార్యములను నాశనముజేయుట (ఉ॥ శొంఠియందలి కటురసము శుక్రమును నశింపచేయుచుండ దానిని ప్రతిఘటిం చెడి అందలి మధురవిపాకము శుక్రమును వృద్ధిజేయుట) సంభవించు చున్నదని గ్రహించవలెను.

మరియు. వాగ్భటుడు "గ్రహేష్వనుగుణేష్వేకదోషమార్గో నవ స్సుఖః" (వా. సూ. 1 అ) (అనగా సూర్యాది గ్రహములు రోగికి అనుగుణముగా నుండగా వ్యాధిసుఖసాధ్యమగునని భావము) అని చెప్పెను. అత్రానుగుణాః అనుసృతాఃగుణాః యేషాం తేఽనుగుణాః। గ్రహాః సూర్యాదయః। అనేనరోగిణాం గ్రహాణాంచ ఉప కార్యోపకారకతా సూచ్యతే। అతోరోగిగతగుణానాం రసవీర్యాదీనాం ప్రాతికూల్య మకుర్వాంతః ఆనుకూల్యం సంపాదయంతీతి భావః। ప్రాతికూల్యంనామ తదేవ:—యత్ ఉష్ణగుణపీడితానాం రోగిణాముష్ణదానకరణం; శీతదానకరణంతు ఆనుకూల్యమేవ। తదా స్వాఽఽష్ణోష్ణశీతాదీన్ గుణాన్ రోగిభ్యో గ్రహాః ప్రతిపాదయంతీతి సిద్ధం। ఏవమేవ ఇతరశాల్యాది ద్రవ్యాణి ప్రత్యాఖ్యాం".

దీనినిబట్టి సూర్యాది గ్రహములు రోగి శరీరమున తమగుణములను ప్రవేశ పెట్టుటచే అనుగుణ్యతను సంపాదించుచున్నవని తెలియుచున్నది. దానంజేసి రోగి యందువలెనే ఇతర ద్రవ్యములందుగూడ తమ గుణములను ప్రవేశపెట్టుచున్న వని తేట బడుచున్నది. అయితే రస — గుణ — వీర్యాదులన్నియు గుణపద వాచ్యములగుచుండ కుజాదులు గుర్వాదిగుణములకు మాత్రమే కారకు లెట్లగుదు రనినచో, సూర్యాదులు వీర్యాదులకు కారకులని కంఠోక్తులుండుటచే గోబలీవర్ద

న్యాయముగా కుజాదులకు గుర్వాదిగుణకారకత్వము సిద్ధించెనని గ్రహింపవలెను. అట్టి కంఠోక్తు లెవ్వియనిన:—రసోత్పత్తినిగూర్చి "క్ష్మాంభోఽగ్ని (1) క్ష్మాంబుతేజః ఖవాయ్వగ్న్యనిలగోనిలైః। ద్వయోల్బణైః క్రమాద్భూతైః మధురాదిరసోద్భవః" (వా. సూ. 10 అ) అనియు (అనగా ద్రవ్యోపాదాన కారణములగు పంచమహాభూతములలో రెండేసి భూతముల యాధిక్యతచే నొక్కొకరసము జనించుచుండునని భావము). విపాకములనుగూర్చి "జాఠరేణాగ్నినా యోగాత్ యదుదేతిరసాంతరం। రసానాం పరిణామాంతే సవిపాక ఇతిస్మృతః" (వా సూ. 9 అ. 20 శ్లో) అనియు (అనగా భుజించిన ద్రవ్యమందు జాఠరాగ్నియొక్క అనుప్రవేశము గలుగుటచే ద్రవ్యోపాదానభూతముల పరిమాణములో న్యూనాధికభావము సంభవించునుగాన ద్రవ్యనిష్ఠరసములు మార్పునొందును; దీనినే విపాకమందురని భావము) వీర్యమునుగూర్చి "ఉష్ణం శీతం ద్విధైవాన్యే వీర్య మాచక్షతేపిచ। నానాత్మకమపి ద్రవ్య మగ్నిషోమౌమహాబలౌ। వ్యక్తావ్యక్తం జగదివ నాతిక్రామతిజాతు చిత్" (వా.సూ. 9 అ. 17 శ్లో) అనియు (అనగా జగత్తంతయు అగ్నిషోమాత్మకముగాన ద్రవ్యమందు చంద్రాంశానుప్రవేశమువలన శీతవీర్యము, సూర్యాంశానుప్రవేశమువలన ఉష్ణవీర్యము బుట్టుచున్నదని భావము) జెప్పబడెను. ఇట్లు జనించిన రసవిపాకవీర్యములు ప్రభావము తుల్య ప్రమాణములో నున్నపుడు యొకదానికంటె యొకటి బలీయమగుటచే పూర్వపూర్వమును ఉత్తరోత్తరము జయించునని "రసం విపాకస్తౌవీర్యం ప్రభావస్తా న్వ్యపోహతి। బలసామ్యేరసాదీనామితి నైసర్గికంబలం" (వా. సూ. 9 అ. 25 శ్లో; చ. సూ. 26 అ. 74 శ్లో) అని ఇట్లు చరక—వాగ్భటులు వచించిరి. ప్రభావమను నది రాహు కేతు జన్యమై తత్స్థానీయ మగుచున్నది. యెట్లన:—చెప్పబోవు ప్రభావ విమర్శమునుబట్టి సర్వాధికబలము గల ప్రభావమను నది ఆకాశభిన్న ద్రవ్యాంతర సంయోగరూపకారణము లేనిదని అనగా అణు సన్నివేశవిశేషమే కారణముగాగలదని సిద్ధమగుచున్నది. అణుసన్నివేశ విశేషమువలన పాంచభౌతిక ద్రవ్యమందు ఆకాశమనెడి భూతముయొక్క పరిమాణములోను దానినిబట్టి అతిసూక్ష్మముగా తూకములోను మార్పుగలుగునని యొప్పుకొనక తప్పదు. ఆకాశమునకు తూకము గలదని అది నీటితూకముతో సరిపోల్చగా $1{\cdot}5 \times \overline{10}^{31}$ తూకముండునని హాబుల్ పండితుడు మొదలగు నవీనపాశ్చాత్య పండితులు కూడ నిశ్చయించుకొనుచున్నారు. ఇక రాహు కేతువులన్ననో, పరాశరాదులు వచించిన "యద్య ద్భావగతౌవాపి యద్యద్భావేశ సంయుతౌ। తత్తత్ఫలాని ప్రబలౌ

(1) సుశ్రుతములో అమ్లలవణముల యుత్పత్తి విషయమై వాగ్భటునికి వ్యత్యాసముగా నున్నది. దానినిగూర్చి రసవీర్యాదుల వైలక్షణ్య నిరూపణ ప్రకరణము జూడుడు.

పరివేశతాం తమోగ్రహః'' ఇత్యాది వచనములచే, బలాధిక్యత – [1]తమో రూపిత్వము "రాహుర్నామ పాతః'' అనెడి వచనముచే వృత్తద్వయ సంయోగజన్య సంపాతాత్మక సన్నివేశ విశేషరూపిత్వము–అనెడి ప్రభావ ధర్మములు గలవారు. గావున ప్రభావము రాహుకేతుజన్యమై తత్ స్థానీయ మగుచున్నది. వీర్యము చంద్ర సూర్యాంశజ మగుటచే చంద్ర సూర్య్యస్థానీయమని వేరుగా జెప్పపలేదు. గ్రహణ కాలమందు రాహుకేతువులు సూర్య చంద్రులను గ్రసించుటను మనము చూచుచుంటిమి గదా! దానికి సూచకముగనే "ప్రభావస్తు వ్యపోహతి'' అని వాగ్భటుడు వచించెను.

ఇక సవిపక్వ్యములగు గుర్వాదిగుణములు ఇరువదియు పృథివ్యాది భూత పంచకము నాశ్రయించియే యుండుటచే "తత్ స్వంగారి కాదయః" (సూ.సి.12 అ. 24 శ్లో.) ఇత్యాది వచనప్రకారము అట్టి భూతపంచక ప్రతీకములగు బుధాది గ్రహ పంచకమువల్ల బుట్టినట్లు స్పష్టమగుచున్నవి. గాన గుణసమూహము బుధాది గ్రహ పంచక స్థానీయమని దెల్లమగుచున్నది. పాంచభౌతికమగు ద్రవ్యమిట్లు నవగ్రహావిష్ట మైనందున తనయందున్న రసవీర్యాదులచే ప్రత్యేకముగా నానాఫలముల నిచ్చు చుండునని "కించిద్రసేన కురుతే కర్మవీర్యేణ చాపరం। ద్రవ్యం గుణేన పాకేన ప్రభావేణచ కించన'' (చ. సూ. 26 అ. 73 శ్లో.) అని ఇట్లు చరకుడు వచించెను. రసవీర్యాదుల కిట్టి స్వాతంత్ర్యముండుటకు కారణము పై జెప్పిన గ్రహాదులయను ప్రవేశమే యని చెప్పక తప్పదు. అట్టి యనుప్రవేశమే లేనిచో నొకే ద్రవ్యమందు మధురరస – ఉష్ణవీర్యాది విరుద్ధ గుణములు; నొక వెల్లగోడపై విరుద్ధములగు తేజస్తిమిరములు కలసియున్న చందంబున కలసియుండవలెను. అద్దాని నొప్పినచో నట్టి విరుద్ధగుణములు నాశ జన్మకాలములో పరస్పరము ఎంత ప్రతిఘటన గలవై యుండునో ఆశ్రయద్రవ్యము పూర్తిగా నశించువర కంతే ప్రతి ఘటన గలవిగా నుండును గాని మధ్యకాలములో న్యూనాధిక ప్రతిఘటన గలవి కానేరవు. దీనికి వాతాది ప్రకృతులు మారనొందవని చెప్పుటయే దృష్టాంతము. ప్రతిఘటనయందట్టి న్యూనాధికత గలిగినచో దీపోపాసనాది కారణాంతరములు గల్గియేయుండవలెను. అట్టి కారణాంతరములు గల్గినచో తేజస్తిమిరాదులు వ్యధికర ణములగునుగాని సమానాధికరణములు గానేరవు. అనగా తేజస్సు దీపమును, తదభావరూపమగు తిమిరము దీపభిన్నములగు ఆకాశాదులను ఇట్లే యితర పదార్థ

[1] "నీలం నభః" ఇత్యాద్యాపాతదృష్టిబోధక వచనానుసారము ఆకాశము తమ స్సునుబోలి నల్లగానుండును. గాన యట్టి ఆకాశరూపులగుటచే రాహు కేతు వులకు తమోరూపిత్వము సిద్ధమగుచున్నది.

ములు భిన్న భిన్నాదికరణముల నాశ్రయించియుండుననీ భావము. గాన యొకే ద్రవ్యమందున్న రసమును విపాకము జయించుననినచో రసకారణ ద్రవ్యము లొకటనియు విపాక కారణద్రవ్యము ఇంకొకటనియు చెప్పక తప్పదు. (ఇందులకు దృష్టాంతము—మన శరీరమందు ప్రవిష్టమైనవిషము కాలాది కారణములనుబట్టి తనయందలి భూతపంచకాంశలను గొన్నిటిని గోల్పోయి దూషీవిష మనబడుచున్నది. ఉక్తంచ:—"జీర్ణం విషఘ్నౌషధిభి ర్హతంవా దావాగ్ని వాతాతప శోషితంవా। స్వభావతోవా గుణవిప్రహీనం విషం హి దూషీ విషతా ముపైతి॥ (సు. క.)

మరియు వరిధాన్యము మొ॥ వానియందు నూతనావస్థలో గుర్వాదిగుణములు కానవచ్చుట పురాణావస్థలో నవి నశించుట మనము చూచుచుంటిమి. (అనగా నూతనావస్థలోనున్న గుర్వాది గుణములకు కారణములగు భూతపంచకాంశములు పురాణావస్థలో నశించునని భావము. అట్లే జఠరాగ్ని బాగుగా నున్నతరి త్రావినపాలు యుక్తమగు జాఠరరసానుప్రవేశము గలదై ద్రవ్యగుణశాస్త్రములో జెప్పినతీరున మధురవిపాకమునంది ఓజోజనక మగును. కానిచో జాఠరరసమునందలి దోషముచే అమ్లవిపాకమును (ఆసిడేషను) బొంది అనగా ద్రవ్యగుణశాస్త్రము జెప్పిన మధుర విపాకమునకు విరుద్ధమగు విపాకమునంది రోగకారణ మగుచుండుట అందరెరిగిన విషయమేకదా! ఇట్లే వీర్యాదుల నూహింపవలెను). ఇట్లాశ్రయద్రవ్యభేదము గలుటయె వ్యధికరణ మనబడును. గాన రస-వీర్య విపాకాదులకు పరస్పరజిగీష వ్యధికరణమందే సంభవించును గాని సమానాధికరణమందు సంభవింప నేరదు. ఈ విషయమై అరుణదత్తుడు వాగ్భటసూత్రస్థానములో జేసిన విచిత్ర ప్రత్యయారబ్ధ ద్రవ్య నిరూపణముగూడ తోడ్పడుచున్నది. కావున పాంచభౌతిక ద్రవ్యమందు నే జెప్పిన రీతిని నవగ్రహానుప్రవేశముచే వీర్య-గుణ-ప్రభావములు బుట్టుచున్నవనిసిద్ధాంతితము. ఇందువలన "కించిదసేనకురుతే" ఇత్యాది సూత్రముచే బోధింపబడిన రసవీర్యాదుల కుండు స్వాతంత్ర్యమున్ను "బలసామ్యే రసాదీనాం" ఇత్యాది సూత్రముచే జెప్పబడిన జిగీషుత్వమున్ను "గ్రహేష్వనుగుణేషు" అనెడి సూత్రసూచితమగు గ్రహానుకూల్యతయున్ను ఉపపత్తి సిద్ధమగుచున్నది. అయితే ద్రవ్య మీ రీతిని నవగ్రహావిష్టమైయుండ "పంచభూతాత్మకం తత్తు" అని ద్రవ్యలక్షణము చెప్పుట సంగతమా యని సంశయము తోపవచ్చును. గాని సూర్యాదిగ్రహములుగూడ పాంచభౌతికము లని జెప్పుటచే నా సంశయ మంతరింపగలదు. ఇదియే రసాద్యుత్పత్తి నిరూపణము.

## ప్రభావ విమర్శనము

అవ:—పైప్రకరణమున ప్రభావమునకు ఉత్పత్తి మాత్రము వర్ణింపబడెను; ఇచట విమర్శ జేయబడుచున్నది. ప్రభావమనగా "రసాదిసామ్యేయత్కర్మ విశిష్టం

తత్ప్రభావజం" (వా. సూ. 9 అ 26 శ్లో) "రసవీర్య విపాకానాం సామాన్యం యత్రలక్ష్యతే। విశేషః కర్మణాంచైవ ప్రభావస్తస్యచస్మృతః।" (చ. సూ. 26 అ. 69 శ్లో) ఇత్యాది ప్రమాణములనుబట్టి యే రెండు ద్రవ్యములయందు రసాదులు తుల్యముగా నుండియు, నొక ద్రవ్యము చేయలేని పనిని వేరొక ద్రవ్యము చేయునో అట్టి ద్రవ్యమం దాపనినిచేయు పదార్థమునకే ప్రభావమని పేరు. ఉ॥ "దంతీరసాద్యై స్తుల్యాపి చిత్రకస్యవిరేచనీ" (వా. సూ. 9 అ 26 శ్లో) "కటుకః కటుకః పాకే వీర్యోష్ణోచిత్రకో మతః। తద్వద్దంతీ ప్రభావాత్తు విరేచయతిమానవం। విషం విషఘ్న ముక్తంయత్ప్రభావస్తత్రకారణం। ఊర్ధ్వానులోమికం యచ్చ తత్ప్రభావ ప్రభావితం। మణీనాంధారణీయానాం కర్మయద్వివిధాత్మకం। తత్ప్రభావకృతంతేషాం ప్రభావోఽచింత్యఉచ్యతే" (చ. సూ. 26అ 72 శ్లో॥) (అనగా నేపాళము, రసాదులలో, చిత్రమూలమునకు తుల్యముగానున్నను చిత్రమూలము చేయలేని విరేచనముచేయుట యనెడిపనిని తాను చేయుచున్నది. దీనినే విశిష్టకృత్యమందురు. ఇయ్యది ప్రభావము వలన బుట్టును. మఱియు, ఊర్ధ్వగతిగల విషమును అధోగతిగల విషము హరించుచున్నదనుటలో విషముల రెంటికి యుండెడి యూర్ధ్వాధోగతులు ప్రభావహేతుకములు; ధరింపతగిన—విషహరత్వాది ధర్మములుగల మణులయందలి నానావిధకర్మలు ప్రభావమువల్లనే బుట్టుచున్నవి. గాన ప్రభావమనునది అచింత్యమైనది. అనగా ఇదమిత్థమని నిరూపించుటకు శక్యము కానిదని భావము.) ఇచట ప్రభావమనగా శక్తియని చెప్పుచు దాని స్వరూపమునుగూడ చక్రపాణి నిర్వచించెను. ఎట్లన:— తేనజీవనమేధ్యాది ద్రవ్యస్య రసాద్యచింత్యం సర్వం ప్రభావ ఇతి జ్ఞేయం। ప్రభావశ్చేహా ద్రవ్యశక్తి రభిప్రేతా। సాచ ద్రవ్యాణాం సామాన్యవిశేషః దంతీత్వాదియుక్తావ్యక్తిరేవ, యతః శక్తిర్హి స్వరూపమేవ భావానాం, నాతిరిక్తం కించిద్ధర్మాంతరం భావానాం; ఏవం ప్రదేశాంతరోక్త గుణప్రభావేష్వపివాచ్యం, యధోక్తం "ద్రవ్యాణిహి ద్రవ్యప్రభావా ద్గుణప్రభావా"దిత్యాది। నచ వాచ్యం దంత్యాదిరేవ స్వరూపతఏవ విరేచయతి, తేనకిమితి జలాద్యుపహతా దంతీ నవిరేచయతీతి; ప్రతిబంధకాభావవిశిష్టస్యైవం ప్రభావస్యకారణత్వాత్, జలోపహతాయాం దంత్యాం జలోపఘాతః ప్రతిబంధకః ఇత్యాద్యనుసరణీయం। నైయ్యాయిక మతశక్తివాదేయాచ విషస్యవిషఘ్నత్వే ఉపపత్తిరుక్తా ఊర్ధ్వాధోగామిత్వ విరోధలక్షణా వాంతర్భాగత్వాత్ (కర్మవిశేషాంతర్భూతత్వాత్) ప్రభావా దేవస్యాత్। ఏవమూర్ధ్వానులోమికత్వాదా పార్థివత్వాది లక్షణేఽపి వాచ్యం, (చ.సూ 26 అ.7శ్లో.వ్యా.) ఇతి.

(అనగా జీవన మేధ్య ఇత్యాది ద్రవ్యముల యందుండెడి రసాదులచే ఊహింప శక్యముగాక అచింత్యముగానున్న సర్వమున్ను ప్రభావమనబడును. ఇచట ప్రభావమనగా ద్రవ్యనిష్ఠమైన శక్తి. అయ్యది ద్రవ్యములకు సామాన్య విశేషము,

అనగా ద్రవ్యత్వాది సామాన్యముకంటె భిన్నమగు దంతీత్వాది విశేషముతో గూడిన వ్యక్తియే యైయున్నది. యేమన-శక్తియనగా భావముల స్వరూపమేగాని భావములకంటె భిన్నమైనది కాదుకదా! "ద్రవ్యాణి హి ద్రవ్యప్రభావాత్ గుణ ప్రభావాత్" ఇత్యాది వచనములచే అన్యత్ర జెప్పబడిన గుణప్రభావముల విషయములోగూడ ఇట్లే చెప్పవలెను. అయితే ప్రతిబంధకము లేని ప్రభావమే కార్యమును జేయును; జలోపఘాతముగల దంతియందు జలోపఘాత రూపకమగు ప్రతిబంధకముండుటచే నది విరేచనము చేయకున్నదిగాన దంత్యాది భావములు స్వరూపముచేతనే విరేచనము చేయుచుండె నంటివిగనుక దానిబట్టి జలాద్యుపఘాతముగల దంతి (నేపాళము) యేల విరేచనము చేయకున్నదని శంకింపరాదు. నైయ్యాయిక మతశక్తివాదమునందు, విషమునకు విషాంతరమును హరించెడి శక్తి గలదను సందర్భమున జెప్పిన ఉపపత్తిలో విషగతులయందు ఊర్ధ్వాధోగామిత్వ రూప వైషమ్యము నిర్దేశింపబడెను. అయ్యది కర్మవిశేషాంతర్భావ మగుచున్నది. గాన యిచటగూడ అనగా విషమును విషము హరించు నను సందర్భములోగూడ ప్రభావమే కారణమగుచున్నది; నైయ్యాయికుల యూర్ధ్వాధోగామిత్వము కారణము కాజాలదు. ఇట్లే ద్రవ్యములకుండు ఊర్ధ్వగత్వ అనులోమనత్వాదుల విషయమై జెప్పిన పార్థివత్వాది లక్షణములు [1]విరోధించునపుడు వానిని నిరసించి ప్రభావమునే కారణముగా జెప్పవలెనని భావము.

అరుణదత్తుడుగూడ 'రసాదిసామ్యే' ఇత్యాది శ్లోకవ్యాఖ్యలో "రసవీర్య విపాకాది గుణాతిశాయిగా ద్రవ్యస్య స్వభావోయస్సప్రభావః। ఉక్తంచ: రసవీర్య విపాకాది గుణాతిశయవా నలం। ద్రవ్యస్వభావో నిర్దిష్టో యః ప్రభావస్సకీర్తితః ఇతి" అని యిట్లు పై యర్థమునే బోధించెడి పంక్తులను వ్రాసెను. ఇంతవరకు జెప్పిన చక్రపాణి అరుణదత్తుల వచనములంబట్టి ప్రభావమనగా ద్రవ్యము, గుణము, మొదలగు వానియందు ఉండెడి శక్తియనియు, శక్తులనగా దంతీత్వ మధురత్వ గురుత్వాదియుక్తమగు వ్యక్తులే అనగా భావస్వరూపములే యనియు మనకు బోధపడుచున్నది. దంతీత్వాదులచే ప్రపంచిత భావస్వరూపమే ప్రభావమని శబ్దార్థము గోచరించుచున్నది. అయితే కేవలభావ స్వరూపము సర్వాంతర్యామియై వ్యాపకముగా నుండునుగాన మన కగోచరమైనది. దానినే సాంఖ్యులు మూలప్రకృతి యనుచున్నారు. అయ్యది మహాభూతము లనెడి వికృతులవారకు బ్రహ్మసాన్నిధ్యముచే

---

1 ఇట్లు విరోధించుట కలదు గనుకనే "ద్రవ్యమూర్ధ్వగమం తత్రప్రాయోగ్ని పవనోత్కటం అధోగామిచ భూయిష్ఠం భూమితోయగుణాధికం" (వా. సూ. 9 అ. 11 శ్లో) అనుశ్లోకములో "ప్రాయః" "భూయిష్ఠ" పదములు ప్రయోగింపబడెను.

విభజింపబడి తుదకు దంతీత్వ, మధురత్వ, గురుత్వాదులచే పరిచ్ఛిన్నతనంది అనగా నామరూపములు గలదై ద్రవ్యములయందు ప్రభావమను సామాన్య నామముతో వ్యవహరింపబడుచున్నది. ఇదియే ప్రభావవిమర్శనము.

ద్రవ్యోత్పత్తి నిరూపణపూర్వక ద్రవ్యప్రభావ నిరూపణము.

అవ: పైన "ద్రవ్యప్రభావాత్ గుణప్రభావాత్" అని చెప్పియుండుటచే జ్ఞేయమగు ద్రవ్యప్రభావమును ద్రవ్యోత్పత్తి జ్ఞానపూర్వకముగా గనుసంధించినచో ప శిష్టము సుబోధమగునని ప్రథమమున ద్రవ్యోత్పత్తి నిరూపింపబడు చున్నది.

ద్రవ్యమందలి దంతీత్వాది ద్రవ్యజాతిభేదములనవి అణ్వాత్మక ద్రవ్యముల యందు అణువులయొక్క సన్నివేశ విశేషములచేతను, అట్టి సన్నివేశ విశేషములు పాకవశముచేతను గలుగుచున్నవి. పాకమనగా విజాతీయ తేజస్సంయోగము. ఇట్లను సన్నివేశ విశేషములచే భౌతిక జగద్రచన జరుగుచున్నదని తార్కికుల యభి మతము. దీని నేయణువాదమందురు. అణువులు పీలువులనియు, పిఠరములనియు రెండు విధములు. పీలు=పరమాణువు. ఉ. Electron (ఎలెక్ట్రాన్) మొ॥ వి. పిఠరము= ద్వ్యణుకాది ఉ॥ రాగి అణువు మొ॥ వి. భౌతిక జగన్నిర్మాణమునకు పీలుపాకము కారణమని కణాద మతానుయాయులగు వైశేషికులునను; పిఠరపాకముకూడ కారణమని గౌతమ మతానుయాయులగు నైయాయికులును జెప్పుచున్నారు.

పీలుపాకస్వరూపము

పీలుపాకమనగా నొకస్థితిలో నున్న పరమాణువులకు వేగాతిశయముగల తేజస్సుయొక్క అభిఘాత (ఆఘాత) రూపమగు సంయోగము గలిగినపుడు ఆ పర మాణువులు భిన్నములై అందు అవశ్యముగా వ్యాపారము (రసాయన వ్యాపారము (Chemical action) పుట్టును. అందువల్ల వానికి విభాగముగలిగి దానిచే ఆరంభక సంయోగము (అనగా కార్యారంభక సంయోగము) అవయవి (ఇచట అవయవి అనగా ద్వ్యణుకాది రూప పిఠరము) నాశముగలుగు నగను నశించి పరమాణువులు స్వతంత్రములగును. పిదప వేరొక రూపము పుట్టుటకై మరల అదృష్టాది (తేజో నిష్ఠ [1]విజాతీయత్వాది) సామగ్రి ననుసరించి పరమాణువులయందు వ్యాపారము

---

([1]) ఇచట విజాతీయత్వమనునది తేజోభూతము (అనగా అగ్నిభూతము) నందు సంభవించదు. గాని ఆయగ్నిభూతముయొక్క యుపాధిభేదమును బట్టిగాని ప్రమాణ భేదమునుబట్టిగాని దానికి విజాతీయత్వ కల్పన జేయబడెను.

(రసాయన వ్యాపారము) తజ్జన్యమగు విభాగము మొదలగునవి వాని క్రమ ప్రకారము జరుగును. అందువల్ల క్రొత్తద్రవ్య మేర్పడును. ఇట్టి కార్యక్రమమునే వైశేషికులు పీలుపాక మనెదరు. ఉక్తంచ:—పరమాణుష్వేవపాకం వదతాం (పీలుపాకవాదినాం) వైశేషికాణాం అయమాశయః। వేగాతిశయవతా తేజసాపరమాణూనామభిఘాతసంయోగేసతి అవశ్యం తేషు క్రియాజాయతే. తతోవిభాగః తత ఆరంభకసంయోగనాశే సతి అవశ్యం యావ దవ యవినాశః తతస్స్వతంత్రేషు రూపాంతరోత్పత్తౌ పునరదృష్టాది ఘటితసామగ్రీవశాత్ పరమాణుషు క్రియావిభాగాదిక్రమేణ యథాస్థితి మపరావయవి పర్యంతముత్పత్తిః ఇతి (నీలకంఠ ప్రకాశము. పరిత్యక్త పరిచ్ఛేదము. "రూపాది" చతుష్టయం పాకజం" అనుచోట). ఇదియే ముందు జెప్పబోవు (Electron theory) (ఎలక్ట్రాన్ థియరీ) లో మేము చెప్పిన విశిష్ట రసాయన వ్యాపార మనదగును.

## పీఠరపాక స్వరూపము

పీఠరపాకమనగా నొకస్థితిలో నున్న పరమాణువులకు అభిఘాతరూపమగు (ఇచట నోదనజనిత తేజస్సంయోగ మని చెప్పుట యుక్తము; అభిఘాతముకంటె నోదనము బలహీనమైనది గాన చెప్పబోవు కార్యక్రమమునకు ఆ నోదనపదము సరిపోవును) తేజస్సంయోగము గలిగినను అందువల్ల ఆరంభక సంయోగమునకు విరుద్ధమగు విభాగమును బుట్టించెడి రసాయన వ్యాపారము నియతముగా బుట్టునని చెప్పుటకు ప్రమాణములేదు గాన ద్వ్యణుకాది రూపపిఠరాంశమునందుగూడ పాకము నంగీకరించుట యుక్తము. అందుచేతనే నల్లని ఘటమును ఆవములో బెట్టి కాల్చినపిదప అది యెర్రబడి రూపాంతరమునందినను పిఠరము నశించలేదు గాన అదే యీ ఘటమును ప్రత్యభిజ్ఞ (ఆనవాలు) గూడ గలుగుచున్నది. ఇట్లు చెప్పుటలో అసంఖ్యాకములగు అవయవుల (పిఠరముల) నాశనమును కల్పించుట యనెడి సర్వేతుకల్పనమగూడ గలుగనేరదు. ఉక్తంచ:—అవయవిష్వపిపాకం వదతాం నైయ్యాయికానామయమాశయః। తేజసాపరమాణూనా మభిఘాత సంయోగిసోస్య నియమతః ఆరంభక సంయోగ ప్రతిద్వంద్వివిభాగజనక క్రియాజనకత్వే మానాభావేన అవయవిష్వపిపాకస్స్వీకారఉచితః। అతఏవసోయంఘట ఇతిప్రత్యభిజ్ఞాపి సంగచ్ఛతే, అనంతావయవినాశాద్యకల్పనేవలాఘవంచ (నీ. ప్ర.) అనగా ఇచట నొకఘటమును దృష్టాంతముగా దీసుకొనుడు. అందు కొన్ని పరమాణువులు (పీలువులు) గలవు అవి యెప్పుడైనను దోధూయమానముగాక సంయోగస్థితిలో యున్నపుడె మనకు గానవచ్చును గాన నవి యీఘటమున సంయోగస్థితిలో నున్నవని చెప్పక తప్పదు. రెండుగాని అంత కధికముగాని యణువులు గలసినచో పిఠరమనబడును. అట్టి పిఠరములో ఘటమున కొన్ని యున్నవికదా! పిఠరమున

కవయవియనియు, పీలువునకవయవమనియుసంజ్ఞ సుప్రసిద్ధము. అయితే "కారణగుణాః కార్యే సంక్రామంతి" అను న్యాయమువలన నల్లని తంతువులతో నేయబడిన వస్త్రము గూడ తనకు కారణమగు తంతువులయందలి నల్లదనమును గలిగియుండుట సర్వజన విదితము. అట్లే ప్రథమున ఘటమునకు కారణమగు పార్థివ (మట్టి) పరమాణువులు నల్లగా యుండుటచే తజ్జన్యమగు ఘటమనెడి కార్యముగూడ నల్లగనే యున్నది. ఇప్పుడా వస్త్రమునకు రూపము మారవలెనన్న దీనికి కారణమగు తంతువుల రూపము మారవలెను. ఇట్లే ఘటమునకు మొదటిదగు నలుపురంగుబోయి యెఱుపురంగు రావలెనన్నచో దానికి కారణమగు పరమాణువుల రూపము మారవలెను. కాని ఆ పరమాణువులు సంయోగస్థితిలో పిఠరరూపముగా నున్నవి గాన పైజెప్పిన తేజ స్సంయోగమువలన నవి విభాగమునంది పరమాణురూపము నందిన పిదప తిరిగా ఆ తెజస్సునందలి విజాతీయత్వాద్యదృష్టసామగ్రినిబట్టి వేరొకరూపము (ఎఱ్ఱని రూపము) గలవై పిఠరత్వమునుబొంది తమకు కార్యమగు ఘటమునుగూడ నెఱ్ఱగా జేయుచున్నవి. ఈ మార్పు కారణమగు పరమాణువుల యందే జరుగునని వైశేషికుల భావము. ఇచట ఘటముగా మారిన పరమాణువులు తమ మునుపటి రూపమగు నలుపురంగును వదలుటకుగాను, ఘటముగా మారుటకు ఏ సంయోగ స్థితిలో నవి పిఠరత్వమును బొందియుండెనో ఆ సంయోగస్థితిని (అవిభాగభావమును) వదలుకొని పరమాణువులై రక్తరూపమునొంది పిదప అపూర్వపు పిఠరత్వమును తిరుగా ఘటరూపమును పొందవలెను. ఇట్టి నియతినన్ని కార్యకారణములనున్ను సహింపలేని నైయ్యాయికుల యభిమతమేమనః— వైశేషికులు చెప్పు తేజస్సంయోగము వల్ల పరమాణురూపము మారినదంటిరో అదే తేజోభిఘాతమువల్ల పిఠరములయందే రూపుమారినదన్నచో ఈ పిఠరధ్వంసమున్ను పునస్సృష్టియు నక్కరలేకయే ఘటమునకు రూపాంతరము సంభవించునుగదా యని నైయ్యాయికుల యభిమతము. ఇయ్యది ముందు చెప్పబోవు ఎలెక్ట్రాన్ థియరీ (Electron theory)లో మేము చెప్పిన సామాన్య రసాయన న్యాయము అని అనదగును. ఈ మతమున రూపాంతరము బుట్టును గాని ఆరంభక సంయోగము (అనగా ప్రథమమున ఘటమగుటకు పరమాణువుల సంయోగము లేక అరేంజిమెంట్) (Arrangement) మారదు. వైశేషికమతమునందు ఆరంభక సంయోగముగూడ మారును. ఇంతియే వీరుభయులకుగల భేదము. ఈభేదము చూచుటకు స్వల్పముగా నున్నను వైశేషిక మతమందలి ఆరంభక సంయోగము (ఫస్ట్ అరేంజిమెంట్) (First Arrangement) పోయి ద్వితీయ సంయోగము (సెకెండ్ అరేంజిమెంట్) (Second Arrangement) కలుగునన్నెడి సిద్ధాంతమునుబట్టి పరమాణువులవె యైనను ద్రవ్యమునకు రూపాంతరము గలుగును లేక వేరొకటిగా మారును అనుమాట మనకు సున్నవునాయి—

పగడము_ముత్యము_అనెడి 3 ద్రవ్యములను శోధించుటవలన తేటబడుచున్నది. యెట్లనః_పై మూడింటిని కాల్చిచూచినచో మూడు వస్తువులయందు యుండెడి ద్రవ్యము సుధయనెడి (కాల్సియం ఆక్సైడ్ అనెడి) క్షారపదార్థమొకటియే యైనను మూడున్ను వేరువేరు గుణధర్మములు గలవిగా గానవచ్చును. అనగా సున్నము కంటె పగడము కఫహరశక్తి నధికముగా గలదిగను ఇవి రెండును ఉష్ణవీర్యము గలవై ముత్యము శీతవీర్యము గలదిగను యుండును. ఇట్లే బొగ్గు (గ్రఫాయిట్ Graphite) - వజ్రము వీనిని కాల్చి చూచినపుడు ఈమూటియందును కార్బన్ (Carbon) అనెడి వస్తువుతప్ప వేరొకటి కానరాదు. గాని వాని గుణధర్మములు మాత్రము వేరు వేరుగనే యుండును. దీనినిబట్టి రెండు భిన్నపదార్థములకు (సున్నపు రాయి, ముత్యము లేక బొగ్గు-వజ్రము మొదలగు రెండుపదార్థములకు యొకే భౌతిక పరమాణువులు అనగా ఆణవిక చతుర్భూత పరమాణువులు కారణమైనను ఆరంభక సంయోగమునందు అనగా కార్యముపుట్టుట కారంభింపబడిన సంయోగమునందు గలిగెడి మార్పునుబట్టి, ఉన్న వియేబదివర్ణము లైనను వానిసంయోగ భేదములనుబట్టి సంస్కృత శబ్దములన్నియు వేనవేలుగా భిన్నభిన్న స్వరూపములతో నెట్లు జనించుచున్నవో యట్లే కార్యములగు రెండు పదార్థములున్ను భిన్నజాతిగలవిగనే యగునని సిద్ధాంతితము. ఇట్లు సంయోగములో మార్పుగలుగుటకు విజాతీయ తేజస్సంయోగమే కారణము దీనినిబట్టి దంతీత్వాదిద్రవ్యజాతిభేదము లనునవి అనగా "అస్తిభాతిప్రియం నామరూప మిత్యంశపంచకం" అనెడి అంశపంచకములో ప్రకృత్యంశలగు నామ - రూపములు బుట్టుచున్నట్లు స్పష్టమగుచున్నది. ఇట్లు ద్రవ్యోత్పత్తి నిరూపింపబడెను.

## ద్రవ్య ప్రభావ నిరూపణము

పై జెప్పబడిన నామరూపము లనునవియే ప్రకృత్యాత్మక ప్రభావబోధకము లగుచున్నవి; గాన ప్రభావమును నదిగూడ అణుసన్నివేశ విశేషముచేతనే వ్యక్తమగుచున్నదని అనగా నామరూపములుగల దగుచున్నదని తెలియుచున్నది. ఇట్లు స్థావరజంగమద్రవ్యములకు అణుసన్నివేశ విశేషమే కారణమగుచున్నందున తార్కికుల యణువాదము భౌతికదృష్టిగల సర్వజనులకంగీకార్య మగుచున్నది. వైద్యులుగూడ "పంచమహాభూతశరీరి సమవాయః పురుష ఇత్యుచ్యతే, తస్మిన్ క్రియా" ఇత్యాది వచనములచే భౌతికశరీరమును మాత్రము చికిత్సోపకరణముగా గ్రహించువారు, కావున తార్కికమతానుయాయులే యగుచున్నారు.

అయితే విజాతీయ తేజస్సంయోగమువలన తేజోభూతము ద్రవ్యగత పంచ భూతములలో జేరుటచే వాని పరిమాణములయందు న్యూనాధికభావము, రసాద్య

త్పత్తి నిరూపణములో చెప్పిన సూర్యాది గ్రహముల ప్రవేశమువలన [illegible] గలుగుటచే ద్రవ్యనానాత్వము సిద్ధించిన దనవచ్చును; గాన ద్రవ్యగతపరమాణువు లేకజాతిగలవై ఆరంభక సంయోగము మాత్రము మారుచున్నదని చెప్పుట యుక్తిసహజము కాదని సంశయింప వచ్చును. [illegible] ఉష్ణత వల్ల ద్రవ్యగత పరమాణువులయందు వేగము సంభవించును [illegible] (వత్తిడి=Pressure) కలిగి అందువలన ఆరంభక సంయోగము [illegible] గలుగును. దానివలన ద్రవ్యమునకు విజాతీయత్వము సంభవించును. ఇట్లగుట [illegible] వజ్రరచనావిధానములో ప్రత్యక్ష మగుచున్నది.

## వజ్రరచనావిధానము

నాలుగుమణుగుల ఇనుమును నీరువలె కరిగించి ఆ ఇనుపనీటిలో [illegible] బాగును పట్టుకారుతో పట్టి ముంచి హఠాత్తుగా అనీటిని చల్లార్చినచో ఆ ఇనుపనీరు అన్నివైపులనుండి యొకేసారి సంకోచమునంది గడ్డకట్టును. అందువలన బాగునందలి పరమాణువుల కీ వత్తిడి (Pressure) తగిలి ఆపరమాణువుల ఆరంభక సంయోగము వేరువిధముగా మారిపోవుటచే నా బాగు వజ్రమగును. పిదప ఆ ఇనుపగడ్డను మహా ద్రావకము (Natric acid)లో వేసి ఇనుమునంతను కరిగించి నపుడు వజ్రము ద్రావకములో కరుగదుగాన నిలచి యుండును. ఇట్లు వజ్రమును జేయువిధానములో బాగు పరమాణువులు వజ్రపరమాణువులుగా మారుటకు వత్తిడి అనే గుణము గలుగుట తప్ప వేరొక భూతసంయోగ మేదియు గానరాదు. ఇట్టు గుణములు కారణమైనచో వానిని అసమవాయి కారణములందురు; ద్రవ్యము లైనచో వానిని సమవాయికారణము లందురు. పీలుపాక వాదములో "వేగాతి శయవతా తేజసా" అని చెప్పియుండుటచే నట్టి పాకకృత్యములో తేజస్సనునది ద్రవ్యమందు జేరక తనయందలి వేగమును మాత్రము జేర్చునుగాన నట్టి సందర్భమున యీ విజాతీయ తేజస్సు "గసేషు వ్యపదిశ్యంతే సాహచర్యోపచారతః" అను న్యాయప్రకారము ఔపచారికముగా అసమవాయి కారణమును చున్నదని గ్రహించ వలెను. ఇట్టి అసమవాయి కారణమునే కటాలిక్ ఏజంట్ అని పాశ్చాత్యులందురు. అందువలన "ద్రవ్యగతపరమాణువులు యేకజాతి గలవై ఆరంభక సంయోగము మాత్రము మారుచున్నదని చెప్పుట యుక్తిసహము గాదు" అనెడి సంశయము నిరస్తమైనది. ఇంతియ గాక "సూర్యో ఒమనీచిమాదత్తే। సర్వస్మాద్భువనాదధి। తస్యాః పాకవిశేషేణ" (అనగా సూర్యకిరణమువల్ల బుట్టెడి పాకవశముచే సర్వ భువనము బుట్టుచున్నదని భావము) అని యిట్లు వేదముగూడ పై అర్థమునే చెప్పుచున్నది.

ఇంతవరకు జేసిన విమర్శనను బట్టి అణ్వాత్మక ద్రవ్యజాతమునకు పీలువులు కారణమనియు అట్టి ద్రవ్యములయొక్క దంతీత్వాది జాతిభేదములకు అట్టి సన్నివేశ విశేషము కారణమనియు బోధపడుచున్నది. ఇట్టి ద్రవ్యస్వరూపమే ప్రభావ విమర్శనములో జెప్పినరీతిని ద్రవ్యప్రభావ మనబడుచున్నది. ఇదియే ద్రవ్య ప్రభావ నిరూపణము.

## గుణప్రభావ నిరూపణము

ఇక గుణప్రభావ మనగా ప్రభావ విమర్శనములో జెప్పినరీతిని గుణస్వరూపమేగదా! గుణమనునది గుణియగు ద్రవ్యమందు సమవాయి సంబంధము (అనగా నిత్య సంబంధము) గలదై యుండునదియు, ద్రవ్యద్వారముననే తెలియదగినదియు యగుటచే ద్రవ్యమందలి గుణము గోచరించినప్పుడనే గుణప్రభావము గూడ గోచరించును. ఇదియే గుణప్రభావ నిరూపణము.

## సమాన - విచిత్ర ప్రత్యయారబ్ధ ద్రవ్యతాత్త్విక లక్షణ విమర్శనము

చదువరులారా!

రసాద్యుత్పత్తి నిరూపణములో "ఈ విషయమై అరుణదత్తుడు వాగ్భట సూత్రస్థానములో జేసిన విచిత్ర ప్రత్యయారబ్ధ ద్రవ్య విమర్శనముగూడ తోడ్పడు చున్నది' అని యొకపంక్తిని వ్రాసియుంటిని. గాన అరుణదత్తుడు చేసిన విమర్శనము రసాద్యుత్పత్తి నిరూపణములో యెంతవరకు తోడ్పడునో విమర్శింతము

వాగ్భటుడు "పునశ్చతత్ (ద్రవ్యం) విచిత్ర ప్రత్యయారబ్ధ ద్రవ్యభేదేన భిద్యతే" (వా. సూ. 9 అ. 28 శ్లో.) అని యిట్లు ద్రవ్యమును సమాన ప్రత్యయారబ్ధమనియు విచిత్ర ప్రత్యయారబ్ధమనియు రెండుగా విభజింపగా, అరుణదత్తుడు వాని లక్షణములను వ్రాయుటలో "తదేవం ద్రవ్యాణాం ద్వైవిధ్యం. యతః కానిచిద్ద్రవ్యాణి యద్వైవమహాభూతైర్యథావిధైః రసాదయ ఆరబ్ధాస్తైరేవ తథావిధైర్మహాభూతైస్తదాశ్రయాణ్యపి ద్రవ్యాణ్యారబ్ధాని, తాని రసాది సమాన ప్రత్యయారబ్ధాన్యుచ్యంతే, తాని చ యథాయథం తత్కర్మ రసాద్యనుగుణం సామాన్యాత్కుర్వంతే యథా క్షీరేక్షుశర్కరాదీని కానిచిత్పున స్తదాశ్రిత రసాదిసమారంభక మహాభూతాన్యన్యాని తదాశ్రయ ద్రవ్యారంభ కాణ్యన్యానిచ మహాభూతాని, తైరారబ్ధాని తాని విచిత్ర ప్రత్యయారబ్ధాని ద్రవ్యాణి... ... ...యథామధుష్ట యవమత్స్య సింహాదీని" ఇతి (అనగా ద్రవ్యమునకు యేపంచభూతములు యేవిధముగా (యేవిధ

మైన అణుసన్నివేశ విశేషము అనగా ఆయనిమ అనేంచెనుంటగలవై) కాదగునవి లగుచున్నచో ఆపంచభూతములే [illegible] అదేవిధముగా (అదేవిధమైన అణు సన్నివేశ విశేషముగలవై) [illegible] సమాన ప్రత్యయారబ్ధము: ఉ. పాలు, చెరుకు. పంచదార మొ॥ వి; [illegible] (వేరగు) పంచభూతములు అనగా అణుసన్నివేశ విశేషములో [illegible] పంచభూతములు కారణములైనచో అట్టి ద్రవ్యము విచిత్ర ప్రత్యయారబ్ధము [illegible] లంకలు, యవలు, చేపలు, సింహము మొ॥ నవి; అవి యిట్లు గ్రాసెను. [illegible] "తన్నిష్ఠ రసాదులనుగూడ" యనెడి వాక్యమందలి ఆదిపదముచే గుణ వీర్యాదులు గ్రహింపబడినవి. అయ్యవి సూర్యాది గ్రహాంశాదుల యనుప్రవేశముచే గల్గు చున్నట్లు రసాద్యుత్పత్తి నిరూపణములో నిరూపించితిమి. అట్లు గల్గుట సమాన విచిత్ర ప్రత్యయారబ్ధోభయద్రవ్య సాధారణమైనను ఆయుభయ ద్రవ్యములయంగ దున్న అణుసన్నివేశములు భిన్నములుగా నుండుటనుబట్టి తదనుగుణ్యముగా సూర్యాది గ్రహాద్యంశలు గ్రహింపబడుచుండును. యెట్లన:- ద్రవ్యము సమాన ప్రత్యయారబ్ధత్వమున కనుగుణ్యమైన అణుసన్నివేశము గలదైనచో "శీతం వీర్యేణ యద్ద్రవ్యం మధురంరసపాకయోః" ఇత్యాది సామాన్య శాస్త్రానుగుణముగా, తా నాగ్నేయమైన యెడల సూర్యాంశమునే గ్రహించి ఉష్ణవీర్యము గలదిగను లేక సౌమ్యమైనయడల చంద్రాంశను గ్రహించి శీతవీర్యము గలదిగనుయగును. ఉ॥ సున్నపు రాతి భస్మకటురసము గలదగుటచే అనగా అగ్న్యనిల భూతము లధికముగాగల పంచభూతాంశములు గలదగుటచే ఆగ్నేయమగుచుగాన సూర్యాంశమును గ్రహించి ఉష్ణవీర్యము గలదగుచున్నది. పాలు మధుర రసముగలదగుటచే అనగా భూ జల భూతము లధికముగాగల పంచభూతాంశములు గలదగుటచే సౌమ్యమగును. గాన చంద్రాంశమును గ్రహించి శీతవీర్యము గలదగుచుచున్నది.

ద్రవ్యము విచిత్ర ప్రత్యయారబ్ధత్వమున కనుగుణ్యమగు అణు సన్నివేశము గలదైనచో "మధురం కించి దుష్ణంస్యాత్" ఇత్యాది విశేష శాస్త్రానుగుణముగా పై విధమున తానాగ్నేయమైనను చంద్రాంశమునే గ్రహించి శీతవీర్యము గలదిగను లేక సౌమ్యమైనను సూర్యాంశమును గ్రహించి ఉష్ణవీర్యముగలదిగను యగుచున్నది. ఉ॥ ముత్యభస్మము సున్నపురాతి భస్మమువలె ఆగ్నేయమైనను చంద్రాంశమును గ్రహించి శీతవీర్యము గలదగుచున్నది. చేపలు, పాలవలె సౌమ్యములైనను సూర్యాంశము గ్రహించి ఉష్ణవీర్యముగలవిగనే యగుచున్నవి. ఇట్లే విపాకాదుల [illegible]గూడ నూహింపవలెను.

ఇట్లు సయుతగ్రహణమునకు దృష్టాంతము: మహాద్రావకము (నైట్రిక్ ఆసిడ్) లో వెండి, రాగి, అనెడి ధాతువులను వేసి కరిగించి అందు మితముగా నీరును బోసి దానిలో ఇనుపరేకును బెట్టినచో నయ్యది యాద్రావమందలి రాగినిమాత్రము నాకర్షించును. వెండి నాకర్షింపదు. అట్లే రాగిరేకును బెట్టినచో నయ్యది వెండి నాకర్షించునుగాని రాగి నాకర్షింపదు. ఇట్లు జరుగుటకు, ఇనుమునకు రాగియందు రాగికి వెండియందు యుండెడి రసాయన ప్రీతి (ఎఫినటీ) యే కారణము. ఇదియే దృష్టాంతము

మరియు ప్రత్యయమునకు అనగా కారణమునకు విచిత్రతను నిరూపించుటలో "నానాకార సన్నివేశ విశేషయుక్తాని మహాభూతాని ప్రతిసత్వం ప్రాక్తన శుభాశుభ కర్మ ప్రేరితః విచిత్రః మహాభూత పరిణామ ఇత్యర్థః" అని యిట్లు నానా ప్రకారములగు సన్నివేశ విశేషములు (ఆటమిక్ అరేంజమెంట్సు) ద్రవ్య వైచిత్ర్యమునకు కారణమునిగూడ కంఠోక్తిగా జెప్పుటచే పైన వ్రాసిన "యథావిధైః" "తథావిధైః" అనెడి పదములకు కుండలిత గ్రంథమునే అనగా యీ బ్రాకెట్లలో వ్రాయబడిన "యేవిధమైన అణుసన్నివేశ విశేషము గలవై" "అదే విధమైన అణు సన్నివేశ విశేషము గలవై" అనెడి అర్థభాగములనే అర్థములుగా జెప్పవలెను. ఈ విషయములో చక్రపాణిగూడ "ననుఉష్ణ శీతాభ్యామగ్ని సలిలాభ్యాం కృతస్య లవణస్యాప్యుష్ణ శీతత్వేనభవితవ్యం. తల్లవణం కథముష్ణంస్యాత్ (ఇతి పూర్వపక్షః) నైవం, యతః భూతానామయం స్వభావః యత్కేనచి త్ప్రకారేణ సన్నివిష్టాని కంచిద్గుణ మారభంతే, నసర్వం। యథా సుకుమకే ఽ ద్భిస్సంధుగోగసః క్రియతే, నస్నేహః। తథా సైంధవే వహ్నినాపి నోష్ణత్వమారభ్యతే। అయంచ భూతానాం సన్నివేశ ఉదృష్ట ప్రభావకృత ఏవ. సచ సన్నివేశః కార్యదర్శనాదున్నేయః (ఇతి సిద్ధాంతః) (చ. సూ. 26 అ. 31 సూ. వ్యా.) అని యిట్లు వ్యాఖ్యజేసి యున్నాడు. అనగా ఉష్ణ శీత ధర్మములుగల అగ్ని జలము అనెడి భూతముల వలన బుట్టిన లవణముగూడ ఉష్ణ శీత ధర్మములు గలదిగనే యుండవలెను గాని ఉష్ణవీర్యము గల దెట్లయ్యెనని పూర్వపక్షము గలుగుచుండగా "నానాకార విధములగా సన్నివిష్టములైన (అనగా అణుసన్నివేశ విశేషముగలిగిన) భూతములు, ద్రవ్యమందు కొన్ని గుణములనే గల్గించునుగాని అన్ని గుణములను గల్గింపవు. యెట్లనగా పైన దల్హణునిచే విచిత్ర ప్రత్యయారబ్ధ ద్రవ్యమునకు ఉదాహరణముగా నివ్వబడిన లంకలనెడి కాయధాన్యములో ఉన్న ఉదక భూతము అచట తనకుండుచున్న అణు సన్నివేశ విశేషముచే మధురరసమును మాత్రము బుట్టించి, మధురరసమున్నచోట యుండదగిన స్నేహగుణమును బుట్టించకున్నది;

ఇందులకణుసన్నివేశ విశేషమే కారణము. అట్లే సైంధవ లవణమందలి అగ్ని భూతము ఉష్ణవీర్యమును గల్గించుటలేదు. భూతములయొక్క యట్టి యీ సన్నివేశ విశేషమున కగోచరమగు ప్రభావ విశేషముచే నగుచున్నది. గాన కార్యమును బట్టియే యూహింపతగియుండును. మరియు "ఆగమవేదసియా శాస్త్రియ పస్త్వనాస్త్ర ద్విధానాం కల్పనా ప్రసరంతి" అనికూడ చెప్పినారు. (అనగా యీ అణుసన్నివేశ విశేషము శాస్త్రీక గమ్యముగాని మనవాళ్లకు గోచరమగునది కాదని భావము.)

## అణూత్పత్తి నిరూపణము (ఎలక్ట్రాన్ థియరి)

అవ:- పైనచెప్పిన అణుసన్నివేశ విశేష మనుచోట అణూత్పత్తి జ్ఞాన మావశ్యకముగాన దాని నిట సంక్షేపముగా వివరించుచుంటిని.

ఈ విషయమై పాశ్చాత్యులలో రాసాయనిక విద్వాంసులు చాలవరకు వ్యయ ప్రయాసలకోర్చి పరిశోధనలను సలిపి హైడ్రోజన్ మొదలగు 92 మూల తత్వము (ఎలిమెంట్సు) లను కనిపెట్టిరి. ఇందు జతపరచిన "తత్వాన్తర్గత సంవిభాగము (పీరియాడిక్ సీరీస్ ఆఫ్ ది ఎలిమెంట్సు) అనెడి పదకమును చూడుడు.

పైనజూపిన టేబిల్‌కు వ్యాఖ్య—పై మూలద్రవ్యములు 92 యున్నట్లు నిశ్చయజ్ఞానముతో నిరూపింపబడినవి. ఈ 92 ద్రవ్యములు 7 గ్రూపులుగా విభజింపబడినవి. ఈ గ్రూపులకు ముఖ్యలక్షణము లెవ్వియనగా—ఒక అణువులో ఒక ప్రోటాను (ధనవిద్యుత్కణము) మధ్యనుండును. దానిచుట్టూ ఒక ఎలక్ట్రాను (ఋణవిద్యుత్కణము) తిరుగుచుండును. అట్టి మొదటి గ్రూపునకు చేరిన మూల ద్రవ్యమనబడును. ఉ॥ హైడ్రోజన్. ఈ గ్రూపులో ఇది ఒక్కటియే యున్నది. ఈ మొదటి గ్రూపునకు 2 ఎలక్ట్రానులతోనే లేయరు భర్తీయగును. అట్టి మొదటి లేయరునకే యీ హైడ్రోజను అనునది ఒక ఎలక్ట్రాన్ తక్కువగా గలిగియున్నందున దాని భర్తీకొరకు వేరొక అణువుతో ౧ సంఖ్యలో కలియును. అనగా ప్రతి ఎలిమెంటుయొక్క అణువునకు దాని దాని క్లాసు ననుసరించి ఒకటి మొదలు 6 వరకు నుండెడి లేయర్లలో అన్నిగాని కొన్నిగాని లేయర్లు యుండును. అట్టి అణువునకు ఉన్న లేయర్లలో అన్నిటికంటె పైగా నుండెడి లేయరు తనకు ఉండవలసిన ఎలక్ట్రానుల సంఖ్యలో ఎంత తక్కువగానుండునో ఆ తక్కువసంఖ్య భర్తీయగునట్లు వేరొక ఎలిమెంటుయొక్క అణువులతో కలియుచుండును. ఉ: ఆక్సిజన్ రెండవ లేయరు గ్రూపులో 8 పీరియాడిక్ నంబరుగల ఎలిమెంటు, గాన దాని అణువులో మధ్య 8 ప్రోటానులు గుంపుగా నుండును. ఆక్సిజన్ 6 వాలన్సి గల దగుటచే

# పీరియాడిక్ సీరీస్ ఆఫ్ ది ఎలిమెంట్సు

| [illegible] | [illegible] | వాలెన్సీ సంఖ్య | | | | | | | | | లేయర్ సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | 0 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 0 | |
| 1 | 0 | | హైడ్రోజన్ 1 | | | | | | | | హీలియం 2 | 1 |
| 2 | 1 | హీలియం 2 | లిథియం 3 | బెరిలియం 4 | బోరాన్ 5 | కార్బన్ 6 | నైట్రోజన్ 7 | ఆక్సిజన్ 8 | ఫ్లోరిన్ 9 | | నియాన్ 9 | 2 |
| 3 | 2 | నియాన్ 10 | సోడియం 11 | మెగ్నీషియం 12 | అల్యూమినియం 13 | సిలికాన్ 14 | ఫాస్ఫరస్ 15 | సల్ఫర్ 16 | క్లోరిన్ 17 | | ఆర్గాన్ 18 | 3 |
| 4 | 3 | ఆర్గాన్ 18 | పొటాసియం 19<br>కాపర్ 29 | కాల్సియం 20<br>ఝింక్ 30 | స్కాండియం 21<br>గాలియం 31 | టిటేనియం 22<br>జర్మేనియం 32 | వెనేడియం 23<br>ఆర్సెనిక్ 33 | క్రోమియం 24<br>సెలీనియం 34 | మాంగనీస్ 25<br>బ్రోమిన్ 35 | ఐరన్ 26<br>కోబాల్టు 27<br>నిక్కల్ 28 | క్రిప్టాన్ 36 | 4 |
| 5 | 4 | క్రిప్టాన్ 36 | రోబీడియం 37<br>సిల్వరు 47 | స్ట్రాన్షియం 38<br>కాడ్మియం 48 | ఇట్రియం 39<br>ఇండియం 49 | ఝర్కొనియం 40<br>టిన్ 50 | నియోబియం 41<br>అంటిమని 51 | మాలిబ్డెనం 42<br>టెల్యూరియ 52 | .........43<br>అయోడిన్ 53 | రుథీనియం 44<br>రోడియం 45<br>పెలేడియం 46 | స్కెనాన్ 54 | 5 |
| 6 | 5 | స్కెనార్ 54 | సీజియం 55 | బేరియం 56 | లాంథనం 57 | సీరియం 58 | ......... | ......... | ......... | ......... | | |
| | | | గోల్డు 79 | మార్క్యూరీ 80 | థాలియం 81 | లెడ్ 82 | టాంటలం 73<br>బిస్మత్ 83 | టంగ్స్టన్ 74<br>హాఫీనియం 84 | ......... 75<br>రీనియం 85 | ఆస్మియం 76<br>ఇరిడియం 77<br>ప్లాటినం 78 | రాడాన్ 86 | |
| 7 | 6 | రాడాన్ 86 | ఇర్నియం 87 | రేడియం 88 | .........89 | థోరియం 90 | .........91 | యురేనియం 92 | ......... | ......... | | 7వ లేయరు పూర్తి కాలేదు |

N.B.—ఈ రేఖయిన లేయరుకు 26 సంఖ్య తక్కువగా నుంకుటచే పూర్తి కాలేదు. ఈ 26 ఎలక్ట్రానులు చేరినచో యీ లేయరు పూర్తియగును. అప్పుడు 118 మూలద్రవ్య సంఖ్య సిద్ధించును.

రెండవ లేయరు భర్తీయగుటకు ఇంకా 2 ఎలక్ట్రానులు కావలెను. అనగా దాని అణువులో మధ్యనున్న 8 ప్రోటానుల గుంపును చుట్టూ 8 ఎలక్ట్రానులు తిరుగుచుండును. అందుచే ౧ వాలన్సీగల హైడ్రోజన్ మొ. వాని రెండు అణువులతో గాని 2 వాలన్సీగల బేరియం మెగ్నీషియం మొ॥ వాని ఒక అణువుతో గాని కలియును.

మరియు లేయరు అనగా కవచము. ఇవి 7 విధములుగా నున్నవి. ఇవి క్రమముగా 2, 8, 8, 18, 18, 32, 32, సంఖ్యగల ఎలక్ట్రానులు గలవిగానుండును. ఇవి యొకదానిచుట్టూ మరియొకటి ఆవరించి యుండును. 7 వ లేయరులో 6వ వాలన్సీవరకు మాత్రము ఎలిమెంట్సు కనిపెట్టబడినవి, గాన ఆ లేయరు పూర్తి కాలేదు. ఒక ఎలక్ట్రాన్ లేయరు అనిపించుకొనదుగాన హైడ్రోజనుకు మాత్రం లేయరు లేదు.

రెండవ గ్రూపు—ఈ గ్రూపులో మొదటిదగు హీలియంయొక్క అణువులో మధ్య 2 ప్రోటానులు గుంపుగా నుండును. దానిచుట్టూ రెండు ఎలక్ట్రానులు తిరుగుచుండును. ఇట్టి దీనిని జీరో వాలన్సీగల ఎలిమెంటు అందురు. ఉ॥ హీలియం ఇట్టి అణువుపైని ఇంకొక లేయరు (పొర) తయారగుటకు 8 ఎలక్ట్రానులు కావలెను. అవి మొదటి లేయరులోని 2 ఎలక్ట్రానులతో కలసి 10 ఎలక్ట్రానులుగలదై వాలన్సీ గ్రూపులో జీరో నెంబరుకు జేరును ఉ॥ నియాన్ వాలన్సీ అనగా ఈ హీలియం నియానుల మధ్య రెండవ లేయరు భర్తీయగుటకు ఒక్కొక ఎలిమెంటుకు ఒక్కొక ఎలక్ట్రాను చొప్పున పెరుగుచుండును. అట్లు పెరుగుచున్న సంఖ్యలో ఎంత సంఖ్యనుకలిపినచో లేయరు భర్తీయగునో ఆ సంఖ్యనే వాలన్సీ అందురు. అట్టి వాలన్సీని తెల్పుటకుగాను లేయరులో నుండెడి ఎలక్ట్రానుల సంఖ్యను సూచనగా 0.1.2 3 మొ॥ సంఖ్యలు టేబిల్ను పై జూపబడినవి. గాన ఆసంఖ్యను 8లో తీసి వేసినచో వాలన్సీ సంఖ్యవచ్చును. లేక గ్రూపునెంబరు ఆసంఖ్యనే వాలన్సీ సంఖ్యగా చెప్పవచ్చును. ఈ వాలన్సీ సంఖ్య తెలియుటచే ఆ ఎలిమెంటుయొక్క అణువు పైని పైనున్న అసంపూర్ణ లేయరునందలి ఎలక్ట్రానుల సంఖ్య పూర్తిచేయుటకు అగుటకు కావలసినట్టి సంఖ్యగల యే యే ఎలిమెంట్లతో కలియునో అని విషయం తెలియును. ఉ॥ ఆక్సిజను అనునది రెండవ గ్రూపులో 6 వాలన్సీ సంఖ్యగల గదిలో నున్నది. దీని పీరియాడిక్ నంబరు (వరుసనంబరు) 8. అనగా ఎనిమిదేసి ప్రోటానులుగల అణువులు గలదని భావము. దీని వాలన్సీ నంబరు 6. అనగా దాని పై లేయరులో 6 ఎలక్ట్రానులు గలవని భావము. ఈ లేయరు భర్తీయగుటకు అనగా 8 అగుటకు ఇంకా 2 ఎలక్ట్రానులు కావలెను. గాన అట్టి 2 ఎలక్ట్రానులుగల (అనగా లేయరు

భర్తీకాకుండా యుండెడి) ఎలిమెంట్లలో యీ 2సంఖ్యను యిచ్చెడి యే ఎలిమెంటు యొక్క అయినా నక అణువుతో గాని అంత కధిక అణువులతో గాని కలియును గాన, హైడ్రోజన్ అణువునకు నక ఎలక్ట్రానును ఉండునుగనుక నక ఆక్సిజను అణువు 2 హైడ్రోజన్ అణువులతో గలసి నక జలఅణు వగును. లేక నక ఆక్సిజన్ అణువు 2 వాలన్సీ గల బేరియం-మెగ్నిషియం మొ॥ వాటియొక్క యొక్కొక్క అణువుతో గలియును. లేక 2 అల్యూమినం అణువులు 3 ఆక్సిజన్ అణువులతో గలియును. ఇట్లే మిగిలిన వాని నూహింపవలెను.

N. B:—జీరో వాలన్సీలో నున్న 6 వాయువులు మాత్రము (వానిపై నున్న లేయర్లు భర్తీగా యున్నందున) వేనితోనూ కలియవు.

మరియు, అణువులో మధ్య ప్రోటానులు యెన్నియుండునో అన్ని ఎలక్ట్రానులు ఆ ప్రోటానుల గుంపుచుట్టూ తిరుగుచుండును. అవిగాక అధిక సంఖ్యగల అనగా అసంపూర్ణముగా లేయరులోనున్న ఎలక్ట్రానులు లేయరును తయారుచేయుచుండును. గాన హైడ్రోజన్‌లో నుండు ప్రోటానుసంఖ్యను మించి లేయరు తయారుచేయుటకు ఎలక్ట్రానులు లేనందున హైడ్రోజన్‌కు లేయరు అనునదియే లేదు. హీలియంలో 2 ప్రోటానులకు 2 ఎలక్ట్రానులు ఉండి పై లేయరుకు శూన్యస్థానముగుటచే మొదటి లేయరు గ్రూపులో దానిని జీరో స్థానములో జేర్చిరి.

3 వ గ్రూపు— ఈ గ్రూపులో మొదటిదగు నియాన్ అను దాని అణువులో మధ్యనున్న 10 ప్రోటానులచుట్టూ తిరుగుచున్న 10 ఎలక్ట్రానులున్ను (అనగా దీని పీరియాడిక్ నెంబరు 10 గాన దీని అణువులో మధ్య 10 ప్రోటానులుండును. అందువలన వానిచుట్టూ 10 ఎలక్ట్రానులు తిరుగుచుండునుగాన మొదటి లేయరు నుండవలసిన 2 ఎలక్ట్రానులున్ను రెండో లేయరుకుండవలసిన 8 ఎలక్ట్రానులున్ను) రెండు లేయర్లను భర్తీచేయుచున్నందున దీనిని (నియానును) మూడవ గ్రూపులో జీరో వాలన్సీలో జేర్చిరి. వీనిపై వచ్చెడి నకొక్క ఎలిమెంటునకు నకొక్క ఎలక్ట్రాను చొప్పున పెంచుకుంటూ రాగా ఆర్గానువద్దకు వచ్చు సరికి లేయరు భర్తీయగును. గాన దీనిని (ఆర్గానును) నాలుగో గ్రూపులో జీరో వాలన్సీలో జేర్చిరి. ఇట్లే మిగిలిన గ్రూపుల నూహింపవలెను.

N. B:—ప్రతి ఎలిమెంటునకు పీరియాడిక్ నంబరు గలదు. ఆనంబరునుగాని, ఆనంబరులోగాని 2, 10, 18, 36, 54, 86, అనెడి సంఖ్యలనుగాని, సంఖ్యలలోగాని త్రోసివేయగా మిగిలిన 8 సంఖ్యను తక్కువగా నున్న సంఖ్య ఆయా ఎలిమెంట్లకు

హాలన్సీ నంబరగును. ఈ నియమము 8 హాలన్సీ నంబరుగల ఐరన్, కోబాల్టు మొ॥ వానికి వర్తింపదు. ఏ ఎలిమెంటుకు పీరియాడిక్ నంబరు ఎంత ఉండునో ఆ ఎలిమెంటులో అన్ని ప్రోటానులున్ను, అన్ని ఎలక్ట్రానులున్ను ఉండును. మరియు, 58 నంబరు మొదలు 73 నంబరువరకు యుండెడి 14 ఎలిమెంట్లు సీరియం అనెడి ఎలిమెంటుతో తుల్యధర్మములు గలవిగా నుండును గాన ఆ గ్రూపులోనే గణింపబడినవి. వీనికి (రేర్) రేర్‌బర్త్స్ అని ఆంగ్ల నామము గలదు.

మరియు, హాఫియం 84; రీనియం 85; ఇలీనియం 87; అనెడి మూడు ఎలిమెంట్ల నంబర్లు సందిగ్ధముగా నున్నవి. ఈ మూడున్ను, పొలోనియం, అయోనియం అనెడి రెండు ఎలిమెంట్లున్ను మొత్తం 5 న్ను దరిమిలాను అనగా 1925 సంవత్సరమునకు దరిమిలాను కనిపెట్టబడినవి.

మరియు; 1897లో అనగా థామ్సన్ టైములో ఎలక్ట్రాన్ థియరీ బీజభూతముగా నుండెను. 1907లో కొంచెము వృద్ధిగాంచెను. 1912లో నీల్సుబోర్ టైములో బాగుగా బయలుపడినది. ఆపిమ్మట చాలా పెంపొందినది.

మరియు, ఈ పదకములో జూపబడిన 92 మూలద్రవ్యములలో సోము వాలన్సీ గల హీలియం మొ॥ 6 న్ను హైడ్రోజన్, ఫోరాన్, కోరాన్, ఆక్సిజన్, నైట్రోజన్, అనునవిన్ని గలసి 11 మాత్రము వాయు పదార్థములుగా నున్నవి.

మరియు టేబిల్‌లో 8 వాలన్సీలో ఉన్న ఐరన్ కోబాల్టు మొదలగు మూలద్రవ్యములు రెండు పద్ధతులలో దేనికిన్ని సంబంధించవు. వీటిని ట్రాన్సిషనల్ ఎలిమెంట్సు అని అందురు. ఇట్లే పదక వ్యాఖ్యను సంక్షేపముగా ముగించితిని.

మరియు పై జెప్పిన 92 ఎలిమెంట్లనుగూర్చి కొన్ని నియమములు ఆ నాడు బుట్టినవి. అవి యెవ్వియన—

(1) పరమాణువు అవిభాజ్యము.

(2) భిన్న భిన్న తత్వముల (రాగి, బంగారు, మొ॥ మూలద్రవ్యముల) పరమాణువులు ఆకారమానములో తప్ప తక్కిన గుణధర్మములలో భిన్న భిన్నములుగా నుండును.

(3) యే యొకతత్వ (మూలద్రవ్య = ఎలిమెంటు) పరమాణువులైనను అన్యోన్యము తుల్యముగా నుండును.

(4) యౌగికావస్థలో గూడ పరమాణువులు తమ స్వధర్మమును విడనాడవు; యౌగిక ద్రవ్యములను విడదీసినచో మరల ఆయా పరమాణువులు స్వస్వరూపముతో నుండుటచే తెలియుచున్నది.

(5) క్రీస్తుశకం 1801 – 1803 లో డాల్టన్‌గారు పరమాణువులు అవిభాజ్యములని దృఢపడుటచే వానికి పరివర్తనము (మార్పు) యున్నదనెడి కల్పనను అసంభవమనిరి. ఇత్యాదులు.

N. B:—ఇచట ఈపై 5 సూత్రములలో స్మరింపబడిన పరమాణుపదము మూలద్రవ్యముల పరమాణువులకే వాచకముగా గ్రహింపబడెనుగాని అట్టి మూల ద్రవ్యముల పరమాణువులకు కారణములగు ఎలక్ట్రాన్‌లు, ప్రోటానులు అనువానికి వాచకముగా గ్రహింపబడలేదు.

ఇట్లీతీరున సూత్రించిన సూత్రములన్నిటికి, అడవికి కారుచిచ్చువలె నాశకమగు ఎలక్ట్రాన్ థియరీ అనెడి యొక సిద్ధాంతమును, క్రీ. శ. 1897లో థామ్సన్ అనువాడు నెలకొల్పెను. పిదప మేడంక్యూరీ యను నామెయు నామె భర్తయగు బెకరల్ దొరగారును, క్రీ. శ. 1903లో రేడియం ధాతువును శోధనచేయుచుండగా దాని పరమాణువులు స్వయం విభక్తములై పరమాణుభాగము (ఆటమిక్ వెయిట్)లో స్వీయపరమాణుభాగముకంటె 4 సంఖ్య తక్కువగు పరమాణు భాగముగల వేరొక మూలతత్త్వ పరమాణువులుగా మారినవి. అందువలన రేడియం పరమాణువులు విభాజ్యములని తేటబడెను. దానంజేసి పరమాణు పరివర్తనము గూడ సిద్ధమైనది.

మరియు, పైనజెప్పిన తత్త్వావర్తనం విభాగపదక మందలి 92 మూలతత్త్వములలో ప్రతి మూలతత్త్వ పరమాణువు నందున్ను, ఆ మూలతత్త్వ క్రమసంఖ్యతో తుల్యమగు సంఖ్యగల ధనవిద్యుత్కణములు (ప్రోటానులు)న్ను వాని చుట్టూ తిరుగుచూ అదే సంఖ్యగల ఋణవిద్యుత్కణములు (ఎలక్ట్రానులు)న్ను, ముఖ్యముగా కలసియుండునని పదకవ్యాఖ్యలో చెప్పియుంటిమి. ఇవిగాక, న్యూట్రాన్, పాజిట్రాన్, డూప్లాన్, అనెడి కణములుగూడ యుండును. ఈ న్యూట్రాన్ మొ॥నవి ప్రోటాన్, ఎలక్ట్రానులమిశ్రమమే. అనగా న్యూట్రాన్ = ప్రోటాన్ + ఎలక్ట్రాన్, ఇది భారములో ప్రోటానుతో తుల్యముగా నుండును పాజిట్రాను అనునది భారములో ఎలక్ట్రానుతో తుల్యముగానుండును. గాని దానికి వ్యతిరేక విద్యుదావేశము గలిగియుండును. అనగా ఎలక్ట్రాను ఋణవిద్యుదావేశముగలది; పాజిట్రాను ధన విద్యుదావేశము గలది, ఇంతే ఈ రెంటికిన్ని భేదము. ఎలక్ట్రానుకంటె ప్రోటాను

అనగా అగ్నికి అధారముగా నుండుట యనెడి ధర్మముగల భూమికి తుల్యముగా నుండును. గాన దీనిని విద్యుదగ్ని మహాభూతములో భూభూత సూక్ష్మమనవచ్చును. ఇట్లు భూతసూక్ష్మ చతుష్టయ మనదగిన ప్రొటాను మొదలగు విద్యుత్కణ చతుష్టయము ప్రతి పరమాణు గర్భమునందును యుండును కావున పరమాణువులలో జాతిభేదము లేదని ప్రకృత పాశ్చాత్య మతము కాని మన పూర్వులలో తార్కికులు "నిత్యాః పరమాణురూపాః అనిత్యాః కార్యరూపాః" ఇత్యాది వచనములతో పృథివ్యప్తే జోవాయు భూతములయొక్క పరమాణువులు నిత్యములని ప్రతిపాదించిరి. ఇదిగాక తన్మ్యప్రత్యాత్మ నియతత్వా దనంతం పరమాణురూపం నిత్యంచ" అని మన స్తత్త్వమును పరమాణురూపముగా వర్ణించిరి. పృథివ్యప్తేజోవాయు మనాంసి మూర్తాని" అని అన్వాత్మమూర్త ద్రవ్యములు అయినవని చెప్పుటచే అణుజాతులు గూడ 5 విధములని తేటబడుచున్నది. అయితే ప్రకృత పాశ్చాత్య మతానుసారముగా ప్రతి పరమాణువునందు ప్రొటాను మొ॥ భూతసూక్ష్మ చతుష్టయ ముండుట తుల్యమైనను యేయణువునం దే భూతసూక్ష్మాంశ మధికముగా నుండునో దానినిబట్టి ఆ యణువునకా భూతనామమును మన పూర్వులు గల్పించిరని మన మీ మతద్వయమును సమీకరింపవచ్చును.

ఈ పై విషయములనుబట్టి మనకు ప్రతి మూలతత్త్వమునందును ముఖ్యముగా ధన, ఋణ విద్యుత్కణములుతప్ప అనగా జలాగ్ని భూతసూక్ష్మములుతప్ప వేరొక పదార్థము కానరాదు కావుననే "అపామగ్నేశ్చ సంయోగాద్ధేమరూప్యంచ నిర్బభౌ" (మనుస్మృతి. 5 అ 113 శ్లో) అని మనువు జెప్పెను. "అగ్నేశ్చ" అనుచోట నుండెడి చకారము అగ్నిభూత సూక్ష్మముకంటె భిన్నమైన ఇతర భూతసూక్ష్మములనుగూడ సముచ్చయము జేయుచున్నది. "హేమరూప్యంచ" అనుచోట నుండెడి చకారము వెండి బంగారములకంటె భిన్నమైన రాగి మొదలగు 90 మూలతత్త్వములనెడి ద్రవ్యములనున్ను ఇంకానున్న తెలియని మూలతత్త్వములనెడి ద్రవ్యములనున్న సముచ్చయము జేయుచున్నది. అనగా సర్వమూలతత్త్వములకు అబగ్నులే ముఖ్య కారణమని భావము. కావుననే జగత్తంతయు అగ్నీషోమాత్మక మగుచున్నది. ఈ విషయమును "ఆపోవరుణస్య పత్నయః" ఇత్యాది శ్రుతి (కృ. య. 5-5-4.) చెప్పుచున్నది.

అణుస్వరూపమును పై ప్రకారమిట్టిదని తెలుసుకొని దాని అంశలను అనగా ప్రొటాను మొ. అంశలను విడదీయు శక్తి మనకు గలిగినచో ఇష్టమువచ్చిన సంఖ్యలో వానిని తిరుగా కలిపి ఇష్టమువచ్చిన మూలతత్త్వమును మనము తయారు చేయగలుగుదుము. ఉ॥ రాగియనెడి మూలతత్త్వము 29, బంగారు 79, టిన్

(తగరము) 50 పాదరసము 80 అనెడి క్రమసంఖ్యలుగలవి. అందువలన వక రాగి పరమాణువునందలి 29 ప్రొటానులు 29 ఎలక్ట్రానులతో వక తగర పరమాణువు నందలి 50 ప్రొటానులతోను 50 ఎలక్ట్రానులతోను కలిపినచో 79 ప్రొటానులు 79 ఎలక్ట్రానులుగల వక బంగారు పరమాణువగును. లేదా వక పాదరస పరమాణువునందలి 80 ప్రొటానులలో వక ప్రొటానునున్ను 80 ఎలక్ట్రానులలో వక ఎలక్ట్రానునున్ను త్రోసివేసినను వక బంగారు పరమాణువగును.

అయితే ఇంత సులభముగా బంగారునుచేయ వీలున్నపుడు రాసాయనిక విద్వాంసులు యీ పనిని యేల చేయలేదని చదువరు లడుగవచ్చును. దానికి ప్రత్యుత్తర మేమనః- ప్రతి పరమాణువునకున్ను గర్భములో మధ్యభాగమున ప్రొటానులు గుంపుగానుండుననియు ఆ గుంపుచుట్టూ ఎలక్ట్రానులు దిరుగుచుండుననియు మన మిదివరలో నేర్చియుంటిమి. ఆ చుట్టూ తిరిగెడి ఎలక్ట్రానులు పదకములో జూపబడిన ఆరువర్గములయందలి జీరో వాలన్సీగల హీలియం, నియాన్, ఆర్గాన్, క్రిప్టాన్, సీనాన్, రాడాన్, అనెడి ఆరు వాయుపదార్థములకు సంబంధించిన పరమాణువులలో క్రమముగా 2. 10_18_36_54_86 సంఖ్యలు గలవిగా నుండును. వీనికి మధ్య క్రమముగా 8-8-18-18-32 అనెడి అంతర సంఖ్యలు గలవు. ఈ సంఖ్యలతో తుల్యమగు ఎలక్ట్రానుల గుంపు లైదిటికి కంచుకములు (లేయర్లు) అని పేరుగలదు. ఇదిగాక మొదటిదగు హీలియం పరమాణువుచుట్టూ తిరిగెడి ఎలక్ట్రానుల జతకుకూడ కంచుక సంజ్ఞగలదు. రాడాన్ తత్త్వము తరువాత మరి ఆరు తత్త్వములు మాత్రమే కనిపెట్టబడి ఇంకా 26 తత్త్వములు మిగిలి యుండుటచేతను ఆ యేడవ కంచుకము పూర్తికాలేదు. గాన నయ్యది అసంపూర్ణ కంచుక మనబడును, హైడ్రోజన్ పరమాణువులో వకే ఎలక్ట్రాను తిరుగుచుండుటచే నయ్యది కంచుక సంజ్ఞ నందలేదు. ఇందువలన పూర్ణకంచుకము లారు అసంపూర్ణ కంచుక మొకటి మొత్తము [1]సప్తకంచుకము లున్నట్లు తెలియుచున్నది వీనిలో మొదటి కంచుకము (అనగా హీలియం పరమాణువుచుట్టూ తిరుగుచున్న ఎలక్ట్రానుల కంచుకము) 2 సంఖ్యగలది: అనగా 2 ఎలక్ట్రానుల గుంపుగలదని భావము. దీనిపైని 8 ఎలక్ట్రానుల గుంపుగల వేరొక కంచుకము చేరినచో యీ రెండుకంచుకముల యందలి ఎలక్ట్రానుల మొత్తముసంఖ్య పదియగును. అపుడది నియాన్ పరమాణువగును. ఈ హీలియం, నియాన్‌లమధ్య యేడు మూలతత్త్వములు పుట్టుచున్నవి. అనగా హీలియం పరమాణువుయొక్క కంచుకమగు రెండుఎలక్ట్రానులపైని ఇంకొక

[1]పాదరస పరమాణువుపైని సప్తకంచుకము లున్నట్లు మన పూర్వులు రసతంత్రములలో చాటింపుచునే యుండిరి. ఆవిషయమును మరువరాదు.

ఎలక్ట్రాను చేరినచో లిథియం పరమాణువున్ను దానిపైని యింకొకటి చేరినచో బెలీరియం పరమాణువున్ను యిట్లే యొకొక్కటి ఎలక్ట్రాను చొప్పున చేరుచూ క్రమముగా బోరాన్, కార్బన్, నైట్రోజన్, ఆక్సిజన్, ఫ్లోరీన్ అనెడి పరమాణువులు తయారైనవి. గాని యింతవరకు రెండవ కంచుకము మాత్రము పూర్తికాలేదు. ఈ ఫ్లోరీన్ పరమాణువునకు ఇంకొక ఎలక్ట్రాను చేరినదంటిరా భళే! కంచుకము పూర్తి అయిన నియాన్ పరమాణువుగా మారిపోవును.

సంపూర్ణములగు కంచుకములు వజ్రతుల్యములై యభేద్యములుగానుండును. కంచుక పూర్తి యగునంతవరకుమాత్రము పైనున్న కంచుక భాగములను అపూర్ణకంచుకము లందురు. వీనియందు ఎలక్ట్రానుల సంఖ్య యెంతయుండునో నయ్యది ఆ యామూలతత్వములకు వాలన్సీ (అనగా సంయోజకత్వపరిమితి లేక బంధకత) అనబడును. ఉ॥ ఆక్సిజన్ అనునది క్రమసంఖ్యలో ఎనిమిదవ దగుటచే దీని అణువు పైజెప్పినరీతిని 8 ఎలక్ట్రానులు గలదిగా నుండును. ఇందులో 2 ఎలక్ట్రానులు మొదటి కంచుకమైనదిగాన అదిపోను మిగిలిన 6 ఎలక్ట్రానులున్ను రెండవ కంచుకభాగములుగా నున్నవి. గాన యీ 6 సంఖ్య ఆక్సిజన్‌కు వాలన్సీ అనబడును. ఇయ్యది రెండవకంచుక పూర్తికి మరి రెండు ఎలక్ట్రానుల నపేక్షించుచున్నది; గాన అట్టి రెండు ఎలక్ట్రానుల నిచ్చుటకు, ఒక ఎలక్ట్రాను పైకంచుక భాగంగాగల రెండు హైడ్రోజన్ పరమాణువులుగాని లేక అట్టి రెండు సోడియం పరమాణువులుగాని లేక అట్టి యేయితర (లిథియం మొ॥) తత్వముల పరమాణువులు గాని సమర్థములుగా నుండును. లేక రెండు ఎలక్ట్రానులు పైకంచుకభాగములుగా గల మెగ్నిషియం మొ॥ యే యితర తత్వపరమాణువులు అయినా సమర్థములైనవే. వానిని మనము గమనించి పైజూపిన ఆరు సంఖ్య వాలన్సీగల ఆక్సిజన్ పరమాణువుతో కలిపినచో ఆ రెండుతత్వములు కలసి కృత్రిమముగా కంచుకమును పూర్తి చేయును. ఇట్టికార్యము పాకమువలన గలుగును. పాకమనగా విజాతీయ తేజస్సంయోగము. అనగా అభిఘాత నోదన రూపతేజస్సంయోగములు రెంటిలో నొకటగు నోదనరూపసంయోగ మిచట కార్యకరమగును. దీనినే పిఠరపాకమందురు. పిఠరమనగా కొన్ని పీలువులగుంపు. పీలువు అనగా పరమాణువు (ప్రోటాన్.) పీలుపాకమనగా గుంపుగానున్న ప్రోటానులు అభిఘాత రూపమగు తేజస్సంయోగముచే విడబడి తిరిగి అభీష్టసంఖ్యగల గుంపుగా అనగా కార్యరూపముగా అనగా పిఠరరూపముగా తయారగుట. పిఠరపాకమనగా అట్టి కార్యరూపముగా (లేక పిఠరరూపముగా) తయారైనదానిపైని అసంపూర్ణకవచముగా నున్న ఎలక్ట్రానులకు ఆ కవచము పూర్తియగుటకు కావలసిన ఎలక్ట్రానుల నిచ్చెడి వేరొక

ద్రవ్యముతో ఆ పిఠరమును కలిపి కవచపూర్తిని కృత్రిమముగా జేయుట యనునది. ఇయ్యది సామాన్యోష్ణతను గలిగించెడి నోదన క్రియవలన జరుగును.

ఇట్లు కంచుకపూర్తికి జరిగెడి తాత్త్వికవ్యాపారమును సామాన్యరసాయన వ్యాపార మందురు. ఉ॥ పసపు + తడిసున్నము = పారాయణ; ఆక్సిజన్ + 2 హైడ్రోజన్ = జలము, ఇత్యాదులు. అయితే ఇట్టి సామాన్య రసాయన వ్యాపారమును మనము కనిపెట్టినతోడనే బంగారును చేయుట యనెడి మనయభీష్టము సిద్ధించినదనిసంతసింపరాదు. యేమన:— ఇచట ప్రోటానులను మనముస్మరింపకున్నను ఎలక్ట్రానుల సంఖ్యతో తుల్యసంఖ్యగల ప్రోటానులు మూలతత్త్వపు అణువునకు గర్భమున గుంపుగా నుండునను మాటను మాత్రము మరువరాదు. మనము తరచు చూచుచున్న యీ సామాన్య రసాయన వ్యాపారముతో పై జెప్పిన వాలన్నీప్రమాణము ననుసరించి యేరెండు మూలతత్త్వములను మనము కలిపినను ఆ రెంటిలో నుండెడి ప్రోటానులు ఆ తత్త్వములయొక్క ఎలక్ట్రానుల పూర్ణకంచుకములను భేదింపజాలకపోవుటచే పైనున్న ఎలక్ట్రానుల అసంపూర్ణ కంచుక (లేయరు) భాగములు మాత్రము అన్యోన్యము కలసి ఆక్సిజన్-హైడ్రోజన్ అణువులు కలసి జల అణువు అగునట్లు వేరొక విలక్షణజాతి గల మిశ్రద్రవ్య అణువుగా మారుచుండును. ఈ విషయమునే ప్రశస్తపాదుడు వైశేషికభాష్యమున "నచకార్యద్రవ్య ఏవ రూపాద్యుత్పత్తి ర్వినాశోవా సంభవతి, సర్వావయవేష్వంతర్బహిశ్చ వర్తమానస్య (ద్రవ్యస్య) అగ్నినా వ్యాప్త్యభావాత్; అణుప్రవేశాదపిచ వ్యాప్తిర్నసంభవతి కార్యద్రవ్య వినాశా దితి" (పాకజ ప్రకరణం. 47. పే.) అని ఇట్లు చెప్పెను. గాన సామాన్య రసాయన వ్యాపారము మిశ్ర ద్రవ్యరచన కుపయోగించునే గాని బంగారు - వెండి మొదలగు మూలతత్త్వ ద్రవ్య రచన కుపయోగింపదు; ఆ పనికి విశిష్టరసాయనవ్యాపారము కావలెను. అనగా పై ప్రకారము కలిపిన రెండు మూలతత్త్వములయందలి ప్రోటానుల నన్నిటిని విడదీసి యొక గుంపుగాజేసి ఆ తత్త్వము లందలి ఎలక్ట్రానులను ఆ ప్రోటానుల గుంపుచుట్టూ తిరుగునట్లు చేయు వ్యాపారము. ఈ వ్యాపారములో కంచుకభేద మావశ్యకముగా జరుగును. పైరీతిని అసంపూర్తి కంచుకములుగల ద్రవ్యములు పరస్పరము రసాయనసంయోగము నందినపుడు వేరు ద్రవ్యముగా భాసించినను, వానిని తిరిగి వియోగము నందించుట శక్యమైన పనియే యగుటచే అట్టి దశలో నవి తిరిగి పూర్వపు తత్త్వములుగా మారిపోవును. ఇట్లు మారుట అసంపూర్ణ కంచుకములుగలవానికి లక్షణము. సంపూర్ణ కంచుకములు గల హీలియం నియాన్ మొ॥ నవి ఇంత సులభముగా వేరితోనూ కలియ నేరవు. కారణమేమన:— వాని కంచుకములు పూర్తిగా నుండుటచే నవి పై వానివలెనే

సులభముగా భేదింపబడవు. అందుచే నయ్యవి వేనితోనూ కలియనేరవు. వానిని భేదింత మన్నచో అణుగర్భమందలి ప్రోటానులకున్ను వానిపైన తిరుగుచున్న ఎలక్ట్రానులకున్ను ఉన్నరసాయనానురాగమును నాశనము చేయవలెను. అట్లు నాశనము చేయుటకే అణుభేదన మందురు. ఇట్టిపని అభిఘాతరూపమ్మతేజస్సంయోగము వలన జరుగును. ఈ కృత్యములో అపారమగు ఉష్ణతబుట్టును. అనగా అంతటి అధికోష్ణత లేనిదే ఆ పిరరము భిన్నమై పీలువులు విడబడవన్నమాట. అట్లు విడిన పీలువులనుబట్టి మన యిష్టమువచ్చిన సంఖ్యతో వానిని కలిపి యిష్టమువచ్చిన మూలతత్వముగా జేయవచ్చును. ఇట్లు పీలువులయందు పాకమును బుట్టించుపనిని విశిష్టరసాయన వ్యాపారమందురు. ఇదియే పీలుపాకమనబడును. ఇట్లు ఎలక్ట్రాన్ థియరీ (అనగా అణూత్పత్తి) సంక్షేపముగా నిరూపింపబడినది

ఈ పై విషయములను బాగుగా నాలోచింప. "భిన్నములగు పంచభూతములు" అనుచోట సమానప్రత్యయారబ్ధ ద్రవ్యమందలి పంచభూతములు యెట్టి యణుసన్నివేశముగలవిగ నుండెనో దానికి భిన్నమగు యణుసన్నివేశ విశేషము గల పంచభూతముల భేదసిద్ధికై పృథక్ప్రమాణవిశిష్టత్వము గాని జాత్యంతర విశిష్టత్వముగాని ఆ యుభయద్రవ్యములయందలి పంచమహాభూతములయందు ఉన్నదని యనరాదు. ఏమన:— పంచభూతములయొక్క భిన్నభావముకొరకు పృథక్ ప్రమాణ విశిష్టత్వము నంగీకరించినచో నట్టి న్యూనాధిక ప్రమాణముగల భూతములవలనబుట్టెడి ద్రవ్యము "క్ష్మాంభోగ్ని క్ష్మాంబుతేజః" ఇత్యాది సామాన్య సూత్రానురుద్ధమై రసాద్యుత్పత్తి నిరూపణములో జెప్పిన రీతిని సూర్యాది గ్రహానుప్రవేశముచే రసవీర్యాదులలో మార్పునొందిన ద్రవ్యమువలె సమాన ప్రత్యయారబ్ధ ద్రవ్యాంతర మగునేగాని విచిత్ర ప్రత్యయారబ్ధ ద్రవ్యము కానేరదు. ఇక జాత్యంతర విశిష్టత్వపక్షము, యెచటను యేమహర్షులును భూజలాదిభూతములు వేరువేరుగా నున్నట్లు అనగా నీ భూభూతముకంటె ఆ భూభూతము భిన్నజాతి గలదనియు, యీ జలభూతముకంటె ఆ జలభూతము వేరుజాతిగల దనియు నీ రీతిగా నొప్పికొని యుండనందున నిస్సారమైనది గావున ద్రవ్యమందు సమాన విచిత్ర ప్రత్యయారబ్ధత్వములు అణుసన్నివేశ విశేషహేతుకము లని సిద్ధాంతితము.

ఇందుల పూర్వపక్ష నిరసనము

"ద్రవ్యారంభక భూతము లెవ్వియో అవియే రసాదులకుగూడ యారంభకము లైనచో నట్టి ద్రవ్యము సమానప్రత్యయారబ్ధము-తద్భిన్నము విచిత్ర ప్రత్యయారబ్ధము" అనిగదా యరుణదత్తుని యాశయము. అయితే రసాదులు గుణము

లగుటచే "గుణగుణినో స్సమవాయః" అను సూత్రానుసారముగా ద్రవ్యగుణములు నిత్యసంబంధము గలవిగా నుండవలెను. అత్తరి గుణములేని ద్రవ్యముగాని ద్రవ్యములేని గుణముగాని కానరాదు. అరుణదత్తుడు చెప్పిన చొప్పున ద్రవ్యమును బుట్టించు భూతములకంటె రసాదులనుబుట్టించు భూతములు వేరుగ నున్నయెడల ద్రవ్యజనకభూతములు నిర్గుణ ద్రవ్యములను రసాదిజనకభూతములు నిర్ద్రవ్యగుణములనుబుట్టించవలసియుండును; అయ్యది యసంభవము. అట్లుకాక ద్రవ్యజనకభూతముల వల్ల గుణములు, గుణజనక భూతములవల్ల ద్రవ్యములుగూడ బుట్టునందురా యట్టి రెండు ద్రవ్యములు గలసిన యా ద్రవ్యము సంకీర్ణ ద్రవ్యమనబడును గాని విచిత్ర ప్రత్యయారబ్ధ ద్రవ్య మనబడదు. సంకీర్ణ ద్రవ్యమునకు గుణములుగూడ సంకీర్ణములుగనె యుండును. ఎట్లన:- పాలు మిరియములు కలిపినచో మధుర కటురసములు రెండునుగల యా సంకరద్రవ్యమందలి పాలయొక్క శీతవీర్యము మిరియముల యుష్ణవీర్యములను నీ రెంటిలో నేది యెక్కువగా నుండునో నయ్యది "భూయ సాల్పంహి జీయతే" అను సూత్రప్రకారము రెండవదానిని జయించి బైటపడునుగాని విచిత్ర ప్రత్యయారబ్ధ ద్రవ్యమునకు జెప్పినట్లు మధురరసముగల ద్రవ్యమునకు ఉష్ణవీర్యము సిద్ధించదు. అందువలన అరుణదత్తుడు చెప్పిన లక్షణ మిట యెంతమాత్రమూ యుక్తిసహముకాదు. గాన యీపూర్వ పక్షము పైప్రకారము నిరస్తమైనది.

### సమాన — విచిత్ర ప్రత్యయారబ్ధ ద్రవ్యముల గుణకర్మ నిరూపణము.

అన:- పై జెప్పిన లక్షణము ద్రవ్యమందున్న గుణకర్మలయొక్క ఫలమును బట్టి యూహింపతగి యుండును. గాన యట్టిగుణ కర్మల నిట వివరించెద.

ఎట్లన:- కటురసముగల సున్నపురాతి భస్మ ఉష్ణవీర్యముగల దగుటచే సామాన్య నియమమున కనురుద్ధమై సమాన ప్రత్యయారబ్ధ మనబడుచున్నది. ముత్యము కటురసముగలదైనను శీతవీర్యము గలదగుటచే పైజెప్పిన సామాన్య నియమమునకు విరుద్ధమై యుండునుగాన విచిత్ర ప్రత్యయారబ్ధ ద్రవ్య మనబడుచున్నది. ఈ సున్నపురాయి ముత్యము లనెడి రెండు ద్రవ్యములలో పరమాణువు లొకేప్రమాణముగల పంచభూతములవల్ల బుట్టినవైనను వాటి ఆరంభక సంయోగములోని మార్పునుబట్టి అనగా సున్నపు రాతియందలి ఆరంభక సంయోగముకంటె ముత్యమునందలి ఆరంభక సంయోగము విచిత్రమైన విజాతీయ తేజస్సంయోగమువల్ల బుట్టినట్లు ముత్యమందలి శీతవీర్యాది గుణములచేతను, సున్నపురాతి భస్మము చేయలేని వీర్యవృద్ధిచేయుట యనెడి కర్మచేతను, యనుమానింపదగినది గాన ముత్యము విచిత్రప్రత్యయారబ్ధ ద్రవ్య మనబడుచున్నది.

ఈ విషయములో అరుణదత్తుడుకూడ "స్వాదు రసోపేతో గురుగుణ యుక్తశ్చ గోధూమో మధురరసోపదిష్టం యద్వాతజిత్త్వం కర్మ తత్కరోతి; సమాన ప్రత్యయారబ్ధత్వాత్। యద్వస్తు స్వాదురసోపేతో గురుగుణ యుక్తశ్చ మధుర రసోపదిష్టం యద్వాతజిత్త్వం కర్మ తన్నకరో త్యపితు వాతకృత్త్వ మేవకరోతి విచిత్ర ప్రత్యయారబ్ధత్వాత్॥ మత్స్యః స్వాదురసోపేతో గురుగుణో పేతశ్చన మధురరసో పదిష్ట శీతవీర్య, కింతర్హ్యుష్ణ వీర్యః, విచిత్ర ప్రత్యయారబ్ధ త్వాత్। క్షీరంచ స్వాదురసోపేతం గురుగుణయుక్తంచ మధుర రసోపదిష్ట శీతవీర్యం సమాన ప్రత్యయారబ్ధత్వాత్। స్వాదు రసయుక్తో గురుగుణయుక్తశ్చ సింహో నయధారసం మధురవిపాకః, కింతర్హి కటుకో విపాకే, విచిత్ర ప్రత్యయారబ్ధ త్వాత్। సూకరో మధురరసయుక్తో గురుగుణోపేతశ్చయధారసం మధురవిపాక ఏవ, సమానప్రత్యయారబ్ధత్వాత్।" (వా. సూ. 9 అ. 28 శ్లో. వ్యా.) ఇట్లు వ్రాసెను. అనగా గోధూమ-యవలు, క్షీర-మత్స్యములు, సూకర-సింహములు యనెడి ద్వంద్వ ములు మూడున్ను మధురరస-గురుగుణములు గలిగియుండుటలో తుల్యములైనను కర్మచేయుటలో యవలున్ను, వీర్య-విపాకము లనెడి గుణములు గలిగియుండుటలో మత్స్య-సింహములున్ను రసగుణములకు విరుద్ధముగా నుండుటచే విచిత్రప్రత్యయా రబ్ధము లనబడుచున్నవని తాత్పర్యము. గనుక రస - గుణ - వీర్య - విపాకములు యే ద్రవ్యమందు సామాన్యశాస్త్రము ననుసరించి నియతముగా నుండునో అట్టి ద్రవ్యము సమాన ప్రత్యయారబ్ధ మనబడు నని గ్రహించవలెను. ఇచట నియత మనగా రసము మధురముగా నుండునపుడు విపాకము మధురముగను, వీర్యము శీతముగనుయుండి గురుగుణము గలిగియుండుట; అట్లే రస - విపాకములు రెండును పుల్లగాగాని, కారముగాగాని యుండినపుడు ఉష్ణవీర్యము గలిగి లఘుగుణము గలిగి యుండుట. ఇట్టి ద్రవ్యములకు రసము తెలిసినచో గుణకర్మలు చెప్పవచ్చును. ఏ ద్రవ్యమందు పై నియమములకు వీర్యవిపాకములు వ్యతిరేకముగా నుండునో అట్టివి విచిత్ర ప్రత్యయారబ్ధము లని గ్రహించవలెను. అయ్యవి కంఠోక్తిగా జెప్ప బడును. సమాన ప్రత్యయారబ్ధ ద్రవ్యములకు ఉ॥ పాలు - నెయ్యి - చవ్యము- చిత్రమూలము మొ॥ ఉక్తంచః- శీతం వీర్యేణ యద్ద్రవ్యం మధురం రసపాకయోః తయోరమ్లం యదుష్ణంచ యద్ద్రవ్యం కటుకంతయోః తేషాంరసోపదేశేన నిర్దేశ్యో గుణసంగ్రహః। వీర్యతో విపరీతానాం పాకతశ్చోపదేక్ష్యతే। యథాపయో యథా సర్పిర్యథావా చవ్యచిత్రకౌ। ఏవమాదీని చాన్యాని నిర్దేశే ద్రసతో భిషక్॥ (చ. సూ. 26 అ. 50 శ్లో) విచిత్రప్రత్యయారబ్ధ ద్రవ్యములకు ఉ॥ మధురం కించి దుష్ణంస్యా త్కషాయం తిక్తమేవచ। యథా మహత్పంచమూలం యథాబ్జా నూపమామిషం। లవణం సైంధవం నోష్ణమమ్లమామలకం తథా। అర్కా గురు గుడూచీనాం తిక్తానా ముష్ణముచ్యతే। కించిదమ్లంహిసంగ్రాహి కించిదమ్లంభినత్తిచ।

యథాకపిత్థం సంగ్రాహీ భేదిచామలకం తథా। పిప్పలీ నాగరం వృష్యం కటుచావృష్యముచ్యతే। కషాయః స్తంభనశ్శీతస్సో భయాయామతోన్యథా। తస్మాద్రసోప దేశేన నసర్వంద్రవ్యమాదిశేత్॥ (చ.సూ. 26. అ.53శ్లో॥) అనగా మధుర, కషాయ, తిక్తరసములుగల ద్రవ్యములు శీతవీర్యముగలవిగా నుండవలెను. ఆ నియమమునకు విరుద్ధముగా కొన్ని ఉష్ణవీర్యముగలవిగానున్నవి. ఉ॥అనూపమాంసము మధురముగా నుండి వేడిజేయును. అట్లే మహాత్పంచ మూలములు వగరు, చేదు రుచులుగలవై వేడిజేయును. లవణ అమ్లరసములు వేడిచేయవలెను. అందుకు విరుద్ధముగా లవణ రసముగల సైంధవము వేడిచేయదు, ఆమ్లరసముగల ఉశిరిక చలవచేయును. చేదు రుచిగల జిల్లేడు, అగరు, తిప్పతీగ, చలవచేయుటకు మారుగా వేడిచేయును. కొన్ని పులుపువస్తువులు భేదనముగానుండి విరేచనము చేయుటకు మారుగా మలబద్ధను జేయును. ఉ॥ పుల్లని వెలగపండు మలబద్ధమును జేయును; ఉశిరిక అట్లుగాక విరేచనము జేయును. కారపు వస్తువులు వీర్యనాశనము జేయుట ధర్మము; సొంఠి, పిప్పలి, అనునవి కారముగా నుండియు వీర్యవృద్ధిని జేయును. వగరు వస్తువులు మలబద్ధముజేసి చలవజేయుట ధర్మము, కరక్కాయ వగరుగా నున్ననూ విరేచనముజేసి వేడిజేయును. గాన రసము దెలసిన మాత్రమున వస్తువులకు గుణధర్మములను జెప్పరాదని భావము. ఇట్లు చరకుడు సమాన - విచిత్ర ప్రత్యయారబ్ధ ద్రవ్యములకు ఉదాహరణ పూర్వకముగా లక్షణములను జెప్పియున్నాడు. ఇదియే సమాన - విచిత్ర ప్రత్యయారబ్ధ ద్రవ్యముల గుణకర్మ నిరూపణము.

### సమాన - విచిత్ర ప్రత్యయారబ్ధ శబ్దవ్యుత్పత్తి నిరూపణము.

సమాన ప్రత్యయారబ్ధము అను పదములో సమాన - ప్రత్యయ - ఆరబ్ధ అని మూడు పదములుగలవు. అందు సమాన అనగా ద్రవ్యము. దానియందుండెడి గుణములు - యీ రెంటికిని సాజాత్యము గలిగియుండుట. ఉ॥ ఆగ్నేయమగు సున్నమునకు ఆగ్నేయమగు ఉష్ణవీర్యము గలిగియుండుట. అట్టి సాజాత్యమునకు ప్రత్యయమనగా కారణము (ఆరంభక సంయోగ రూపకారణము). అట్టి కారణముచే ఆరబ్ధమైన అనగా సృష్టింపబడిన ద్రవ్యము.

విచిత్ర ప్రత్యయారబ్ధమనగా విచిత్రమైన అనగా పైజెప్పిన సాజాత్యములేని ద్రవ్య-గుణములకు (ఉ॥ ఆగ్నేయమగు ముత్యము - దాని శీతవీర్యములకు) కారణమగు ఆరంభక సంయోగముచే సృజింపబడిన ద్రవ్యము. ఆరంభక సంయోగమనునది పైజెప్పిన ద్వివిధ ద్రవ్యములలో వేరువేరుగా నుండుటకు కారణము దిగ్భేదమే. ఈ దిగ్భేదమునుగూర్చి ఉత్తరార్ధములో వివరించెద.

## రసాది స్వరూప నిరూపణము

“రసో నిపాతే ద్రవ్యాణాం విపాకః కర్మనిష్ఠయా। వీర్యం యావదధీవాసా న్నిపాతాచ్చోపలభ్యతే” (చ. సూ. 26 అ. 68 శ్లో) అనెడి వచనమునుబట్టి రసమనగా జిహ్వాయందు ద్రవ్యము పడినతోడనే తెలిసెడి రుచి. ఇది మధుర (తీపి) అమ్ల (పులుపు) లవణ (ఉప్పు) తిక్త (చేదు) కటు (కారము) కషాయ (వగరు) అని 6 విధములు. వీని విశేషవర్ణన రసాద్యుత్పత్తి నిరూపణలో జేయబడెను, చూడుడు.

విపాకమనగా తినిన ద్రవ్యము జీర్ణమగుట యనెడి కర్మ సమాప్తియగు సమయమున బుట్టెడి కఫ, శుక్రాభివృద్ధి మొదలగు కృత్యములను జేయుట లక్షణముగాగల రస విశేషము. ఇది మధుర, అమ్ల, కటు అని 3 విధములు. ఇయ్యవి ద్రవ్యమునుబట్టి నియతముగా నుండును. ఇవిగాక చరక చికిత్సాస్థాన గ్రహణ్యధ్యాయములో ఆహారావస్థాపాకములు మరి 3 చెప్పబడినవి. అయ్యవి వీనికంటె భిన్నములైనవి

వీర్యమనగా:- పారిభాషికము, శక్తి - అని రెండు విధములు. అందు పారిభాషికమనగా:- ద్రవ్యము జిహ్వాయందుగాని దేహముయొక్క ఇతరభాగమందుగాని పడినవెనుక పూర్తిగా జీర్ణమగుటకుపూర్వమందు (అనగా తినిన ద్రవ్యము ఎలిమెంటరీ కెనాల్ యొక్క పొరాసిటీనుండి గాని, బైటవేసిన ద్రవ్యము రోమకూపముల ద్వారాగాని రసధాతువులో కలసిపోవుటకు పూర్వమందు) శరీరముతో కలిసియుండుట (అనగా ఎలిమెంటరీ కెనాలులో నుండుట లేక శరీరంపై భాగమున యుండుట, లేక ఇన్‌జక్షన్ యిచ్చిన ద్రవ్యమైనచో రక్తములో లీనమగు వరకు శరీరాంశమగు రక్తములో నుండుట) అధివాస మనబడును; ఇట్టి అధివాసము వల్లగాని లేక నిపాతమువల్లగాని (అనగా శరీరముతో ద్రవ్యము కలసినతోడనేగాని) ద్రవ్యముయొక్క మృదు, తీక్ష్ణ గురు, లఘు, స్నిగ్ధ, రూక్ష, ఉష్ణ, శీత, అనెడి 8 గుణములు తెలియును. ఈ 8 కి పారిభాషిక వీర్యములని పేరు. వీటినే సంకోచపరచి వాగ్భటుడు వీర్యమును శీత, ఉష్ణ, భేదములచే రెండువిధము లని జెప్పినాడు. ఉదాహరణములు:- అధివాసమువల్ల వీర్యజ్ఞానోదాహరణము:- అనూపమాంసాదులవల్ల గల్గిన ఉష్ణత్వము; నిపాతమువల్ల వీర్యజ్ఞానోదాహరణము:- మిరియములు మొ॥ వాటి తీక్ష్ణత్వాదులు (ఘాటు మొ॥ నవి); నిపాతాధివాసములవల్ల వీర్యజ్ఞానోదాహరణము:- మిరియములు మొదలగు దీపనీయ ద్రవ్యము మొ॥ వాటివలననే గల్గెడి తీక్ష్ణత్వ, ఉష్ణత్వాదులు.

ఇంతవరకు వ్రాసినదానినిబట్టి రసము ప్రత్యక్షమనియు, విపాకము యెప్పటికైనను పరోక్షమే గాన కార్యమునుబట్టి యూహింపతగినదనియు, వీర్యమనునది,

అనగా పారిభాషిక వీర్య మనునది కొన్ని ద్రవ్యములయం దనుమానముచేతను, కొన్నిటియందు ప్రత్యక్షముచేతను (అనగా సైంధవలవణమున శైత్యము, అనూప మాంసమున ఉష్ణత్వము అనునవి అనుమానగ్రాహ్యములుగాన అట్టివాటియం దనుమానముచేతను) ఆవాలయందలి ఘాటును (ఘ్రాణేంద్రియములతోను, పిచ్ఛిల (జిగటు) విశద (జిగట లేకుండుట) స్నిగ్ధరూక్షాదులను నేత్రేంద్రియ-స్పర్శేంద్రియ ములతోను గ్రహించుట మొదలైనవి ప్రత్యక్షములు గాన యట్టివాటియందు ప్రత్యక్షముచేతను, గ్రహింపతగినదనియు తెలియుచున్నది. ఉక్తంచ:- నిపాత ఇతి రసనాయోగే। కర్మనిష్ఠయేతి కర్మణో నిష్ఠా నిష్పత్తిః కర్మనిష్ఠాక్రియాపరిసమాప్తిః రసోపయోగేసతియోఽంత్యాహార పరిణామకృతః కర్మవిశేషః కఫ శుక్రాభివృద్ధ్యాదిలక్షణః తేన విపాకో నిశ్చయతే। అధివాసః సహావస్థానం, యావదధివాసాదితి యావచ్ఛరీర నివాసాత్, ఏతచ్చపాకాత్పూర్వం నిపాతాచ్చోర్ధ్వం జ్ఞేయం। (నిపాతాచ్చేతి శరీర సంయోగ మాత్రాత్।.........ఏతేనరసః ప్రత్యక్షేణైవ, విపాకస్తు నిత్యపరోక్షత్వాత్కార్యేణానుమీయతే, వీర్యంతు కించిదనుమానేన, యథాసైంధవగతం శైత్యం అనూపమాంసగతంవా ఔష్ణ్యం కించిచ్చవీర్యం ప్రత్యక్షేణైవ యథా, రాజికాగతం తైక్ష్ణ్యం ఘ్రాణేనపిచ్ఛిల విశద స్నిగ్ధరూక్షాదయః చక్షుస్స్పర్శనాభ్యాం నిశ్చయంతె ఇతివాక్యార్థః। ఏతచ్చవీర్యం సహజం కృత్రిమంచజ్ఞేయం (సహజమనగా మిరియముల యందలి ఘాటు మొదలగునవి; కృత్రిమం అనగా తడిసున్నము నవాసారము కలిపినపుడు బుట్టెడిఘాటు మొ॥ నవి) ఏతచ్చ వీర్యలక్షణం పారిభాషికమేవ (చ.సూ.26 అ.68శ్లో.వ్యా) ఈపారిభాషికవీర్యమునుగూర్చి రెండుమతములుఅనగా 8 వీర్యములని యొక మతము రెండు వీర్యము లని, ఇంకొక మతము యున్నట్లు చరకుడు "మృదుతీక్ష్ణ గురులఘు స్నిగ్ధ రూక్షోష్ణ శీతలం। వీర్య మష్టవిధం కేచిత్ కేచి ద్ద్వివిధమాసితాః। శీతోష్ణమితి" (చ.సూ.26అ.66శ్లో) అని చెప్పియున్నాడు. ఇదిగాక శక్తివీర్యమును గూర్చి గూడ "వీర్యంతు; క్రియతే యేనయాక్రియా। నావీర్యం కురుతే కించిత్ సర్వావీర్య కృతాక్రియా" (చ.సూ.26 అ 67శ్లో.) శక్తిపర్యాయస్య వీర్యస్య లక్షణమాహ వీర్యం త్విత్యాది। వీర్యమితిశక్తిః। యేనేతి రసేనవా విపాకేనవా ప్రభావేణవా గుర్వాదిపరత్వాదిభిర్వాగుణైః యాక్రియా తర్పణహ్లాదన శమనాది రూపాకృత్స్నా క్రియత ఇత్యుపదిశ్యతే। తస్యాం క్రియాయాం తద్రసాదివీర్యం; అతఏవోక్తం సుశ్రుతే "యేన కుర్వంతి తద్వీర్యం" ఇతి (చ. సూ. 26 అ. 67 వ్యా) అనగా ద్రవ్యము తర్పణ - హ్లాదన -శమనాదికృతములను జేయుటలో వేటిని ఉపకరణముగా జేసుకొనునో అట్టి రస-గుణ-విపాక-ప్రభావము లనునవి అన్నియుగాని కొన్నిగాని ఆ చేయబడిన తర్పణాది కృత్యములయందు వీర్యము లనబడును. ఇదియే శక్తి వీర్యము (అనగా శక్తిరూపవీర్యము) అనబడును అని భావము; ఇదియే రసాది స్వరూప నిరూపణము.

## రసవీర్యాదుల వైలక్షణ్యనిరూపణము

పూర్వమున రసాద్యుత్పత్తి ప్రకరణములో జెప్పిన తీరున గ్రహాదుల యను ప్రవేశమువలన ద్రవ్యమందు గల్గెడి యుష్ణతాదుల తరతను భేదము, రసమందు నేతీరున యుండునో తజ్జన్యభూత విశేషకారణమునుబట్టి దానికి వ్యత్యాసముగా వీర్యమునందు విపాకమునందు గూడ కనుపించవచ్చును. దీనినే రసవీర్యాదుల వైలక్షణ్య మందుము. యెట్లన:- లవణరసము బుట్టెడి శరదృతువునందుకంటె అమ్లరసము బుట్టెడి వర్షఋతువునందును, దానికంటె కటురసము బుట్టెడి గ్రీష్మము నందును సూర్యగతి ననుసరించి ఆగ్నేయాంశము వాస్తవమునకధికముగా నుండును, గనుకనే యీ కట్వామ్ల లవణములు యథాపూర్వముగా రసమునందు తీక్ష్ణాధిక్యత గలవిగా నున్నవి. అట్లైనను వీర్యమందు దీనికి వ్యత్యాసము గల్గును. అనగా యథోత్తరముగా ఉష్ణాధిక్యత గలవిగా నుండుననని భావము. యేమన:- రసమనునది "రసోనిపాతె ద్రవ్యస్య" అని చెప్పుటచే జిహ్వాకు తాకిన మాత్రమున తెలియును గాన తాత్కాలికముగను; వీర్యమను నది "వీర్యం యావదధీవాసాత్" అని చెప్పుటచే జీర్ణదశలోగూడ నిలచును గాన దైర్ఘ్యకాలికముగను యగుచున్నది. ఇందులకు ద్రవ్యకారణమగు వాతాదులయందలి స్థైర్యసంఘాతాదుల తారతమ్యమే కారణము. అనగా వాత – జల – భూములయందు యథోత్తరముగా సంఘాతాదులధికముగా యుండుటయే కారణమని తాత్పర్యము. ఇందువలన యెక్కువ సంఘాతాదులు గల ద్రవ్యము తనయందు ఉష్ణతనుగాని శీతమునుగాని యెక్కువకాలము నిలుపగలుగునని తెలియుచున్నది. దీనికి దృష్టాంతము:- యొకే ఆకారమానముగల గాలి – నీరు – ఇనుము అనువాటికి యుష్ణతను యథాక్రమముగా 3, 2, 1 భాగముల పరిమాణములో సంక్రమింపజేసి (జొప్పించి) వెంటనే వాటిని తాకినచో యథా పూర్వముగా నయ్యవియుష్ణాధిక్యత గలవిగా నుండును; గాని కొంతకాలమైన పిదప అనగా కాలవశమున కొంత జీర్ణత నందిన పిదప తాకినచో యథోత్తరముగా యుష్ణాధిక్యత కలవిగా నుండును. గావున రసమున యథాపూర్వముగా తీక్ష్ణాధిక్యత గల కట్వామ్ల లవణములు వీర్యమున (అనగా కొంత జీర్ణతనందినపిదప) యథోత్తరముగా నుష్ణాధిక్యత కలవని జెప్పిన "రసాః కట్వమ్ల లవణాః వీర్యే ణోష్ణా యథోత్తరం" అనెడి వచనము యుక్తి సహముగానున్నది.

అయితే యీ యుక్తి సుశ్రుతమతమునకు అనగా జలమువల్ల, అమ్లము భూమి వల్ల లవణము బుట్టుననెడి మతమునకు సరిపోవునుగాని దానికి వ్యత్యాసముగానున్న చరకమతమున కెట్లు సరిపోవునను సంశయము గలుగవచ్చును. దానికి సమాధానం బేమన:- రసాద్యుత్పత్తి ప్రకరణములో జెప్పిన వీర్యకారణములగు అగ్ని –

సోమములు రెంటిలో ఇతరములగు ఆకాశ - వాత - భూములను గలిపి అనగా అగ్నిగుణములకు సన్నిహితములైన అసంచయ లఘు చలాది గుణములుగల వాతమును వివిక్తతాదిగుణములుగల ఆకాశమును అగ్నియందును, జలగుణములకు సన్నిహితములైన స్థిర, గురు, సంచయాది గుణములుగల భూమిని జలమందును, గలిపి జగత్తునంతను "అగ్నిషోమౌమహాబలౌ" అనెడి వచనానుసారము అగ్ని సోమములు మిక్కిలి బలిష్ఠములైన భూతములగుటచే, తద్రూపముగా అనగా రెండుగా విభజించిరి. అందువలన భూమి సౌమ్యమగు చున్నది. అట్లు భూమి సౌమ్యమగుట, లవణరసము బుట్టెడి శరత్కాలము ఉపచీయమాన సోమధాతువు గలదిగా నుండుట లవణములో జలధర్మమగు అభిష్యందిగుణ ముండుట యీ కారణములనుబట్టి లవణ మగ్నిషోమజ మని చరకుడు నిర్వచించెను: గాన లవణమందలి అభిష్యందిగుణమునుబట్టి అది జలజమని చరకుడును, ఉష్ణ గ్రాహకతను బట్టి భూమిజ మని సుశ్రుతుడును వచించిరనియు, భూమి ఉష్ణగ్రాహకమైనను సౌమ్యమగుటచే చరకమతము సుశ్రుతమతముతో విరోధించదనియు, మనము గ్రహించవలెను. ఈ విషయమునే శివదాసుడు "సోమశబ్దేన పృథ్వీజలయో రేవ గ్రహణం, ఉభయో రేవ సౌమ్యత్వాత్, అతఏవ సుశ్రుతేపి......పృథివ్యగ్ని గుణబాహుళ్యాల్లవణః, తోయాగ్ని గుణబాహుళ్యాదమ్లః ఇతి యదుక్తం తదపి న విరుధ్యతే, భూమిజలయో స్సామ్యత్వే నైకరూపతయా కార్య విరోధాభావాత్" (చ. సూ. 26 వ్యా.) అని చెప్పియున్నాడు. గాన పై సంశయ మంతరింపగలదు.

మరియు ద్రవ్యమందు వీర్య కారణమై యనుప్రవిష్టమగు సూర్యాంశము శిశిరాది ఋతుత్రయమునందు అనగా ఉత్తరాయణమందు క్రమముగా తరతమ భేదముతో పెరుగుచుండును; దక్షిణాయనమున తగ్గుచుండును. గాన శిశిరాది ఋతుత్రయములో బుట్టెడి తిక్త, కషాయకటువులు క్రమముగా ఉష్ణ, ఉష్ణతర, ఉష్ణతమ వీర్యములుగలవి కావలయును. అట్లుగాక శీత శీతతర, ఉష్ణవీర్యములుగల వగుచున్నవి. కారణ మేమన:—

తిక్తమునకు అనుష్ణాశీత, రూక్షధర్మములుగల (అనగా రూక్షశీతముగల) వాత మొక్కటియే కారణమగుటచే వీర్యమందలి శీతము తగతమ వర్గముల నొందక నిలచి యుండెను. వీర్యకారణమగు సూర్యాంశముగూడ వృద్ధి ప్రారంభదశలో నున్నది. అందుచే నది (తిక్తము) శీతవీర్యము గలదాయెను. కషాయమునకు అనుష్ణాశీతధర్మములుగల పృథ్వీవాతములు రెండును కారణములైనవి. ఇందలి పృథ్వీభాగము తనయందు ప్రవిష్టమగు సూర్యాంశ జోష్ణతను నిలుపుకొనెడి ధర్మము గలదైనను రూక్షగుణముగల వాతముయొక్క సంసర్గ గలదగుటచే

నుష్ణతను గోల్పోయి చలిగాలిలో బెట్టిన ఇనుపగుండువలె హెచ్చు శీతలముగల దయ్యోగాన కషాయము శీతతర వీర్యము గలదాయెను. కటురసమునుగూర్చి యీ వరకే చెప్పితిమి. ఇట్లీగసములు వీర్యమందు .కమ.పవృద్ధ సూర్యాంశ జోష్ణతవలన ఉష్ణ, ఉష్ణతర, ఉష్ణతమములు కావలసియున్నను స్వస్వజనక భూతసిష్ఠ గుణవిశేషము లచే శీత, శీతతర, ఉష్ణవీర్యములు గలవయ్యె. అయినను అనగా తిక్త కషాయ కారణములగు వాత, వాతభూములు వీర్యదశలో శీత, శీతతరకారణములైనను విపాకదశలో జాఠరాగ్న్యను ప్రవేశముచే కటురసమందలి వాతమువలెనే ఆగ్నేయ మగు కటువిపాకకారణములగుచు ద్రవ్యమును "తిక్తోషణ కషాయాణాం విపాకః ప్రాయశః కటుః" అనెడి సూత్రమునకు పాత్రమునుగా జేయుచున్నవి. కషాయ ద్రమందలి భూమ్యంశము బలమైన దైనచో కటువిపాకము జెడును గాన "పాయశః" అనెడి పదము ప్రయోగింపబడెను.

మరియు లవణము విపాకములో మాధుర్యము నందును గాన యట్టి మాధు ర్యము జలమునకు స్వాభావ స్థమగుటచే సుశ్రుతోక్తమగు లవణకారణ భూభూతము బలహీనమైనదనియు చరకోక్తజలభూతము బలిష్ఠమైనదనియు గ్రహించి వాగ్భటుడు "అగ్నిసౌమ్యాంబుతేజః" అని యిట్లు అమ్ల - లవణజనకభూతములను నిర్వచించెను. మిగిలిన రసములుకూడ పై ప్రకారమే విమర్శనీయములు. ఇట్లు దిఙ్మాత్రము రసవీర్యాదుల వైలక్షణ్యమును నిరూపించితిమి.

అవః- ఇంతదనుక అస్వాభావిక రోగములగు జ్వరాదులను హరించెడి ద్రవ్య ములు - తన్నిష్ఠరసాదులు అనువానిని ప్రశంసించితిమి. ఈ సందర్భమున స్వాభావిక రోగములగు జరాదులను హరించెడి రసాయన ద్రవ్యముల ప్రశంసగూడ దిఙ్మాత్ర ముగానైన జేయుట యుక్తమని తోచి ప్రశంసించు చుంటిమి.

## రసాయన లక్షణ సంగతి

రసాయన ద్రవ్యములకు లక్షణమును జెప్పుటలో "రసాయనంచ తద్జ్ఞేయం యజ్జరా వ్యాధినాశనం। యథామృతా రుదంతీచ గుగ్గులుశ్చ హరీతకీ" అనుచోట "జరావ్యాధి నాశనం" అని విశేషణము నిచ్చి యున్నాడు. ఇచట జరాంచ వ్యాధించ నాశ యతీతి అని ద్వంద్వసమాసమా? లేక జరా మితి స్వాభావిక వ్యాధింనాశయతీతి రూపకమా? అని సంశయము. సిద్ధాంతముః- జరయనెడి స్వాభావిక వ్యాధిని హరించునది రసాయన మని సిద్ధమగును గాన రూపకమే యగును. పూర్వపక్షముః- "రసాయనోక్తానాంచ జ్వరాదిహరత్వ మత్ర సువ్యక్త మేవ" (చ. చి.। అ। పా 6 శ్లో. వ్యా.) అనెడి చక్రపాణి వచనమును బట్టిన్నీ "ఉభయం హ్యుభయార్థకృత్" (చ చి। అ।పా.) అనెడి మూలవచనమును

బట్టియున్ను జరను - వ్యాధిని గూడ బోగొట్టునది రసాయన మని అర్థము చెప్పుట యుక్తమని పూర్వపక్షము.

సమాధానము:- ఋషి, భేషజమును విభాగము జేయునపుడు స్వస్థునకు ఊర్జస్కరమగునది యొకటియు, రోగికి రోగమును హరించునది వేరొకటియు అని స్వస్థ - రోగుల భేదముచే భేషజమును రెండుగా విభజించినాడు. (స్వస్థు డనగా ధాతుసామ్యము గలవాడుగదా! రోగి యనగా ధాతువైషమ్యము గలవాడుగదా!) స్వస్థునకు ఊర్జస్కరము అనుచోట చక్రపాణి "స్వస్థత్వేన వ్యవహ్రియమాణ స్యపుంసో జరాది స్వాభావిక వ్యాధిహరత్వేన, తథా అప్రహర్ష వ్యవాయక్షయిత్వా ద్యనుచిత శుక్రత్వాద్య ప్రశస్త శారీర భావహరత్వేన, "ఊర్జం" ప్రశస్తం భావమాదధాతీతి స్వస్థస్యోర్జస్కరం" అని వ్యాఖ్యజేసినాడు. ఇందు సమదోష స్సమాగ్ని శ్చేత్యాది వచనముచే దోషధాత్వాదులు సమముగా నుండుటయే లక్షణముగాగల స్వస్థునకు భేషజము నుపయోగించుట యెందుకని సంశయము గలుగుచుండ యట్టి సంశయమును బోగొట్టుటకై చికిత్సా శాస్త్రముచే పై జెప్పిన రీతిని స్వస్థు డని వ్యవహరింప బడుచున్న అనగా వాస్తవముచే స్వస్థుడుగానట్టి అనగా సమముగానుండు ధాతువులు దీపార్చి ర్న్యాయముచే ననుక్షణము నాశనమునందు చున్నందున ధాతుక్షయముగల్గి స్వాస్థ్యము జెడు చుండునుగాన ఆ ప్రకారము స్వస్థుడుగానట్టి అనెడి అర్థమువచ్చునట్లు "స్వస్థత్వే నవ్య వహ్రియమాణస్య పుంసః" అని వచించినాడు. అయితే యిట్టి పురుషున కుండు వాస్తవరోగ మెద్దియని సంశయము గలుగగా దాని నివారించుటకై స్వాభావికములగు జర (అనగా పై రీతిని దీపార్చిర్న్యాయముచే ననుక్షణము నాశనమందుచున్న ధాతువులు లక్షణంగాగల జరయనునది) మొదలుగాగల రోగములుగలవు అనెడి యర్థమును బొడసూపెడి "జరాది స్వాభావిక వ్యాధి హరత్వేన" అనువచనమును నుడివెను. ఈయూర్జస్కర భేషజమును ఉత్తరశ్లోక ములో ఋషి "స్వస్థస్యోర్జస్కరంయత్తు తద్వృష్యం తద్రసాయనం. ప్రాయః" అని వృష్యరసాయన భేదముచే రెండుగా విభజించెను. అందుచే చక్రపాణి ఊర్జస్కర భేషజమందున్న రెండంశములలో నొకటగు రసాయనత్వాంశమును పై రీతిగా నిర్వచించి వృష్యత్వాంశమునుగూడ యిచటనే "తథా అప్రహర్ష వ్యవాయక్షయిత్వానుపచిత శుక్రత్వాద్య ప్రశస్త శారీరభావ హరత్వేన" అనెడి వచనముచే నిర్వచించినాడు.

మరియు "ఆర్తస్యరోగనుత్" అనెడి పదమునకు "జ్వరాదినా ఆర్తస్య జ్వరాదిహరం" అని వ్యాఖ్యజేసి "రోగనుత్" అని చెప్పుటచేతనే స్వస్థునకుగాక

ఆర్తునకే రోగముండునుగాన అర్థాపత్తిచే "ఆర్తస్య" అని సిద్ధమగుచుండగా కంఠోక్తిగా జెప్పుట కేమిప్రయోజనమని శంకించి "సహజ జరాకృతాం పీడామను ద్వేజికాం పరిత్యజ్య జ్వరాదినా అస్వాభావికేన రోగేణ పీడితస్య" అని పై కంఠోక్తికి సార్థక్యమును జెప్పినాడు. మరియు, భేషజపదమునకు "ఏతచ్చ పర్యాయాభిధానం ప్రాధాన్యేన చతుష్పాదస్యైవ భేషజస్య, యదుక్తం:- చతుష్పాదం షోడశకలం భేషజమితి భిషజో భాషంతే" అని వ్యాఖ్య జేసియున్నాడు. అందుచే భేషజమనగా రోగమును హరించు ద్రవ్యమని నిరుక్తి బుట్టుచున్నది. "అగ్నిర్హిమస్య భేషజం" "యద్వైకించమను రవదత్తద్భేషజం" ఇత్యాది స్థలములలోఁగూడ యీ యర్థమునే స్మరించిరి. అట్టి రోగ హారత్వలక్షణముగల భేషజమును ఋషి "భేషజం ద్వివిధంచ తత్" అని రెండుగా విభజించి ఆ భేదములనే "స్వస్థస్యోర్జస్కరం" ఇత్యాది గ్రంథముచే వివరించెను.

అందుచేత రోగహారత్వలక్షముగల భేషజమందలి యొక భాగమగు ఊర్జస్కర భేషజము, స్వస్థునియుద్దేశించి చెప్పినందున స్వస్థునకు రోగమెక్కడిది? రోగము గలవాఁడు స్వస్థుడెట్లగును? అనెడి శంక గలుగుచుండగా దాని నివారించుటకే స్వస్థునకుగూడ జరాద స్వాభావిక రోగము లున్నవనియు, వాటి నివారించుట ఊర్జస్కర భేషజకృత్యమనియు, చక్రపాణి వచించెను. దీనినిబట్టి రోగహారత్వ ధర్మసామాన్యముగల భేషజము స్వస్థగత జరాది సహజ రోగములను హరించు నపుడు ఊర్జస్కరమనియు ఆర్తగత జ్వరాది రోగములను హరించునపుడు రోగ నుత్తనియు రెండు విశేషధర్మములచె రెండుగా విభజింపబడినది. అట్టి సందర్భమున స్వస్థునియందలి స్వాభావిక వ్యాధిని హరించుటయే లక్షణముగా జెప్పబడిన ఊర్జస్కర భేషజమునకు (అనగా రసాయన వాజీకరణౌషధములకు) రోగియందలి రోగనుత్త్వ ధర్మమునుగూడ లక్షణముగా జెప్పినచో ప్రథమమున జెప్పిన రోగహారత్వ ధర్మసామాన్యముగల వ్యాపక భేషజమునకున్ను వ్యాప్య భేషజమగు యీ రసాయనమునకున్ను యేమి భేదము గలదు? వ్యాపకమందుకంటె వ్యాప్య మందు లక్షణసంకోచ ముండుట సర్వసమ్మతముగదా! యెట్లన:- ద్విశఫవత్వము గోమహిషములకు వ్యాపక ధర్మము. గోవునకు సాస్న (అనగా గంగడోలు) యుండుట వ్యాప్యధర్మము. ఇచట ఆవునకు లక్షణము చెప్పవలసి వచ్చినపుడు గంగడోలు గలిగియుండుట యనెడి వ్యాప్యధర్మమున జెప్పవలెను, అంతమాత్రమున ద్విశఫవత్వమనెడి వ్యాపకధర్మము ఆవునకు లక్షణము గాదనిగాని లేదనిగాని తాత్పర్యముగాదు. అందుచేతనే ఋషి మూలములో "ప్రాయః" అనెడి పదమును ప్రయోగించి దాని కర్థమును తానే "ప్రాయశ్శబ్దోవిశేషార్థః" అని వచించెను. పై జెప్పిన సమాధానము నంగీకరించనిచో "స్వస్థస్యోర్జస్కరం యత్తుతద్వృష్యం

త్రదసాయనం" అని సర్విశేషముగా రెండుగా విభజింపబడిన ఊర్జస్కర ద్రవ్యములో నొకటగు రసాయనమునకు వ్యాపక ధర్మమగు రోగహారత్వమును లక్షణముగా జెప్పకతప్పనియెడల వృష్యభేషజముగూడ సర్విశేషముగా జెప్పబడుటచే దానికిగూడ రోగహారత్వము లక్షణముగా జెప్పియే తీరవలెను. అట్లు ఆ వృష్యలక్షణ శ్లోకమున గానరాదు. ఇంతేగాక పాచన - దీపన - అనులోమనాది ద్రవ్యములన్నియు భేషజములే గాన అనగా వ్యాపకధర్మమగు రోగహారత్వము గలవియే గాన వాటికిగూడ రోగహారత్వమును లక్షణముగా జెప్పవలసి వచ్చును. అట్లు వాటికి వ్యాపకధర్మమగు రోగహారత్వమున్నను దానిని లక్షణముగా జెప్పక పాచకత్వ - దీపనత్వ - అనులోమనత్వాది ధర్మములనే లక్షణముగా జెప్పిరి. గాన సామాన్య ధర్మ మెన్నడును లక్షణము కాజాలదు. విశిష్టధర్మమే లక్షణమగును. ఏమన, పృధివ్యాది ద్రవ్యములకు లక్షణములను జెప్పుటలో గంధవత్వాది విశిష్టధర్మములే జెప్పబడినవి గాని పృధ్వ్యజలాదులకు సామాన్యమగు ద్రవ్యత్వాదులు జెప్పబడలేదు. అట్లు జెప్పనచో అతివ్యాప్త్యాది దోషములు సంభవించును. గాన లక్షణ మెపుడైనను విశిష్టధర్మముగా నుండవలెను. గనుక జరయనెడి స్వాభావికవ్యాధిని వారింపుటయే రసాయనమునకు లక్షణ మని జెప్పవలెను. ఒకవేళ వ్యాధిహారత్వము ఇతరభేషజములకంటె రసాయనమం దధికకముగా నున్నదిగాన అట్టి వ్యాధిహారత్వముగూడ దీనికి లక్షణముగా యేల చెప్పరాదని శంకగల్గినచో అట్టి శంకకు "ప్రాయః" "ఉభయం హ్యాభయోర్థకృత్" అనెడి ఋషివచనములే వారకములుగా నున్నవి. ఎట్లనః- ఊర్జస్కర భేషజమునందూర్జస్కరత్వ మధికముగా నుండుననియు రోగనుత్త్వము అంతకు తక్కువగా నుండు ననియు జెప్పుటచే వారింపబడినది.

లక్ష్యలక్షణ సమన్వయముః- భేషజము, ఊర్జస్కరము, రోగనుత్తు, రసాయనము, వృష్యము, అను వాటికి లక్షణము లెట్లనగా:- భేషజమునకు "చతుష్పాదం షోడశకలం భేషజ మితి భిషజోభాషంతే" అని చెప్పుటచే స్వాభావిక అస్వాభావిక రోగహారత్వము, అనుపచిత శుక్రత్వాది హారత్వము లక్షణమగుచున్నది. ఊర్జస్కరమునకు "స్వస్థస్యోర్జస్కరం" అని చెప్పుటచే స్వస్థునియందలి జరాది స్వాభావిక రోగహారత్వము, అప్రహర్ష వ్యవాయ క్షయిత్వోపచిత శుక్రత్వా ద్యప్రశస్తశారీరభావహారత్వము లక్షణమగుచున్నది. రోగనుత్తునకు "ఆర్తస్య రోగనుత్" అని చెప్పుటచే ఆర్తునియందలి జ్వరాది అస్వాభావిక రోగహారత్వము లక్షణమగుచున్నది. ఊర్జస్కరమందలి రెండుభాగములలో నొకటగు రసాయనమునకు మొదటిదగు జరాది స్వాభావిక రోగహారత్వమున్ను; రెండవదగు వృష్యమునకు, రెండవదగు అప్రహర్ష వ్య~యత్వానుపచిత శుక్రత్వా ద్యప్రశస్త శారీరభావ

హారత్వము (అనుపచిత శుక్రత్వాది హారత్వమున్ను) లక్షణమగుచున్నవి. అయితే ఇచట భేషజమందలి రోగహారత్వము రోగములయందలి స్వాభావిక అస్వాభావిక భేదములనుబట్టి రెండువిధములుగా నుండుటచే అట్టిరోగములను హరించెడి భేషజములుగూడ క్రమముగా ఊర్జస్కర రోగనుత్ అని రెండుగా విభజింపబడెను. స్వాభావికరోగము జరాదిరూపముగను, అనుపచిత శుక్రత్వాది రూపముగను నుండుటచే ఊర్జస్కర ద్రవ్యము రసాయనము, వృష్యము అని రెండుగా విభజింపబడెను. ఇపుడు రసాయనమునకు జరాది స్వాభావిక రోగములను జ్వరాది అస్వాభావిక రోగములనుగూడ హరించుట లక్షణముగా జెప్పినచో అట్టి ఉభయ ధర్మములుగల భేషజసామాన్యమం దతివ్యాప్తి సంభవించును. ఇట్లు భేషజ, రసాయనములు రెండును నిర్విశేషముగా జెప్పబడినపుడు, భేషజమును ఊర్జస్కరమని, రోగనుత్తని రెండుగా విభజించిన సందర్భములో; రసాయనమునుగూడ ఊర్జస్కర రోగనుత్తు భేదములచే రెండుగా విభజింపబడవలసి యుండును. అపుడు భేషజ రసాయనముల కభేదము సిద్ధించును. ఇట్లభేదసిద్ధి గలుగుట ఋషిసమ్మతముగాదు. ఋషికి సమ్మతమే యైనచో భేషజమును ఊర్జస్కరాది భేదములచే విభజననే జేయకుండును. అట్టి విభజనను మనమంగీకరించినపుడు భేషజమందేకదేశమగు ఊర్జస్కరము పూర్ణమగు భేషజ లక్షణములు గలిగియుండుట యసంభవము. ఊర్జస్కరములో, నేకదేశమగు రసాయనకు జ్వరాది రోగహారత్వమును లక్షణముగా జెప్పినచో రోగనుత్తుయం దతివ్యాప్తిగలును. గాన జరాది స్వాభావిక రోగహారత్వమే రసాయనమునకు లక్షణముగా జెప్పవలెను. గనుక "జరావ్యాధి నాశనం" అనుచోట "జరామితి స్వాభావికవ్యాధిం నాశయతీతి" అని రూపక సమాసమునే జెప్పవలెను.

మరియు స్వస్థునకు భేషజమగు ఊర్జస్కరములో నొక భేదమగు రసాయనమునకు అస్వాభావిక రోగహారత్వమును గూడలక్షముగా జెప్పినచో స్వస్థున కట్టి జ్వరాది అస్వాభావిక రోగము లెక్కడివి? ఉన్నవనినచో అట్టివాడు స్వస్థు డెట్లగును? గాన స్వస్థునియందు బనిచేయు రసాయనమునకు జ్వరాద్యస్వాభావిక రోగహారత్వమును లక్షణముగా జెప్పినందున యేమి ప్రయోజనము గల్గును? ప్రయోజనములేని లక్షణము జెప్పుట శాస్త్రసమ్మతమా? అయితే రసాయనమును రోగహారముగా వాడుట లేదా యని యందురేమో! అట్టి సందర్భమున అనగా రోగహార విధానముగా వాడిన సందర్భమున ఆ రసాయనము ధాతు వైషమ్య రూపరోగమును హరించును గాన రోగనుత్తగును గాని, అట్టి రోగము స్వస్థున కుండనందున "స్వస్థస్యోర్జస్కరత్వము" దానికి వర్తింపదు. అపుడు ప్రథమమున రోగనుత్తయి పిదప రసాయనవిధిగా సేవింపబడినచో: యొకేనాయిక ధర్మ

విప్రలంభమున ప్రోషితభర్తృకయైనను భర్తృసంయోగావస్థలో కలహాంతరితాది నాయికాత్వము నందినట్లు రసాయనత్వమునుగూడ బొందును. ఇందుచే ప్రోషిత భర్తృకాత్వము - కలహాంతరితాత్వము యొకే నాయికయం దేక కాలమున యెట్లుండనేరవో యట్లు కేవలము విరుద్ధముగా నున్న స్వాస్థ్య - ఆర్తత్వము లేక కాలమం దేకాధికరణము నాశ్రయించి యుండవు గాన రసాయనమందలి ఊర్జస్కరత్వ - రోగహరత్వము లేకకాలమందు పనిజేయజాలవు. ఇందలి ప్రబలధర్మమగు ఊర్జస్కరత్వాంశమునకే రసాయనత్వ మని బేరిడెను. ఇట్టి భావమంతయు "ప్రాయః" పదముచే వెల్లడి యగుచున్నది. ఇట్లు రసాయనము అవస్థాభేదముచే ఊర్జస్కరము - రోగహరముగూడ యగునని "నసోస్తి రోగో భువిసాధ్యరూపః శిలాహ్వాయం యన్నజయేత్ ప్రసహ్య। తత్కాలయోగై ర్విధిభిఃప్రయుక్తః స్వస్థస్యచోర్జాం విపులాందదాతి" (చ. చి. ౧ అ. 3 పా. 27 శ్లో) అనెడి శ్లోకముచే ఋషియే జెప్పినాడు. ఇచట శిలాధాతువు కాల—యోగ—విధులచే నానాఫలముల నిచ్చునని జెప్పుటనుబట్టి పై జెప్పిన రీతిని యొకేద్రవ్యము నానావిధములుగా యుపయోగింపబడి రసాయనత్వ రోగహత్వాది ధర్మను లుగల దగునని స్పష్టమగుచున్నది.

మరియు ప్రథమమున స్వాస్థ్యసంపాదన జేసి పిదప రసాయనమును సేవింపవలెనని "తస్యాంసంశోధనై శ్శుద్ధః సుఖీజాత బలః పునః। రసాయనం ప్రయుంజీత" (చ చి. ౧ అ) అని యిట్లనెకవచను లుండుటచే భేషజమందలి రసాయనత్వాంత మెన్నటికైనను వ్యావహారిక స్వస్థునియందే వినియోగించునని తెలియుచున్నది.

మరియు, రసాయనసేవజేయు సమయమున రోగములు గలిగినచో ఆరసాయన సేవను నిలపివేసి ఆ యా రోగములకు తగు యౌషధములను (రోగనుత్తులను) సేవించి రోగములు తీరినపిదప తిరుగా రసాయనములను సేవింపవలెననిగూడ జెప్పబడెను. తథాచోక్తం "రసాయన విధిభ్రంశాత్ జాయేరన్ వ్యాధయోయది। యథాస్వమౌషధం తేషాంకార్యం ముక్త్వారసాయనం" (చ. చి. ౧ అ. 4 పా. 28 శ్లో) ఇట్టి సందర్భములో రసాయనమునకు పూర్వపక్షిమతమున ముఖ్యలక్షణముగా జెప్పబడెడి రోగహరత్వము అకించిత్కర మగుచున్నది. గాన. రసాయనమునకు జర యనెడి వ్యాధిని హరించుటయే లక్షణముగా జెప్పనలెను.

ఇచట యొక యుక్తిగూడ గలదు. యెద్దియనః— చక్రపాణి దీపార్చి ర్న్యాయముచే సర్వభావములు ప్రతిక్షణము నశించుచునే యుండునను మాటను యొప్పుకొనుచూ; సర్వభావాంతః పాతియగు రోగముమాత్రము నశించకుండునా? దానికి మీా చికిత్సయేల? అని బలెకెడి పూర్వపక్షికి సమాధాన మిచ్చుటలో

యీాదిగువరీతిగా జెప్పుచున్నాడు. "యద్యపిధాతువైషమ్యంవినశ్వరంతథాపివినశ్యదపి తద్ధాతు వైషమ్యం స్వకార్యం విషమమేవధాతు మారభతే ఏవంసోప్యపరం విషమమితి నధాతు వైషమ్య సంతాన నవృత్తిర్ధాతు సామ్యజనకత్వ హేతుంవినా యదాతుధాతు సామ్యహేతు రుపయుక్తోభవతి తదా తేనసహితం వైషమ్య సంతతిసహిత మపి కారణం సమమేవధాతు సంతానమారభతే యధాముదర ప్రహార రహితో ఘటపరమాణు సంతానో విసదృశం కపాలసంతానమారభతే" (చ. సూ 16 అ. 34 శ్లో. వ్యా.) అనగా ధాతువైషమ్యము నశ్వరమైనదైనను అది నశించుచూ వేరొక ధాతువైషమ్యమును బుట్టించును అపుట్టినది మరియొక ధాతువైషమ్యమును బుట్టించును. ఇట్టి ధాతువైషమ్యసంతానము నశించుటకు ధాతుసామ్యమును బుట్టించెడి కారణమును దానికి జేర్చునలెను. అప్పుడది ధాతుసామ్యమును బుట్టించును. యెట్లన:- ఘటమును ముద్గరముతో గొట్టినచో యీా దెబ్బతిన్న ఘటమందలి పరమాణు సంతానము తమకు విసదృశమగు కపాలసంతానమును బుట్టించును. అట్లే ధాతుసామ్య జనకమగు కారణముతోగూడిన ధాతువైషమ్యముగూడ ధాతుసామ్యమునే బుట్టించునుగాన చికిత్సజేయుట యావశ్యకము అని భావము.)

| ఇందులో ధాతువైషమ్యమనగా, | వాతము | పిత్తము | కఫము |
|---|---|---|---|
| ఇయ్యదిదీపార్చిర్ న్యాయముగా నశించుట, | 10 | 8 | 6 |
| కారంభించినచో మూడుదోషములలోను 1 | | | |
| భాగములు పోయినదనుకొనుడు. అపుడు | 9 | 7 | 5 |
| ఈతీరుగా భాగములుండును. ఇపుడు ప్రతిదినము మన శరీరపోషణకై ఊర్జస్కరమగు అన్నాదులను సేవించుచుంటిమి అపుడు ధాతువులు సమంగా పెరుగును. యేమన ఉన్న ధాతువులను సమముగాపెంచి కాపాడుటయేగదా! ఊర్జస్క లక్షణము అందుచే తిరుగాధాతువులు ........... | 10 | 8 | 6 |

గాతయారగును. ఇపుడీ 3 పదములను బాగుగా విమర్శించినచో మొదటయున్నది విషమస్థితి. అది దీపార్చిర్న్యాయముచే నశించునపుడుగూడ దానికి విషమస్థితియే సంభవించినది. ఆ ధాతుగణమును పెంపొందించుటకు మనము ఉపయోగించెడి అన్నాదులుగూడ ఊర్జస్కరములగుటచే అనగా ఉన్నవాటి నున్నట్లు అన్నిటిని సమముగా పెంచునవగుటచే ఆధాతుగణము నట్లే విషమస్థితిలోనే యుంచినవి. రసాయనము ఊర్జస్కరముగాన రసాయనమును సేవించిననూ యిట్లే ధాతుగణము విషమస్థితిలోనే యుండునుగాని సమస్థితికి రాజాలదు. ఇక సమస్థితికివచ్చుటకు యేమి చేయవలెననగా:- దీపార్చిర్న్యాయముచే నశించినపు డుండెడి ధాతుగణ

ములో (పై జూపిన వాతము 9 పిత్తము 7 కఫము 5) లో 1 వాతమును 3 పిత్తమును 5 కఫమును బెంచెడి అనగా యిట్టిలక్షణగల యొకానొక విషమధాతు జనకపదార్థమును పై ధాతుగణముతో గలిపినచో వాతం 10, పిత్తం 10, కఫం 10 అనెడి సమధాతుగణము జనించును, ఇట్లు తాను విషమధాతు జనకమైనను శరీరమందలి విషమధాతుగణముతో గలసి సమధాతు జనకమగుచున్నదిగాన సమధాతు జనకహేతువనబడుచున్నది. దీనినే రోగనుత్తందురు. గాన రోగనుత్తులు, విషమధాతువులు గల రోగికి యిచ్చినపుడే రోగమును బోగొట్టి సమధాతు జనకములగునుగాని స్వస్థున కిచ్చినచో వానియందు ధాతువులు సమములుగానుండుటచే వాటిలో తమ విషమధర్మమును జేర్చి స్వస్థుని రోగిగాజేయునుగాన రోగనుత్తు రసాయనముగాని, రసాయనము రోగనుత్తుగాని యెన్నిటికిని కాజాలదు. అయితే "ఉభయం హ్యాభయార్థకృత్" అని చెప్పినమాట యెట్లు సంగతమగుననగా, "తత్కాలయోగైర్విధిభిః ప్రయుక్తః" అను వచనమునుబట్టి యొకేవస్తువు పై జెప్పిన నాయికాదృష్టాంత ప్రకారము అవస్థాభేదముచేగాని వస్త్వంతర సంయోగాదులచేగాని నానాత్వమును బొంది నానాకార్యములను జేయుచుండును, తథాచోక్తం:- "తిలశో నసేవ్యమానం విషమపి సంజాయతేఽమృతసమానం భల్లాతకస్నహాతివైః తత్కార్యపి కుష్ఠముపహంతి సంస్కారేణ లఘుభ్యః సక్తుభ్యస్సిద్ధ పిండికాగురవః మరువానిష్వతి సాత్మ్యం దధిపీలు శమీకరీరాణాం ఘృతదుగ్ధం హేమంతేమందాగ్ని కఫోత్తరం భవేత్ప్రాయః దధిదుగ్ధం వాతఘ్నంతదజాతం వాతకృద్భవతి రేచనమపిచ క్షీరం గవ్యం సంగ్రాహి కస్యచిద్ భవతి" (వా. సూ. 6. అ. వ్యా) అని చెప్పబడెనుగాన యొకే ద్రవ్యము పై ప్రకారము నానాత్వమునొంది నానాకార్యములను జేయునపుడు వ్యవహార దృష్టిని యొకేవస్తువని తోచినను వాస్తవమున కది నానాత్వ జనకకారణములతో సంయోగించునపుడెల్ల భిన్నభిన్న పదార్థములుగనే మారుచూ భిన్నభిన్న కార్యములను జేయుచున్నదని ముఖ్యముగా గనుసంపదగిన విషయమై యున్నది.

అయితే సుశ్రుతములో సర్వోపఘాతశమనీయ = మేధాయుష్కామీయ — స్వభావవ్యాధిప్రతిషేధనీయ—నివృత్తసంతాపీయములనెడి రసాయన ప్రకారములను జెప్పుటలో రోగహరత్వముగూడ యీ రసాయనములకు సంభవించుచున్నది. మరియు చరకుడు జెప్పిన వాతాతపిక రసాయనము రోగనుత్తేగదా! అని ప్రశ్నింపవచ్చును. గాని సుశ్రుతమందలి స్వభావవ్యాధి ప్రతిషేధనీయను చరకమందలి కుటీ ప్రావేశమునకు తప్ప మిగిలినవాటికి రసాయనత్వము ఔపచారికముగాని వాస్తవముగాను. ఉక్తంచః— "అత్రచరసాయనాని వాతాతపికాని యోజయేత్ నకుటీ ప్రావేశికాని స్వస్థవృత్తాధికారత్వాత్తద్విధానస్య" (వా. సూ. వ్యా.) "నచేహానర్వాత్ర రోగహరస్య స్పష్టోర్జస్కరత్వమితి ప్రతిజ్ఞాయతే యెనవాతాసప్తపర్ణాదీనామపి రసాయనత్వం సాధనీయశక్తిత్వాద్ధర్రోగహరత్వేన యదుచ్యతే

తదపిరసాయనం వాజీకరణం భవతీతిలవమాత్రో ప్రదర్శనం క్రియతె తత్ స్వస్థార్త్యయోరుభయార్థ కర్తృత్వం" (చ. చి. అ. పా. 6 శ్లో. వ్యా.) ఇత్యాదులు.

మరియు స్వస్థునియందే రసాయనమును ఉపయోగింప వలెనని జెప్పుటకు ప్రమాణములు:—

శ్లో॥ సమర్థానా మరోగాణాం ధీమతాం నియతాత్మనాం। కుటీప్రవేశః క్షణినాంపరిచ్ఛదవతాంహితః॥ 26 "అతోన్యథాతు యెతెషాం సౌర్య మారుతి కోవిధిః। తాభ్యాం శ్రేష్ఠతరః పూర్వోవిధి స్తతుసుదుష్కరః॥ 27" (చ. చి. అ. 4 పా.) శ్లో॥ యథాస్థూల మనిర్వాహ్యదోషాణ్ శారీరమానసాణ్। రసాయన గుణైర్జంతుర్యుజ్యతెన కదాచన॥ 35 "యోగాహ్యాయుః ప్రకర్షార్థా జరారోగనిబర్హణౌః। మనశ్శరీర శుద్ధానాం సిధ్యంతి ప్రయతాత్మనాం। తదేతన్నభవేద్వాచ్యం సర్వమేవహతాత్మసు॥ 36½॥ (చ. చి. అ. పా.) శ్లో॥ అకృతక్షేత్రీకరణె రసాయనం యోనరః ప్రయుంజీత। తస్యక్రామతినరసః సర్వాంగదోష కృద్భవతి॥ (రసహృదయ తంత్రం 19 అ. 8 శ్లో)

గనుక పై ప్రకారము రసాయనమందు రోగహారత్వము ఔపచారికముగా యుండిన యుండవచ్చునుగాని లక్షణము చెప్పుటలో రసాయనమునకు రోగహారత్వముకు రోగనుత్తునకు రసాయనత్వమును జెప్పరాదు. జెప్పినచో అతివ్యాప్తి లక్షణమునబడదు. ఇదియే రసాయన లక్షణసంగతి.

* రసాయనానుక్త విషయ నిరూపణము

ఇచట యీరసాయన విషయములో ఇంకొక సూచితాంశము గలదు అది తెలిసిననేగాని కుటీ ప్రావేశికాది వాతాతపరసాయనములుగూడ యథోక్తఫలముల నీయజాలవు. అది యెద్దియన:— "అమృతాల్పాంతర గుణం సిద్ధం రత్నరసాయనం సిద్ధేభ్యో బ్రహ్మచారిభ్యో యదువాచానురేశ్వరః" (చ. చి. 1 అ. 4 పా. 62 శ్లో) (అనగా అమృతాల్పాంతర గుణములుగల శ్రేష్ఠమైన రసాయనములను ఇంద్రుడు సిద్ధుల కుపదేశించెనని భావము).

ఇచట అమృతాల్పాంతర గుణమనెడి విశేషణమే మర్మస్థానము. అమృతాల్పాంతర గుణమనగా అల్పంచ తదంతరం అవధిః అల్పాంతరం అమృతం పారదః అల్పాంతరం యస్యతదమృతాల్పాంతరం తస్యగుణ ఇవగుణో యస్యతత్ అమృతాల్పాంతరగుణం అని శబ్ద నిష్పత్తిని జేయవలెను. అపుడు పాదరసముతో అల్పమగు అంతరము (అనగా అవధి లేక మర్యాద) గల అనగా "తేనసాక మభివిధిః తేనవినా మర్యాదా" యనెడి న్యాయమునుబట్టి పాదరసంలేని ఔషధముయొక్క గుణము

వంటి గుణముగలది యీ రసాయనమని యర్థము వచ్చును. ఇచట పాదరసము వినాగా మిగిలిన రసాయన విధానమంతయు జెప్పియుండుటచే పాదరసమునకు అల్పాంతరత్వము సిద్ధించుచున్నది. అంతరపదము అవధ్యర్థకమని నిఘంటువు "అంతర మవకాశావధి పరిధానాంతర్ధి భేదతాదర్థ్యే ఛిద్రాత్మీయవినా బహిరవసర మధ్యేంతరాత్మనిచ" (అమరం) ఇట్లు చెప్పుచున్నది. గాన బద్ధమైన పాదరస భస్మను యీ చెప్పిన కుటీ ప్రావేశికాది రసాయనము లన్నిటి యందును జేర్చుకొనవలెను. అట్లు జేసినపుడే యథోక్తఫలముల నిచ్చును; లేనిచో ఫలముల నీయజాలవు అని భావము. తథాచోక్తం:– "సవసిరె దెహి। తత్ స్థైర్యేన సమర్థం రసాయనం కిమపిసూత (పా. మూల)లోహాది। స్వాయమస్థిర స్వభావం దాహ్యం క్లేద్యంచ శోష్యంచ। కాష్ఠౌషధ్యో నాగేనాగం వంగేథవంగ మపిశుల్బో। శుల్బంతారే తారంకనకే కనకంచలీయతె సూతే॥ 12 "పరమాత్మ నీవసతతం భవతిలయోయత్ర సర్వసత్వానాం। ఏకోసౌరసరాజః శరీర మజరామరం కురుతే॥ 13" (రసహృదయం.। అవబోధ) (అనగా స్థిరదేహము గలుగుచుండ బ్రహ్మజ్ఞానము గలుగుట కవకాశము గలుగునని పూర్వశ్లోకమున జెప్పి, స్వయముగా అస్థిరస్వభావముగలదై దహనాది క్రియలకు యోగ్యమగు శరీర మేదికలదో అట్టిదాని స్థైర్యముచేత ననగా దానిని స్థిరముగా యుండునట్లు చేయుట చేతను అనిర్వాచ్యమైన సూతలోహాదులు అనగా లోహాదుల చారణ జారణాది సంస్కారముగల సూతము (పాదరసము) సమర్థమైన రసాయన మనబడుచున్న దని తాత్పర్యము. అని యిట్లుజెప్పిన వెంటనే ఉత్తరశ్లోకమున క్రరలు–ఓషధులు–మొద లగునవన్నియు సీసమునందును అది తగరమునందును ఆ తగరము రాగియందును అది వెండియందును అది బంగారమందును ఆ బంగారము సూతమందును లీనమగునని జారణసంస్కారఫలితమును సూచనగా జెప్పెను. అట్టి సంస్కార సంస్కృతసూతము "కిమపిసూత లోహాది" అనెడి పదమునకు లక్ష్యమగు చున్నది. ఇట్టిసూత మొక్కటియే జరామృత్యువులు శరీరమునకు లేకుండునట్లు జేయ సమర్థమైనదని కొన్నశ్లోకములో జెప్పియున్నాడు. దానినిబట్టి పాదరసము లేనిమూల లోహాదులు రసాయన ధర్మముగలవి గావని స్పష్టమగు చున్నది. గనుకనే చరకుడు "అమృతాల్పాంతరగుణం" అనెడి విశేషణమును అర్థగాంభీర్యము గల్గునట్లు నుడివెను. రహస్య విషయములలో ఇట్లుజెప్పుట వేదసమ్మతమై యున్నది. (కృష్ణయజుస్సు 3 కా. 3 ప్ర. 7 అనువాకం చూడుడు) అయితే పాదరస భస్మవిధానము తెలియకయా యిచట జెప్పలేదని శంకగల్గును గాని పాదరసమును గూర్చి ప్రత్యేకతంత్రములు విపులముగా జెప్పబడియుండుటచేతను, తాను జెప్పబోవు యీ చరక తంత్రము జ్వరాది చికిత్సా ప్రధానమగుట చేతను ఇందుదానిని సంక్షేపించెనేగాని తెలియక కాదు.

యేమన :— కుష్ఠచికిత్సలో తాళకము - మణిశిల - అంజనము - పాదరసము - మొదలగు వాటి ప్రయోగములను చరకుడు జూపి యున్నాడు. మరియు యీ చరకుడు లోహకల్పమనెడి గ్రంథమునుగూడ రచించెనని వినవచ్చు చున్నది. అందు రసాయనాంశములు విపులముగా గలవనిగూడ దెలియును. గాన చరకునకు రసభస్మ విధానము దెలియక యిచట జెప్పలేదని యనుకొనుట సమంజసము కాదు. మరియు; ఆదిశంకరులవారి గురువులగు గోవింద భగవత్పాదు లనగా చరకుడే యనియు రసహృదయ తంత్రమును వీరే రచించిరనియుగూడ ప్రతీతిగలదు. దీనిబట్టికూడా వీరికి రసభస్మవిధానము తెలియ దనుట సమంజసము కాదు. ఇదియే రసాయన మర్మనిరూపణము.

ఇక; శ్లో॥ నిత్యాః ప్రాణభృతాందేహే వాతపిత్త కఫాస్త్రయః వికృతాః ప్రకృతి స్థావాతాన్ బుభుత్సేత పండితః॥ (చ. సూ. 18 అ. 58 శ్లో) (అనగా వాతాది దోషములు శరీరమందు నిత్యముగా నుండునుగాన వాటిని పండితులు

N. B. ఇందు వెనువెంట ద్రవ్య - రస - పదకములను వ్రాసియుంటిని; వానినిబట్టి ద్రవ్యరసముల నానాత్వస్వరూపాదులు గోచరింపగలవు.

ద్రవ్య పదకము: } ఈ గ్రంథం చివర చూడుడు.
రస పదకము :

ముందుగా తెలుసుకొనవలెను ) అని చెప్పుటచే దోషత్రయమునుగూర్చి సంక్షే పముగా వివరించెద.

## దోషత్రితయ నిరూపణము

జగత్తునందలి రజస్సత్వతమస్సుల క్రియారూపములగు సృష్టి స్థితిలయము లకు మారుపేర్లని చెప్ప నొప్పు విక్షేప - విసర్గ - ఆదానములలో చంద్రునివలన అనగా జలమువలన విసర్గము, సూర్యునివలన అనగా అగ్నివలన ఆదానము, జరుగు చుండ "రజోబహులో వాయుః" అనెడి సౌశ్రుత వచనమునుబట్టి విక్షేపక్రియను బుట్టించెడి రజోగుణము ప్రధానముగాగల వాతమనెడి భూతమును విక్షేపక్రియకు కారణమని నిశ్చయించిరి. ఉక్తంచ:- "విసర్గాదానవిక్షేపైః సోమసూర్యా[illegible] యథా ధారయంతి జగత్సర్వం కఫపిత్తానిలా స్తథా" (సు. సూ. 21 అ. 8 శ్లో) [illegible] ఇంతియగాక వేదములో "సర్వం విష్ణుమయం జగత్" అనెడి వచనము[illegible] దూ)పుడగు విష్ణువునకు బల మద్ది యని శంకింపబడి వాతమునకు [illegible] బలము గల్గుచున్నదని సమాధాన మివ్వబడెను తథాచశ్రుతిః:- "[illegible] [illegible] [illegible] ఇతి. [illegible] [illegible] [illegible] వాయుర్వ్యక్తం [illegible] శరీరాంగ వాయుర్విశ్వరూపః సర్వం [illegible]

యుశ్చకీర్తితః (చ. చి 28 అ. 1 శ్లో) అని వివరించెను. ఇట్లీ 3 శక్తులు సంవత్సరావయవములగు, వర్ష - శీత - ఉష్ణకాలములలో క్రమముగా విజృంభించుచున్నవి. "వృద్ధిస్సమానైస్సర్వేషాం" అనెడి సూత్రముచే ప్రతి ద్రవ్యము తనకు సమాన ద్రవ్య సంయోగమువలన వృద్ధిఁ బొందునుగాన దేని కేది వృద్ధిజనకమో దానికది సజాతీయమనియు, అది తన్మయమైనదనియు వేరుగా జెప్పపనిలేదు. అందుచే వర్షాదికాలములలో వృద్ధి నొందెడి వాతాదులు సంవత్సరాత్మక కాలమయములనుటలో నాశ్చర్యమేమున్నది? కావున యిట్లు సంవత్సరమయములగు వాత-జల-అగ్నులనెడి 3 భూతములు తమకుండెడి, విక్షేప - విసర్గ - ఆదానములనెడి శక్తులచే ప్రపంచమును ధరించుచున్నవని చెప్పుటలో భూమ్యాకాశ భూతములు లేవని తాత్పర్యముకాదు. ఆకాశము "అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ నిత్యస్సర్వగతఃస్థాణు రచలోఽయం సనాతనః" అనెడి గీతావాక్యమునకు లక్ష్యమై అమూర్తమగుటచే చికిత్సజేసి పెంచుటకుగాని తగ్గించుటకుగాని తగినది కాకుండుటచేతను, ఇతరభూతముల వృద్ధిక్షయములచేతనే ఆకాశమునకు క్షయవృద్ధ్యాభాసలు సిద్ధించుటచేతను "యావదాదేయంతావదా దాయువర్తతే" అను నార్యోక్తినిబట్టి దానిని (ఆకాశమును) విడనాడిరి. ఈరీతిని యసాధ్యములగు మహదహంకారాది తత్వములను విడనాడినట్లు "అస్మిన్ శాస్త్రే పంచమహాభూత శారీరసమవాయః పురుష ఇత్యుచ్యతే" (సు. శా.) ఇత్యాది వచనములచే దెల్లమగుచున్నది. ఇక పృథ్వియనునది ఉత్తరధాతువును బుట్టించెడి శక్తిలేనిది గాన ఓజోధాతువునకు కారణాంశ మెట్లులేదో యట్లే తనయందు కారణాంశములేని కతమున తానొక కార్యమును జేయుటకు (అనగా ప్రకృత్యారంభకమగుటకు) కారణాంశముగల వేరొక భూతము నపేక్షించును గాన స్వతంత్రము గాజాలదు. అందుచే పృథ్వీభూతమువలన బుట్టెడి కార్యజాతమునకు వేరొక భూతము (అనగా యా కార్యరచనలో పృథ్వి యే భూతము నపేక్షించునో యట్టి భూతము) కారణమగును గాన పృథ్వి కారణము కాజాలకున్నది. గనుకనే దోషవిమర్శ ప్రస్తావములో "దోషాః హిస్వతంత్రా దూషణాత్మక ఉచ్యతే। యతోనవాతాదయో వృద్ధాః కించి దపేక్ష్య దూషయంతి, కింతుస్వతఏవ। శోణితంతు దుష్టవాతాది సంసర్గమపేక్ష్యైవ దూషకం భవతి" (చ. సూ.। అ. 56 సూ వ్యా) అని యిట్లు పృథ్వీభూతమువల్ల బుట్టిన రక్తమును కారణవర్గరూపమగు దోషగణమునుండి బహిష్కరించిరి. అందుచే వాతాగ్నిజలము లనెడి 3 భూతములవలన క్రమముగా బుట్టిన వాత - పిత్త - శ్లేష్మములు మాత్రము దోషములుగా (అనగా కారణములుగా, అనగా ప్రకృత్యారంభకములుగా) గణింపబడినవి.

ఇది యిట్లుండ కొందరు పంచభూతములకు త్రివృత్కరణము జేయుచు నందాకాశమును వాతమందును, భూమిని జలమందును గలిపిరి; ఇది సంగతముగా నున్నది. ఏమనగా అట్లు కలుపుటలో వారి యభిమత మేమయి యుండునన?

ఆకాశవాయువులకు యొకే గుణకర్మ స్వభావము లుండుననియు నట్లే జలభూము లకుగూడ యుండుననియు వారి యభిమతమై యుండునుగదా! అట్లుకాదేని అమ్ల - లవణ - రసోత్పత్తి విషయములో "భూమి జలయోస్సామ్యత్వేన ఏకరూపతయా కార్యవిరోధాభావాత్" (చ. సూ. 26 అ. 38 సూ. వ్యా.)

అని శివదాసు డెట్లుజెప్పును? ఇట్లుండుటయే సత్యమైనచో పంచభూతము లను వానికి పంచజ్ఞానేంద్రియములు తుల్యయోనులను మాటయు, శబ్దాది పృథగ్విషయ ములు గలవనుటయు నసంభవము; "ఇంద్రియే ణేంద్రియార్థంతు స్వం స్వం గృహ్ణాతి మానవః। నియతం తుల్యయోనిత్వాత్" (సు. శా. 1 అ. 15 సూ.) అనెడి సుశ్రుత వచన ప్రకారము అవి తమతమ శబ్దాది విషయములను నియతముగా గ్రహించుట గూడ సంభవింపకుండును. ఇంతియగాక రస నిష్పత్తిలో కషాయరసమునకు కారణమగు వాత - భూములలోని భూమికి మారుగా జలమునుబెట్టి యారసమును బుట్టించుట సంభవించును. అందువలన రససంఖ్య హెచ్చుగును. దానంజేసి షడ్రస సిద్ధాంత మంతరించునుగాన, నే పై జెప్పిన రీతిని దోషములకు త్రిత్వసంపాదనజేయుట సమంజసము. ఇట్లు దోషములకు త్రిత్వము సిద్ధమగుచున్నది.

## దోషములకు ప్రకృత్యారంభకత్వ నిరూపణం

దోష - కారణ - ప్రకృత్యారంభకత్వములకు సంబంధ మేమనిన:- మన శరీర మాకాశాది పంచభూతములవలన బుట్టినది. ఆ భూతములు పుట్టుటలో "ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నేరాపః అద్భ్యః పృథివీ" అనెడి శ్రుతివలన పూర్వభూతమున కుత్తరభూతము కార్యమున్ను, ఉత్తరభూతమునకు పూర్వభూతము కారణమున్ను యగుచున్నది. గాన కేవలకారణ మాకాశమున్ను కేవల కార్యము పృథ్వియు; మిగిలిన వాత - అగ్ని - జలములు పూర్వాపేక్షయా కార్యములున్ను ఉత్తరాపేక్షయా కారణములున్ను యగుటచే కార్య కారణోభయ ధర్మములు గలవగుచున్నవి. ఇందువలన పృథ్వియందు కారణాంశమున్ను ఆకాశమందు కార్యాం శమున్ను లేదని సిద్ధమగును. ఇట్లుండ, ప్రకృత్యారంభక మనగా దేహమును నిర్మా ణముచేయు ద్రవ్యమని యర్థము. ఇట్టి నిర్మాణ క్రియలో పృథ్వికారణాంశము లేనిదిగాన దానికి అనగా దాని రూపాంతరమగు రక్తమునకు కారణత్వము అనగా ప్రకృత్యారంభకత్వము అంగీకరింపబడలేదు. ఆకాశము కారణాంశము గలదైనను యమూర్తముగాన ప్రకృతచికిత్స కనుపయుక్త మగుటచే దానిని విడనాడితి నని యీవరకే చెప్పితిని. ఇక దోషమనగా "దూషయంతీతి దోషాః" అని నిర్వచించిరి. గాన దూషింపబడెడి రసాది సప్తధాతువులు పిండాండమగు శరీరమందుండుటచే వానిని దూషించెడి ద్రవ్యములగు వాత - పిత్త - శ్లేష్మములకు దోషసంజ్ఞం సిద్ధించెను. మరియు బ్రహ్మాండమునంతను ఏకవ్యక్తిగా భావించినపుడు 24 తత్వము

లలో మొదటి పగు వికృతి ధర్మములేని ప్రకృతి యనగా మూలప్రకృతి కేవల కారణముగాన దానిని విడనాడి మిగిలిన కార్య కారణోభయాంశ ములు గల, ప్రకృతులు దోష...స్థానమున్ను కేవల కార్యాంశలు గల 16 వికారములు దూష్యస్థానమున్ను, యధిష్ఠించు చున్నవి. ఉక్తంచ:— మూల ప్రకృతిరవికృతిః మహదాద్యాః ప్రకృతి వికృతయస్సప్త। షోడశకస్తు వికారః” (సాంఖ్యకారిక. 3) ఇతి। పై రీతిగా సృష్టికార్యక్రమ మందలి శరీరములో వర్గీకరింప బడిన దోషదూష్యములు రెండున్ను పంచభూతాత్మకము లైనను దోషవర్గము కారణకోటి నధిష్ఠించినందున దూష్యవర్గము కార్యకోటి యందలి దని చెప్ప నొప్పును. ([1]) సంహారక్రమములో దీనికి వ్యత్యాసము గలుగును. ఇందుచే కారణ భూతములగు వాతాదులు కార్యభూతములగు రసాది ధాతువులను బుట్టించుచున్న వని సిద్ధమగుచున్నవి. ఉభయ వర్గములోనూ వాతాదిత్రిక ముండును గాన కారణ వర్గ మందలి వాతాదిత్రికము సూక్ష్మ మగుటచే దానికి ప్రసాదమనియు కార్యవర్గ మందలి వాతాది త్రికము స్థూలమగుటచే దానికి కిట్టమనియు వైద్యులు పేరిడిరి. ఉక్తంచ:— “తత్రాహార ప్రసాదాఖ్యోరసః కిట్టంచ మలాఖ్య మభినిర్వర్తతే। కిట్టాత్ స్వేదమూత్ర పురీష వాత పిత్తశ్లేష్మాణః.........పుష్యంతి, పుష్యంతి స్వాహా రినాద్రసరుధిర మాంస మేదోస్థి మజ్జ శుక్రౌజాంసి పంచేంద్రియ ద్రవ్యాణిధాతు ప్రసాద సంజ్ఞకాని...। తే సర్వఏవధాత వోమలాఖ్యాః ప్రసాదాఖ్యాశ్చ రసమ లాభ్యాం పుష్యంతః స్వంమానమనువర్తంతే యథావయః శరీరం।” (చ. సూ. 28 అ. 4 సూ.)

ఇదియే దోషములకు ప్రకృత్యారంభకత్వ నిరూపణము.

అన్నపరిణామ త్రైవిధ్య నిరూపణము

మరియు మన శరీరవృద్ధికి కారణము గు యున్న పానములు శరీరమున బ్రవేశించి [illegible] — మాధ్యమ — అణిష్ఠములని 3 గా విభక్తము లగుచున్నట్లు జెప్పుచూ [illegible] లనెడి కిట్టప్రసాదములుగాక మధ్యమ మనెడి వేరొక పరిణామా [illegible] భందోగ్య [illegible] బోధించుచున్నది.

([1]) [illegible] సూక్ష్మములే కారణములగు నను టకు వీలు లేదు. [illegible] — సృష్టిక్రమములో కారణవర్గ మవ్యక్తమున్ను సూక్ష్మముగను, కార్యవర్గము [illegible] సంహారక్రమములో దీనికి వ్యత్యాసముగా స్థూలసూక్ష్మ [illegible]

యెట్లన—"అన్నమశితం త్రేధా నిధీయతే తస్య యత్ స్థవిష్ఠో ధాతుః తత్పురీషం భవతి। యోమధ్యమః తన్మాంసం యోఽణిష్ఠ స్తన్మనః। ఆపః పీతాః త్రేధా నిధీయంతే తాసాం యత్ స్థవిష్ఠోధాతుః తన్మూత్రం భవతి యో మధ్యమః తల్లోహితం యోఽణిష్ఠ స్సప్రాణః" "ఇతి" ఇచట అన్నపానములవలన మాంస రక్తములు బుట్టుననెడి యథాశ్రుతార్థమును మాత్రము గ్రహించినచో రసమేదోఽస్థ్యాది ధాతువులను బుట్టించుటకు మనము వేరొక ప్రక్రియను జేయుచుంటిమా? లేదు. శ్రుతి గూడ "అన్నాత్పురుషః" అనగా సప్తధాతుమయుడగు పురుషుడు అన్నమువల్ల బుట్టుచున్నాడు అని నిర్విశేషముగా జెప్పుచున్నది. అందుచే యీ యన్నపానములే మిగిలిన రసాది ధాతువులనుగూడ బుట్టించక తప్పదు. కాన రక్తపదము రసాది ద్రవధాతువులకును, మాంసపదము మేదోఽస్థ్యాది స్థిరధాతువులకును ఉపలక్షకమని చెప్పవలెను. ఇదియే అన్న పరిణామ త్రైవిధ్య నిరూపణము.

## * పురుషోత్పత్తి హేతునిరూపణము *

అయితే అన్నపానములవలన పురుషుడు బుట్టునని శ్రుతులు జెప్పుచుండ స్మృతి కర్తలగు ఆత్రేయాదులు "వాతపిత్త శ్లేష్మాణ ఏవ దేహ సంభవ హేతవః" (సు.సూ.21అ.1సూ.) అనిజెప్పుటయు; దోషలక్షణ నిరుక్తిలో "ప్రకృత్యారంభకత్వే సతిదుష్టి కర్తృత్వం దోషస్య లక్షణం" అనెడి వచనముచే వాతపిత్తాదులు ప్రకృతికి (అనగా శరీరముయొక్క పిండోత్పత్తి కాలమందలి పిండమునకు) కారణసామగ్రి యనిచెప్పుటయు, "శ్రుతిస్మృత్యో ర్విరోధేతు శ్రుతిరేవ బలీయసీ" "బ్రహ్మ వేదాంగ మష్టాంగమాయుర్వేద మభాషత। పురోహితమతే తస్మాద్వర్తేత భిషగాత్మవాన్" (సు.సూ.34 యుక్తసేనీ యాధ్యాయం 8శ్లో) యనెడి వచనములను బట్టి యసంగతమని తోచుచుండ, సమాధానమెద్దియన:— సూర్యతేజస్సు కిరణములనే పేరుగలదై మైదానమంతటను బడినపుడు యెండయనియు అదియె గృహమధ్యమున ప్రతిఫలించినపుడు వెలుగు అని వ్యవహరింపబడెడి ప్రతిఫలనమనియు పేరొందుచున్నది. అట్లె పంచభూతములు అండాండములనెడి నామముగలవై చరాచర జగత్తనెడి బ్రహ్మాండమునకు సమష్టి కారణమై నపుడు మైదానమందు సూర్యరశ్మి యెండయను పేరొందినట్లు మహాభూతములనుపేరందుచున్నవి. అవియే పిండాండమనెడి ప్రత్యేక వ్యక్తికి వ్యష్టికారణమైనపుడు గృహమధ్యమున ప్రతిఫలించిన సూర్యరశ్మి ప్రతిఫలనమనిపేరొందినట్లు; పైజెప్పినరీతిని త్రివృత్కరణము జేయబడి వాత- పిత్త- శ్లేష్మములను పేరొందుచున్నవి. ఇట్లు నామాకృతులయందు భేదముగల కిరణములు అనగా యెండ- ప్రతిఫలనము అనునవి యెట్లు భిన్నపదార్థములు కానేరవో యట్లే భూత-మహాభూత - వాతాదిదోషత్రయములనునవిగూడ పరస్పర భిన్నపదార్థములు కాజాలవు. కాన వాత-పిత్త-శ్లేష్మములు శక్తులనిగాని, తమకుకారణములైన భూతములయందు లేని యమూర్తత్వము గలవనిగాని జెప్పవీలులేదు. ఈ విషయము ముందు చర్చింపబడును. ఈ తీరుగా చరాచరజగత్తునకు కారణమైన మహాభూతములు

జగదంతఃపాతియగు పిండాండకారణమైన అన్నమునకుగూడ వాతాది త్రికరూపముగా కారణములై యున్నవి. గాన అట్టి అన్నమువల్ల బుట్టెడి పురుషునకు వాత-పిత్త-శ్లేష్మములను బేరుతో కారణములగుచున్నవని వైద్యులు జెప్పెడిమాట శ్రుతివచనముతో విరోధింపజాలదు. అన్నమునకుగూడ మహాభూతములు వాతాది త్రికరూపముగా కారణములగుచున్న వనెడి మాటకు; వాత-పిత్త-శ్లేష్మములచే బుట్టెడి జ్వరమనెడి రోగము చరాచర జగత్తునంతటిని వ్యాపించియున్నదని జెప్పెడి యీ క్రింది శ్లోకములుగూడ యుపోద్బలకములు గానున్నవి.. "శ్లో॥ జ్వరోనరి నపాకలా లసహార్ద్ర తాపేశ్వరాః గజోష్ట్ర మహిషార్వ గోష్వధయథాక్రమం కీర్తితాః। తథేంద్రమద ఘోరకర్ష భకపక్షపాతాహ్వయాః సమస్త తిమిరాస భాంబుజ ఖగేష్వలర్క-శ్శునాం॥ మృగామయాఖ్యో మృగజాతి షూక్తః ప్రలేపకోఽ జావిషు చూర్ణకోఽన్నే। ఉక్లీష సంజ్ఞస్స రీసృపేషు పర్వాప్రసూనేషుచ నీలికాప్సు॥ కుంకుమకో గోధూమె జ్యోతిష్టు స్త్వోషధీషు సర్వాసు। గ్రంథికసంజ్ఞో ప్రతతావిత్యభిధానైః॥ జ్వరాఃకధితాః॥ ఇతి॥ (శార్ఙ్గధరత్రిశతి) ఇదియే పురుషోత్పత్తి హేతునిరూపణము.

## వాతాదిదోషముల అమూర్తత్వ నిరాసము.—

అవ:- ఈ వాతాదిదోషములు మూర్తములా? అమూర్తములా ? శక్తులా? ద్రవ్యములా? అందు వాతమనునది మనము బీల్చెడి గాలియేనా ? యనెడి సంశయములతో యూగిసలాడుచు బహు వైద్యశిఖామణులు వాదోపవాదముల జరుపుచున్నారు. ఈ విషయమై కాశీలో 3 యేండ్లక్రిందట గొప్పసభకూడ జరిగినది. కాని సిద్ధాంత మట్లనే నిలచినది. కాన నీవిషయము చర్చనీయమగుటచే యధామతి విమర్శించుచుంటిని:- వాతాదులు మూర్తములనియు, శక్తులు కావనియు, ద్రవ్యములే యనియు, అందు వాతమనునది మనము పీల్చెడి గాలియే యనియు జేయబోవు విమర్శచే తేటబడగలదు. ఎట్లన:— మూర్తమనగా "పరిచ్ఛిన్న పరిమాణవత్వం - క్రియావత్వంవా" అని వైశేషికానుయాయులు (తార్కికులు) చెప్పుచున్నారు.

"చరకస్త్వాహ వీర్యంతద్యేన యాక్రియతేక్రియా" (వా. సూ. 9 అ. 13. శ్లో) అనగా ద్రవ్యము తాను జేయదగిన పనిని దేనిసహాయముచే జేయుచున్నదో అట్టి పదార్థము ఆ ద్రవ్యమునకు వీర్యమని లేక శక్తియని అనబడును అని భావము. ఈ తీరుగా శక్తినిగూర్చిన చరకమతమును వాగ్భటు డనువదించుచున్నాడు. ఇక ద్రవ్యలక్షణమును "యత్రాశ్రితాః కర్మగుణాః కారణం సమవాయియత్, తద్ద్రవ్యం" అని చరకుడు జెప్పినాడు. అనగా గుణములు - కర్మలు - దేనినాశ్రయించి యుండునో అది ద్రవ్యమనబడునని భావము. కొందరు (ఇందుకరాదులు) మూర్తమనగా నేత్రేంద్రియ గ్రాహ్యారూపవత్త్వమని జెప్పుచున్నారు. వీరిమతమున కంటికి కానవచ్చునది మూర్తమని జెప్పినను వైశేషిక మతానుబోధియగు చరకుని మత

మునుబట్టి పరిమితమైన పరిమాణము గలిగియుండుట లేక క్రియలు గలిగియుండుట మూర్తత్వమనబడును. అట్టి మూర్తత్వము ముఖ్యముగా వాతాదిదోషత్రయములో రూపములేని వాతమున కున్నదా లేదాయని విచారించినచో రూపముగల మిగిలిన అగ్న్యుదక భూతములవల్ల బుట్టిన పిత్తశ్లేష్మముల విషయమై కైముత న్యాయమున విచారింప పనిలేదు. అనగా వాటి రెంటికిని మూర్తత్వము ప్రసిద్ధమని భావము. అయితే చరకుడు "ఏకమవకాశం మూర్తానామాహార వికారాణాం, ఏకం ద్రవాణాం, ఏకం పునర్వాత పిత్తశ్లేష్మణాం" (చ. వి. 2 అ. 3 సూ.) (వ్యా॥ మూర్తానాం = ఆస్యఖాద్యానాం, ద్రవాణాం = లేహ్యపేయానాం) అని యిట్లు భోజన ప్రకరణమున జెప్పెను. ఇందు మూర్తమనగా నోటితో నమలి తినదగినదని చరకుని అభిప్రాయమైనట్లు చక్రపాణి వ్రాయుచున్నాడు. ఇచట చరకుడు పరిమేయతను విడనాడి సాంద్రగుణ తారతమ్యమును మాత్రము వివక్షజేసి ఆ గుణమధికముగాగల ఖాద్యద్రవ్యములకు మూర్తములని సంజ్ఞజేసియున్నాడు. అందుచే జలాది ద్రవద్రవ్యములు-వాతాదిదోషములు - మూర్తములుగావని అర్థాపత్తిచే సిద్ధమగుట సత్యమైనను అయ్యది బాధకాంతర సద్భావముచే నప్రమాణమగుచున్నది గాన "గౌతమోయది సర్వజ్ఞః కణాదోనేతికాప్రమా" (అనగా గౌతముడు సర్వజ్ఞుడని జెప్పిన మాత్రమున కణాదుడుకాడని సమర్థింప వీలులేదని భావము) అనెడి నార్యోక్తికి తావు గలిగినది.

## * ప్రాకరణికార్థాఽప్రాధాన్యతా నిరూపణము *

అందుచే ప్రకరణానుగుణ్యముగా ఇతరశాస్త్రములకేదేని విరోధముండునట్లు జెప్పిననూ వాస్తవములో శాస్త్రములన్నియు పరస్పరము భేదింపక విషయ సమర్థనమును జేయుచునే యుండును. ఈ విషయమునే చక్రపాణి "ఇహేతి, ఇహప్రకరణే పంచేంద్రియాణి, తేన ప్రకరణాంతరేణ దర్శనాంతర పరిగ్రహేణ వక్ష్యమాణైకాదశేంద్రియాభిధానేన సమంనవిరోధః। యతః సర్వపారిషదమిదం శాస్త్రం, తేనాయుర్వేదా విరుద్ధవైశేషిక సాంఖ్యాదిదర్శన భేదేన విరుద్ధార్థోఽభిధాయమానో నపూర్వా, పరవిరోధమావహతీత్యర్థః" (చ. సూ. 8 అ. వ్యా) అని యిట్లు వచించెను. మరియు చక్రపాణి ఆత్రేయ భద్రకాప్యీయాధ్యాయమందు 9 సూత్రవ్యాఖ్యలో "తయోః మిశ్రీభావాత్" అనెడి మూలమునకు; తయోర్మిశ్రీభావాదితి, కర్మణో రమూర్తయోః మిశ్రీభావానుపపత్తౌ తదాధారయోః ద్రవ్యయోః మిశ్రీభావాదితి బోద్ధవ్యం" అని వ్యాఖ్యజేసినాడు. ఇచట అమూర్తములగు కర్మలకు మేళనాత్మకకర్మానుపపత్తిని జెప్పుటచే కర్మగలవి అమూర్తములుగావని స్పష్టమగుచున్నది. వాతపిత్తాదులకు గుణకర్మ విభాగము జేయబడెను గాన నయ్యవి యమూర్తములని జెప్పవీలులేదు.

అయితే యీ చరకుడే వేరొకచోట "రౌక్ష్యం లాఘవం వైశద్యం శైత్యం గతిర మూర్తత్వం చేతి వాయోరాత్మరూపాణి భవంతి" (చ. సూ. 20అ–12సూ.)

వ్యా॥ అమూర్తత్వం=అదృశ్యత్వం. అని వాతమునకు అమూర్తత్వమును కంఠోక్తిగా జెప్పియుండెను. కాన ఇది అర్థాపత్తి మాత్రమున సిద్ధమైన విషయముగాదనినచో సమాధానమెట్లనిన:—ఇచటగూడ చరకుడు పరిమేయతను విడనాడి యీ ప్రకరణానుగుణ్యముగా "ఏవం విధత్వాచ్చ కర్మణః స్వాలక్షణ్యామి దమస్య భవతి" "యదుపలభ్య తదవయవంవా విముక్త సందేహా వాతవికారమేవా ధ్యవస్యంతి కుశలాః" (అనగా శరీరమందు వాతముజేసెడి కర్మలయొక్క లక్షణములుగూడ యీ రౌక్ష్యాదిరూపముగనే యుండుటనుగాన యీ వాతమున కిరౌక్ష్యాదులే స్వరూపమని నిర్ణయించి; యీ స్వరూపమును అంతనుగాని కొంతనుగాని తెలుసుకొనిన ప్రాజ్ఞులు నిస్సందేహముగా వాతవ్యాధిని నిర్ణయింపగలుగుదురు) అని యిట్లు చెప్పుటచే వ్యాధినిర్ణయ ప్రకరణము ననుసరించి వాతము శరీరమందుజూపెడి లక్షణములలో అదృశ్యత్వముగూడ యొకటి యుండుటచేత దానినిమాత్రము వివక్షజేసి అట్టి అదృశ్యత్వము సూక్ష్మతాబోధక మగుటచే సూక్ష్మత్వముగల ద్రవ్యము అమూర్తమని జెప్పెడి "సర్వేధాస్థూలసూక్ష్మత్వా న్మూర్తశ్చ మూర్త ఉచ్యతే" (సూ. సి. 1 అ. 10 శ్లో) అనెడి వచనానుగుణ్యముగా వాతమమూర్తమని వచించెను.

ఈసౌక్ష్మ్యభావమునే బోధించెడి సాంద్రత్వ తారతమ్యము ననుసరించి భోజన ప్రకరణములోగూడ ఖాద్యద్రవ్యములు మూర్తములని చరకుడు వచించెను. ఇట్లు ప్రకరణానుగుణ్యముగా జెప్పెడిమాటలు లక్షణసంగతి కుపయోగింపవు. దీనినిబట్టి ఖాద్యత్వముగాని- దృశ్యత్వముగాని మూర్త లక్షణమని చరకుని యభిమతముగాదు. యేమన:- "సమవాయీతు నిశ్చేష్టః కారణంగుణః" (చ. సూ. 1 అ. 50సూ.) అనెడి గుణలక్షణ వ్యాఖ్యలో "క్రియాధారత్వయోగేభ్యో మూర్తద్రవ్యేభ్యో వ్యావృత్తిస్సిద్ధా"అని చక్రపాణి వ్రాసినాడు. అనగా నిశ్చేష్టపదము గుణపదమునకు విశేషణమగుటచే అనగా గుణము చేష్టనుండి నిర్గతమగుటచే (అనగా గుణము స్వతః చేష్టకాదు అనగా కర్మకాదు: చేష్టగల ద్రవ్యముగూడకాదు అని భావము) గుణమనునది క్రియలతో గూడిన మూర్త ద్రవ్యములకంటె భిన్నమైనదని భావము. ఇందువల్ల క్రియలులేని అనగా అమూర్తమగు ఆకాశాదులలో జేరునని అతివ్యాప్తి వచ్చుచుండగా దానిని వారించుటకై "సమవాయీ" అనెడి విశేషణమీయబడెను. అకారణములగు (కారణములుకానట్టి) సామాన్య - విశేష - సమవాయముల యందతివ్యాప్తి వారణకై "కారణం" అనెడి విశేషణ మీయబడెను అని యిట్లు గుణనిర్వచనము చేయబడెను. దీనినిబట్టి యీ విషయమందు చరకుడు వైశేషిక మతము ననుసరించెనని తెలియుచున్నది ఈ ప్రామాణ్యతనుగూర్చి చరకుడే అత్రేయ భద్రకాప్యీయాధ్యాయములో "గుణాగుణాశ్రయానోక్తాఃతస్మాద్ర సగుణాన్ భిషక్ విద్యాద్రసగుణాణా కర్తురభిప్రాయః పృథగ్విధః" అనియిట్లు (34 శ్లో) చెప్పినందున సంశయింప పనిలేదు. గాన యీ విషయములో చరకాభిమతముగూడ వైశేషికానురుద్ధమగుటకు సందియములేదు. సూర్య సిద్ధాంత వ్యాఖ్యాతగూడ మూర్తమనగా ఇయత్తావచ్ఛిన్న పరిమాణముగలదని పై శ్లోకమున వ్యాఖ్యజేసెను. సుశ్రుతుడు

జెప్పిన "అవ్యక్తోవ్యక్త కర్మాచ" (సు. ని 1 అ. 7 శ్లో) అనువచనమున అవ్యక్తః = అదృశ్యమూర్తిః అనగా కానరాని మూర్తిగలవాడు అని డల్హణుడు వ్యాఖ్య జేసెను. గాన ప్రకరణానుగుణ్యముగా అసాంద్రత్వ - అదృశ్యత్వాదులను బట్టి వాతమునకు అమూర్తత్వమును జెప్పినను లక్షణ సంగతిలో చరక - సుశ్రుత - చక్రపాణ్యాదుల యభిప్రాయము; జ్యోతిష - వైశేషికాదులకు విరుద్ధముగనే యున్నది. ఇదియే వాతాదిదోషముల యమూర్తత్వ నిరాసము.

## వాతమునకు క్రియావత్వ నిరూపణము

ఇక వాతము మూర్తమని చెప్పుటకు జెప్పబోవు వచనములను గమనింపుడు అందు క్రియావత్వ సూచక వచనము లెవ్వియన :— "వాగతిగంధనయోః" "తప సంతాపే" "శ్లిష ఆశ్లేషె" ఏతేషాంకృ ద్విహితైః ప్రత్యయైః వాతః-పిత్తం-శ్లేష్మే తిచరూపాణిభవంతి" (సు. సూ. 21అ.5సూ.) అనగా వాతము నడచునని-పిత్తము తపింపజేయునని - శ్లేష్మము చుట్టుకొనునని లేక అంటుకొనునని అర్థము. ఇచట వాతముని పేరుచెప్పిన మాత్రముననే క్రియ గలదని యర్థమగుచున్నది. శ్లో॥ విసర్గా దాన విక్షేపైః సోమ సూర్యా నిలాయథా। ధారయంతి జగద్దేహం కఫ పిత్తా నిలా స్తథా" (సు. సూ. 21అ 8 శ్లో) వ్యా॥ విక్షేపః=శీతోష్ణాదీనాం వివిధ ప్రకారేణ ప్రేరణం. ఇచట వాతమునకు విక్షేపణ రూపమగు క్రియగలదని బోధయగుచున్నది. "తత్రప్రస్పందన-ఉద్వహన-పూరణ-వివేక-ధారణ-లక్షణోవాయుః పంచధా ప్రవిభక్తః శరీరం ధారయతి" (సు.సూ. 15అ. 4 శ్లో) వ్యా॥ ప్రస్పందనం=శరీరస్యచలనం, ఇదం వ్యానస్యకర్మ: ఉద్వహనం = ఇంద్రియార్థానాం ధారణం, ఉదానకర్మ; పూరణం=ఆహారేణ పూరణం, ప్రాణస్యకర్మ; వివేకః=రసమూత్ర పురీషాణాం పృథక్కరణం) సమానస్యకర్మ; ధారణం=శుక్రమూత్రా దీనాం వేగకాలే కర్మకరణం అవేగ కాలే ధారణం। అపానకర్మ: అన్యేతు సామాన్య స్సర్వ వాయూనాం ప్రస్పందనాది కర్మాహుః। ప్రస్పందనం=శ్వాస ప్రశ్వాసాది భావేనచలనం; ఉద్వహనం=దోష ధాతు మలానాం ఇత ఇతోనయనం; పూరణం=ఆహార రసాదీనాం స్వేషు స్వేష్వాశయేషు నయనం; అని యిట్లు వాతముయొక్క భేదములగు వ్యానోదాన ప్రాణ సమాన అపానములకు ప్రత్యేకముగా చలనము, లేక ఉచ్ఛ్వాస నిశ్వాసలు దీయుట—ఇంద్రియార్థగ్రహణము, లేక దోషములు, ధాతువులు, మలములు అనువాటిని వాటివాటి స్థలములకు జేర్చుట—ఆహారముతో పొట్టను నింపుట, లేక ఆహార రసాదులను తత్తత్తమ స్థానములకు జేర్చుట—రసమూత్ర పురీషములను విడదీయుట—శుక్రము, మూత్రము మొ॥ వాటిని అవసరమునుబట్టి వదలుట లేక ధరించుట యనెడి పంచకర్మలు జెప్పబడినవి. "ప్రాణాపాన సమానైస్తు సర్వతః పవనైస్త్రిభిః। ధ్మాయతే పాల్యతే చాపిస్వే స్వేస్థానే వ్యవస్థితైః" (సు. సూ. 35అ. 28 శ్లో) ఇచట ప్రాణాది వాయువులకు ధ్మానక్రియ (అనగా శరీరమును పొంగునట్లు

జేయుట) గలదని జెప్పబడెను. మరియు, "ప్రాణో వ్యణో త్వ్యదానాదీన్ ప్రాణం వ్యణ్వాం తితేపిచ" (చ. చి. 28 అ. 195 శ్లో) వ్యా॥ యద్యపిచెహా వాయోః అమూర్తత్వం వాత కలాకలీ యే ప్రోక్తం తథా పీదం అమూర్తత్వం అకఠిన వాచకం నత్వవయవ ప్రతిషేధకం। తెనవాయోః వాయ్వాం తరేణ గతిహననరూప మావరణ ముపపన్నమేవ। దృష్టాచ వాయునా వాయ్వాంతరేణ ఉపహతేన వాతకుండలికా బహిరపి। తేన ఉపపన్న మావరణం వాతానాం పరస్పరం "ఇతి" అనగా వాతకలాకలీయమున వాత మమూర్తమని జెప్పబడినను అచటి అమూర్త శబ్దమునకు కాఠిన్యము లేనిదని అర్థముగాని అవయవము లేనిదనికాదు. గనుక యొక వాతము యొక్క గమనమును వేరొక వాయువు నిరోధింపగలుగుచున్నది. దానినే ఆవరణ మందురు. అట్టి ఆవరణను మనము బాహ్యావాయువునందుగూడ చూచుచుంటిమి. దానినె వాతకుండలి (సుడిగాలి) యని యనుచుంటిమి. గనుక వాయువులు యొక దాని నొకటి ఆవరించుట సంభవమని గ్రహించవలెను. అని యిట్లు చక్రపాణి వ్యాఖ్య జేసెను. ఇందులో వాతము క్రియగలది యనేగాక సావయవమనియు గూడ తెలియుచున్నది. సావయవ ద్రవ్యము యెప్పటికిన్నీ పరిచ్ఛిన్న పరిమాణము గలదిగనేయుండును.

ఇట్టి అనేకవచనములచే వాతమునకు క్రియావత్త్వము జెప్పబడెను. ఇదియే వాతమునకు క్రియావత్త్వ నిరూపణము.

## వాతమునకు పరిచ్ఛిన్న పరిమాణవత్త్వ నిరూపణము; లేక వాతమూర్తత్వోపపత్తి

వాతమునకు పరిచ్ఛిన్న పరిమాణవత్త్వముగూడ గలదు. అది యెట్లన :— "స్రోతస్సుమేదోరుద్ధేషు వాయుఃకోష్ఠే విశేషతః। చరన్ ప్రజ్వాలయత్యగ్నిం" (వా. సూ. 14 అ. 32 శ్లో. వ్యా.) అనగా వాతము స్రోతస్సులలో మేదస్సుచే అడ్డగింపబడి కోష్ఠమందె సంచరించుచూ అగ్నిని బెంచునని యర్థము. ఇచట వాతము బోలుగలిగిన స్రోతస్సులలో సంచరింపబోవ వాటి మూతులయందు మేదస్సుకార్కు (బిరడా) వలె యడ్డుపడినతోడనే వాటియందు వాతమునకు ప్రవేశము లేనట్లు బోధపడుచున్నది, అనగా కోష్ఠాకారాకారితమగు వాతము స్రోతోమార్గము లందు సంచరింపబోవ మేదస్సుచే స్రోతోమార్గము నిరోధింపబడ టచేత తలుపులచే నిరోధింపబడిన కుల్యలయందు తటాకోదకమునకూవలె ఆ వాతమునకు ఆ స్రోతస్సుల యందు ప్రవేశము కలుగలేదని తాత్పర్యము. ఇట్లు ప్రవేశము లేకుండుట పరిమాణము గలదానికే సంభవించును. ద్రవ్యమున కిట్టి పరిమాణముండుటయే మూర్తత్వమనబడును. మరియు "(సోలసః) అత్యర్థదుష్టాస్తు దోషాదుష్టామబద్ధఖాః" (వా.సూ. 8 అ. 12 శ్లో.) అనెడి వచనముగూడ యీ అర్థమునే జెప్పుచున్నది. ఇచట దుష్టామబద్ధఖాః అనగా దుష్టమైన ఆమముచే నిరోధింపబడిన (మూయబడిన) బెజ్జములు గలవి స్రోతస్సులు అని భావము. మరియు ("ఏకంపునర్వాతపిత్త శ్లేష్మణాం"చ. ని.

2 అ. 3 సూ.)అనుచోట ఆమాశయమందలి అవకాశమును వాతాదుల సంచారము కొరకు మిగల్చియుంచమని చెప్పియుండుటచే పరిమాణములేనివాటికి అవకాశాపేక్ష యుండదుగాన వాతాదులకు పరిమాణమున్నట్లు తెలియుచున్నది. ఈప్రకార మనేక ప్రమాణములచే వాతమునకు పరిచ్ఛిన్న పరిమాణవత్త్వము సిద్ధమగును. ఇట్లు వాతమునకు, క్రియావత్త్వ-పరిచ్ఛిన్న పరిమాణవత్త్వములు గలదగుటచే మూర్తమని స్పష్టమగుచున్నది. ఇదియే వాతాది మూర్తత్వోపపత్తి.

## వాతమూర్తత్వమునకు తార్కికమతము

ఇంతియగాక తార్కికులు(వైశేషికులు)గూడ "పృథివ్యప్తేజోవాయుమనాంసి మూర్తాని" అని కంఠోక్తిగా వాతము మూర్తద్రవ్యమని వచించియున్నారు.

## బాహ్యవాతమే దోషవాతమనుట కుపపత్తి

అయితే తార్కికులుజెప్పిన వాత మీదోషవాతమే యనుటకుగూడ వారే వేరొకచోట "శరీరాంతస్సంచారీ వాయుః ప్రాణశ్చ, సచైకోప్యుపాధిభేదా త్ప్రాణా పానాది సంజ్ఞాంలభతే" అని యిట్లుజెప్పిరి. అనగా బాహ్యవాయువే శరీరములో స్థానభేదమునుబట్టి కార్యభేదములను బుట్టించుచూ ప్రాణాపానాది సంజ్ఞల నొందు చున్నదని తాత్పర్యము. మరియు "అతఏవ వాత పిత్త శ్లేష్మాణః స్థానవిశేషే ప్రకుపితాః వ్యాధివిశేషా నభినిర్వర్తయంత్యగ్నివేశ" (చ. సూ. 28 అ. 5 సూ.) అనగా వాతాదులు శరీరమందలి స్థానవిశేషముచే యంత్రితములై వ్యాధి విశేషము లను బుట్టించుచున్నవని భావము. ఇది యెట్లన; వకే విద్యుత్తరంగము దీపగోళమున ప్రవేశించి దీపముగను, వ్యజనమందు ప్రవేశించి విసనికర్రవలెను, తిరగటి యంత్ర మున ప్రవేశించి పిండిని విసరునదిగను ఇట్లనేక క్రియల నెట్లు జేయుచున్నదో అట్లే వాయువుగూడ శరీరమందలి నానాస్థానముల నాశ్రయించి నానాకార్యముల జేయు చున్నది. బాహ్యమందుగూడ యంత్రభేదముచే వాతము భిన్నకార్యముల జేయు చున్నదనుటకు చిన్న యుదాహరణమును జూపుచుంటిని. యెట్లన:— మనము కుంపటియందలి నిప్పు నూదుటకు మననోటినుండి గాలిని వదలుచుంటిమి; అపుడు నోరావలించి యూదినచో నిప్పు మండజాలదు; నోటిని సన్నని రంధ్రముండునట్లు మూసి యూదినచో నిప్పు బాగుగా ప్రజ్వలించును. ఇచట నోటిని వెంబగా జేసి నపుడు విరివిగా బోవుచున్న వాతము మూసినపుడు సన్నగా బోవును; అంతియగాని పరిమాణాదులలో మార్పేమియూ లేదు. లేకున్ననూ యంత్రణ బలముచే కార్య భేదము గలిగినది ఇట్లే ఆవిరియంత్రము (రైలు)లోని ఆవిరిగూడ యంత్రముచే యంత్రణ చేయబడి బాగుగా బరువును లాగుచున్నది. లేనిచో (యంత్రణము లేనిచో) ఆపనిని జేయజాలదు. అట్లే మనశరీరములో బాహ్యమందలి వాతమె ప్రవేశించి అచటి యంత్రణ విశేషముచే కార్యవిశేషములను గల్గించుచున్నది. గాన

"సచైకోప్యుపాధి భేదాత్ప్రాణాపానాది సంజ్ఞాంలభతే" అనెడి తార్కిక వచనము సమంజసమైనదియే. ఇట్లు బాహ్యావాతమె దోషవాతమనుట కుపపత్తి జూపబడెను.

* పరకాయప్రవేశ స్వరూపము.

అట్లైనచో శవమందుగూడ మనశరీరమందలి అవయవములన్నియు యుంపుట యొకానొకప్పుడు సంభవించునుగదా! అట్టి సమయమున బాహ్యావాతమును దానిలో ప్రవేశబెట్టి యాశవమును యేల బ్రతికింపజాలము? అని ప్రశ్నింపవచ్చును. అది సత్యమే. అయితే వాతము జడమగుటచే చేతనాధాతుసహాయము లేనిదే స్వతంత్రముగా పనిచేయజాలదు. ఈవిషయమును అనగా వాతముయొక్క జడత్వమును చేతనాధాతుస్వరూపాదులను క్రింద వివరించుచుంటిమి. యెట్లన:- ఈ బాహ్యావాతము "అష్టౌప్రకృతయః, షోడశవికారాః, ప్రకృతి వికృత్యు త్తీర్ణోనిర్లేపః ప్రత్యగూపః పురుష ఇతి పంచవింశతిర్గణః" అని సాంఖ్యులచే జెప్పబడిన 25 తత్వముల యందలి వికార గణములో యొకటై యున్నది. ఇందు పురుషుడు వినాగా మిగిలిన 24 తత్వములలో మొదటిదగు మూల ప్రకృతికి "వత్సవివృద్ధి నిమిత్తం క్షీరస్య యథాప్రవృత్తి రజ్ఞస్య। పురుషవిమోక్ష నిమిత్తం తథాప్రవృత్తిః ప్రధానస్య" (సాం. కా. 57.) అని సాంఖ్యులుగూడ జడత్వము నంగీకరించిరి. అట్టి జడమగు మూల ప్రకృతియొక్క వికార గణముగూడ జడమనుటకు సందియములేదుగదా! గాన పైజెప్పిన వాతము జడమైనది. అట్టి జడపదార్థము, చేతన సహాయము లేనిదే కార్యమును జేయగలుగునని సాంఖ్యులు "వత్సవివృద్ధినిమిత్తం" ఇత్యాదియుక్తులచే జెప్పినను వేదాంతులు "రచనానుపపత్తేశ్చనాను నానుమానం" (బ్ర. సూ. 2-2-1.) భా॥...రచనానుపపత్తేశ్చ హేతోః నాచేతనంజగత్కారణమను మాతవ్యం భవతి। "ప్రవృత్తేశ్చ" (బ్ర. సూ. 2-2-2) భా॥...ప్రవృత్త్యనుపపత్తేరపిహేతోః నాచేతనం జగత్కారణమను మాతవ్యంభవతి। "పయోంబువచ్చేత్తత్రాపి" (బ్ర. సూ. 2.2.3) భా॥...యత్తస్త్రాపి పయోంబునోశ్చేతనా ధిష్ఠితయోరేవ ప్రవృత్తిరిత్యనుమిమీమహే।ఉభయవాదిప్రసిద్ధే రథాదావచేతనే కేవలె ప్రవృత్త్యదర్శనాత్।శాస్త్రంచ; "యోప్సుతిష్ఠన్ యోఽపోంతరోయ మయతి। ఏతస్యవా అక్షరస్య ప్రశాసనెగార్గి। ప్రాచ్యోఽన్యానద్యఃస్యందంత" ఇత్యేవంజాతీయకం సమస్తస్య లోకపరిస్పందితస్యేశ్వరాధిష్ఠితాంశ్రావయతి।" ఇట్లు అనగా అచేతనమైన రథాది ద్రవ్యజాతమునకు చేతన సంబంధములేనిచో పరిస్పందితము (కదలిక) మొదలగు వ్యాపారము లెట్లుగలుగు చుండుటలేదో యట్లే సాంఖ్యులు జెప్పిన వత్సవివృద్ధి నిమిత్తమై క్షీరమునకు ప్రవృత్తి (దూడ పెంపుకొరకు పాలు చేపొచ్చుట) గూడ ఆవునకు దూడపై యుండెడి వాత్సల్యము - దూడ ఆచూషణము జేయుట (పీల్చుట) యనెడి చేతన ధర్మములసహాయముననే జరుగుచున్నది గాన జడమగు ప్రకృతి చేతనమగు బ్రహ్మపరార్థము యొక్క సహాయము లేనిదే జగద్రచన జేయజాలదు; అని యిట్లు సయుక్తికముగా సాంఖ్యమతమును నిరసించిరి. ఇచట కార్యములను జేయుటలో జడపదార్థమునకు

చేతన సహాయ మక్కరలేదని సాంఖ్యులున్ను; కావలెనని వేదాంతులున్ను తమతమ మతములను జూపినారు చరకుడు, తన సూత్రస్థానములో, పీలువులు జగత్కారణ మని జెప్పెడి వైశేషిక మతానుసారముగా పదార్థ విభజన జేసినను, వేదాంతమతా నుసరణముగా "విద్యాత్స్వాభావికం షణ్ణాంధాతూనాం యత్స్వలక్షణం" (చ.సూ.॥ 11.అ.12.శ్లో.) "షడ్ధాతు మయఃపురుషః" అనగా పృథివ్యాది పంచమహాభూతములు- చేతనాధాతువు- అనెడి 6 ధాతువుల సమూహామే పురుషుడనియు; సుశ్రుతుడు, తన శారీరస్థానములో ప్రథమాధ్యాయమున తత్త్వముల విషయమై సాంఖ్యమతమును "యావదాదేయం తావదాదాయ నివర్తతే" యను న్యాయముచే గ్రహించినను సూత్రస్థానమున "అస్మిన్ శాస్త్రే పంచమహాభూత శారీరసమవాయః పురుష ఇత్యుచ్యతే। తస్మిన్ క్రియాసోధిష్ఠానం" (సు. సూ. 1 అ. 21 సూ.) అని అనగా పృథివ్యాది పంచమహాభూతములు- శారీర (జీవుడు) అను వాటిసమూహామె పురుషుడు అనబడును. వానియందె చికిత్స జేయవలెను అని యిట్లుజెప్పెను. వీటినిబట్టి చేతన సహాయములేని జడమునకు కార్యకరణ సామర్థ్యములేదని సిద్ధమగుచున్నది. ఇట్లుండ జడమగు పాంచభౌతికమైన శవములో పంచభూతాంతఃపాతియగు వాతమును మనము ప్రవేశపెట్టినను యిచట చేతనాధాతువు లేనందున యీ శవము తిరుగా బ్రతుకజాలదు. ఈ చేతనాధాతువును గూడ ప్రవేశపెట్టుశక్తి మనకు గలిగినపుడు అట్లుచేయుట యేదికలదో దానినే మన పూర్వులు పరకాయ ప్రవేశమనిరి.

## చేతనాధాతు నిరూపణము

చేతనాధాతువనగా జీవుడు అనగా బుద్ధియందు ప్రతిబింబించిన చైతన్యము. అయితే యీ చైతన్యమునెగదా! బ్రహ్మ- నారాయణ - మహేశ్వర - ఇంద్ర- ఆత్మ- ఇత్యాది పదములచే నుపనిషత్తులు కొనియాడుచున్నవి. "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణఃస్థితః" "తత్సృష్ట్వాతి దేవానుప్రావిసత్। తదనుప్రవిశ్య సచ్చత్యచ్చాభవత్" ఇత్యాది శ్రుతులనుబట్టి యీ చైతన్యము సర్వాంతర్యామి యని తెలియుచున్నదిగదా! అట్టిచైతన్యము బుద్ధియందు మాత్రము ప్రతిబింబించి వేరొకచోట ప్రతిబింబించకుండునా? అట్లు అంతటను ప్రతిబింబించినచో బుద్ధియందు మాత్రము ప్రతిబింబించిన చైతన్యమునకు జీవుడను సంజ్ఞకలుగుటకు కారణమేమి? యని యడుగవచ్చును.

సమాధాన మెద్దియనిన :— యొక పెద్ద మైదాన మంతటను యెండ వ్యాపించి యున్నను యెచ్చట శుద్ధమగు రత్నము లేక అద్దము యుండునో యచటనే సూర్య బింబము ప్రతి బింబించునుగాని మట్టి యందు ప్రతి బింబించదు. ఈ యర్థమునే "ప్రభవతి శుచిర్బింబో ద్గ్రాహేమణిర్న మృదాంచయః" (ఉత్తర రామ చరిత్ర) యను నార్యోక్తి జెప్పుచున్నది. ఇట్లే చైతన్యము అంతటను వ్యాపించి యున్నను శుద్ధమగు బుద్ధి తత్వ మందుమాత్రము ప్రతి బింబించును. అగ్నికి బొగ్గు

లు యెట్లు వాహకములు గానున్నవో యట్లే బుద్ధి తత్త్వమునకు వాయుపరమాణువు వాహకముగానున్నది అనగా అగ్నితో గూడిన బొగ్గులు నిప్పులనబడు చున్నవి. అట్లే బుద్ధితో గూడిన వాయు పరమాణువులు బాద్ధములు లేక ఉపాధులు అనబడు చున్నవి. వాటి యందు సర్వాంతర్యామి యగు చైతన్యము ప్రతి బింబించుచునుగాన ఆమూడింటికి అనగా వాయు పరమాణువు - దానినాశ్రయించిన బుద్ధి - దాని యందు ప్రతిబింబించిన చైతన్యము యీమూడింటికి కూటి మనిపేరు ఇట్టి కూటము కూడ సర్వ ప్రపంచాంతఃపాతియె గాన "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" అనెడి శ్రుతిని బట్టి వానియందు (కూటమందు) గూడ చైతన్య మంతర్యామియై యున్నది. అట్టి చైతన్యమునే కూటస్థుడను చున్నారు ఇట్టి యీ నాల్గింటి సముదాయమునే జీవుడని లేక చేతనా ధాతునని వ్యవహ రించుచున్నారు. ఇట్టి చేతనా ధాతువును యోగమహిమ చేత మన కిచ్ఛవచ్చిన ద్రవ్యమందు ప్రవేశ పెట్టగలిగినచో వారిని పరకాయ ప్రవేశజ్ఞులందురు. అట్లు పరకాయ ప్రవేశమును శంకరాదులు చేసినట్లు మనము విను చుంటిమి. ఇదియే పరకాయ ప్రవేశ స్వరూప నిరూపణము.

## వాస్తవ జీవ నిరూపణము.

ఇచ్చట కర్మాను బద్ధత్వము జీవునకు ముఖ్యలక్షణముగాన జీవపద వాచ్యమగు వాయ్వాది చతుష్టయములో వాయుబుద్ధులు జడములగుటచేతను, చైతన్యము నిరంజనత్వాది ధర్మములు గలదగుటచేతను, కర్మఫలముల ననుభవించుటకు యుక్తమైన అనగా కర్మాను బద్ధత్వముగల ప్రతిబింబిత చైతన్యమును మాత్రము జీవుడను చున్నారు. ఉక్తంచ "బుద్ధౌ ప్రతి ఫలిత చైతన్యం జీవః" ఇతి, కర్మానుబద్ధత్వము జీవునకెట్లు సంఘటించుననగా వెన్నెలలో బెట్టిన యనేక జలఘటములలో ప్రతిబింబించిన యనేక చంద్రబింబములకే చాంచల్యాద్యనేక క్రియా ఫలములగు చలనాదులయనుభవము గలదు ; అట్టి యనుభవము జల-ఘటములు- జడస్థానీయములు గాన వానికుండదు; బింబస్థానీయమగు చంద్రునకు యుండుటగూడ ప్రత్యక్షము గాదు. అట్లే చైతన్య ప్రతి బింబములకే (జీవులకే) కర్మానుబద్ధత్వ ముండునుగాని అనగా కర్మఫలములయందనుభవము యుండునుగాని నిరంజనత్వాది గుణవిశిష్ట చైతన్యమున కుండదు గాన కర్మాను బద్ధత్వము ప్రతి బింబ రూపుడగు జీవునకే గలదు. అందుచే తావన్మాత్రమునకే జీవుడను సంజ్ఞజేయుటగూడ సమంజసము గనేయున్నది. ఇదియే వాస్తవ జీవనిరూపణము.

## జీవులనానాత్వ నిరూపణము

ఇట్టి జీవులకుండు భేదములనుబట్టి యనగా వాయుపరమాణు- బుద్ధులయందలి బుద్ధివిశేషమునుబట్టి న్యూనాధిక భావము- నానాత్వములు సంభవించినవి. సత్వ-రజ- స్తమస్సులనెడి గుణత్రయ వైశిష్ట్య భేదముచే విశేషములు సంభవించుచున్నవి.

గాన సత్త్వప్రధానబుద్ధిప్రతిఫలిత చైతన్యములు దేవతలనియు అనగా ఉత్తమసృష్టి యనియు, తమఃప్రధానబుద్ధిప్రతిఫలిత చైతన్యములు వృక్షాది స్థావరములనియు అనగా అధమసృష్టియనియు, రజఃప్రధానబుద్ధి ప్రతిఫలిత చైతన్యములు మనుష్యాది మధ్యమసృష్టియనియు జెప్పబడుచున్నది. ఇట్టి సృష్టిరచన యుండుటచే పై జెప్పిన భిన్నభిన్నోపాధులయందు ప్రతిబింబించిన ప్రతిబింబములు భిన్నభిన్న కార్యకరణ మందు సామర్థ్యముగలవగుచున్నవి. ఇదియే జీవుల నానాత్వ నిరూపణము.

## అభిమానిదేవతానిరూపణము

ఇట్టి ప్రతిబింబములనె ఆయా యుపాధులకు అభిమాని దేవతలని గూడ జెప్పుచున్నారు. ఉక్తంచ, "అభిమానివ్యపదేశస్తు విశేషానుగతిభ్యాం" (బ్ర. సూ. 2—1—5) అస్యాయమర్థః, వాక్చక్షురాదీంద్రియాణాం పరస్పర కలహ శ్రుతిషు "మృదబ్రవీత్" "ఆపోఽబ్రువన్" ఇత్యాదిశ్రుతిషు చాభిమాని దేవతావ్యపదిశ్యంతే. ఇంద్రియ సంవాద వాక్య స్యాదావేవాహ ఏతా దేవతా ఇతి దేవతా శబ్దేన విశేషితత్వాత్, అన్యత్రచ "అగ్నిర్వాగ్భూత్వాముఖం ప్రావిశత్, వాయుః ప్రాణోభూత్వా నాసికే ప్రావిశత్, ఆదిత్యశ్చక్షుర్భూత్వాఽక్షిణీ ప్రావిశత్" ఇత్యాదినా సర్వేషింద్రియేషు దేవతానుగతి శ్రవణాత్। వనస్పతి మూలక జుహూపభృదాద్యచేతన ద్రవ్యేషు అభిమానినీనాం విగ్రహవతీనాం చేతనానాం అభ్యుపగమేపినబాధః। సంతిహి సర్వేషు వస్తుషు అభిమానిదేవతాః। అతఏవ శ్రూయతే "అంతరిక్షదేవత్యాః ఖలువై పశవః" "యజమాన దేవత్యా వై జుహూః" "భ్రాతృవ్యదేవత్యోపభృత్" ఇతి। అత్రదృశ్యమానా అంతరిక్ష యజమాన భ్రాతృవ్యా నవివక్షితాః। కింతు తదభిమానిదేవతాః॥ ఏవంచసత్యభిమానినీభిః సహాభేదవివక్షయా "వాయవస్థోపాయవస్థ" "జుహ్వేహ్యగ్నిస్త్వాహ్వయతి దేవ యజ్యాయా ఉపభృదేహి దేవస్త్వా సవితాహ్వయతి" ఇత్యాదని చేతనోచితాని సంబోధనాన్యుపపద్యంతే" (విద్యారణ్యభాష్యం. కాం 1- ప్ర 1- అ 12.) (అనగా ఇంద్రియ సంవాతవాక్యములలో ఇవి దేవతలని వేదములు జెప్పుటచేతనున్ను, "అగ్నిరూపము నంది ముఖమునందు ప్రవేశించెను", వాయువు ప్రాణమై నాసికలలో ప్రవేశించెను, ఆదిత్యుడు చక్షుస్సై నేత్రములయందు ప్రవేశించెను" ఈ మొదలగు వాక్యములచే ఇంద్రియములకు దేవతానుగతిని అనగా ముఖాదులకు దేవతలు అనుస్యూతముగా యున్నట్లు చెప్పుటచేతనున్ను చెట్లువల్ల బుట్టిన అనగా కర్రలతో జేయుబడిన జుహూ-ఉపభృత్ - మొదలగు అచేతనములైన యాగీయోపకరణములయందు చేతనములైన విగ్రహములుగల అభిమానిదేవతలున్నారని జెప్పుట బాధకముగాదు. గనుక సర్వవస్తువులయందున్ను అభిమానిదేవతలుగలరు. వేదముగూడ, పశువులకు అంతరిక్షమధిదేవత, జుహూవునకు యజమానుడధిదేవత, ఉపభృత్తునకు భ్రాతృవ్యుడధిదేవత, అని యిట్లు చెప్పుచున్నది.

ఇచట (యీదేవతా ప్రకరణమున) కనబడుచుండెడి అంతరిక్షము- యజమానుడు - భ్రాతృవ్యుడు- అనువారు వివక్షింపబడుటలేదు కాని వాటియందలి అభిమానిదేవతలు వివక్షింపబడుచున్నవి. ఇట్లుండుటచే అభిమానిదేవతలతో అచేతనద్రవ్యముల కభేదవివక్షజేసి "ఓవాయువులారా! ఓ ఉపభృత్తా!" ఈమొదలగు చేతనోచిత సంబోధనలు అచేతన ద్రవ్యములకు బుట్టుట యుక్తముగనె యున్నది అని భావము,) ఇట్టి అభేద వివక్ష జేసియే "వాయురిహదేవతా రూపోభిప్రేతః। తేన, తస్యభూతరూప చతుర్యుగాంతకరానిల కరణలింగమవిరుద్ధం। ఏవం యదన్యదప్యనుపపద్యమానం వాయోస్తదపి దేవతారూపత్వే నైవ సమాధేయం" (చ. సూ. 12 అ. 8 సూ. వ్యా.) అనియిట్లు చక్రపాణి చెప్పియున్నాడు. అనగా బాహ్యమగు వాతము (జడమగుటచే) కార్యములను జేయుటలో యనుపపత్తి సంభవించినపుడు దానికి యధిదేవత యున్నదని జ్ఞాపకము తెచ్చుకొనుడని తాత్పర్యము. ఇదియే అభిమాని దేవతా నిరూపణము. ఇట్లు వాతమునకు అమూర్తత్వము నిరూపింపబడెను.

## వాతమునకు ద్రవ్యత్వ నిరూపణము.

ఇక వాతమునకు ద్రవ్యత్వ సాధన మెట్లన:— "పురీషక్షయె హృదయపార్శ్వపీడా సశబ్దస్యచవాయోః ఊర్ధ్వ గమనం కుక్షౌ సంచరణంచ" (సు. సూ. 15 అ. 15 సూ.) అనగా మలము క్షీణించినపుడు హృదయము ప్రక్కలు వీనియందు పీడగలుగును, వాయువు ధ్వనితో గూడి పొట్టలో పైభాగమున సంచరించునని భావము. ఇచట వాతము ధ్వని యుక్తమై సంచరించుట మూర్తద్రవ్యధర్మము. ఏమన:— ధ్వనియనునది గుణము; అట్టి గుణమునకు వాతము వాహకమగుచున్నది. కాన వాతగుణమైనచో గుణమునకు వేరొక గుణము వాహకము కానేరదు గాన వాతము ద్రవ్యమనక తీరదు. కనుకనే సంచార రూపక్రియకు గూడ నాశ్రయమైనది. ఉక్తంచ.-" ఖాదిన్యాత్మా మనఃకాలో దిశశ్చద్రవ్య సంగ్రహః" యత్రాశ్రితాః కర్మగుణాః కారణం సమవాయియత్। తద్ద్రవ్యం" అని యిట్లు అనగా ఆకాశాది పంచభూతములు - ఆత్మ - మనస్సు - కాలము - దిక్కులు - అనునది ద్రవ్యత్వ వ్యాప్య ధర్మములుగలవనియు; కర్మలు - గుణములు వాని నాశ్రయించి యుండుట ద్రవ్యలక్షణమనియు చరకుడు వచించియున్నాడు. ఇట్లు వాతమునకు ద్రవ్యత్వము సిద్ధించినది.

## వాతము శక్తి కాదని నిరూపణము

ఇకవాతము శక్తి కాదని నిరూపించుట యెట్లన:— "అచింత్య వీర్యః (సు. ని. 1 అ. 8 శ్లో) అని చెప్పుటచే వాతము వీర్య (అనగాశక్తి) రూపముగాదని తెలియుచున్నది. యేమన:—శక్తి వేరొకశక్తినాశ్రయించుట యసంభవము. దీనికి డల్హణుడు వ్యాఖ్య జేయుటలో అచిత్యం వీర్యః- అచింత్యాశక్తిః - సాచాస్య (వాయోః) శక్తిః శరీరె దోష మూత్ర పురీషాది విభాగావయవాది సంస్థాన కారణం......

బహిస్తు సంచరతో ధరణీ ధారణాదిభిః'' అని చెప్పియున్నారు. అనగా వాతము శరీరమునందు దోషాది విభాగములను జేయుటచేతనున్ను; బాహ్యమందు భూగోళా దులను ధరించుటచేతనున్ను అచింత్యశక్తి గలదని భావము. శక్తిగలదని యనుటచే వాతముకంటె శక్తియనునది భిన్నమనెడియర్థము గోచరించునుగదా! గాన వాతము శక్తికాదు. ఇట్లు వాతము శక్తిభిన్నమని నిరూపింపబడెను.

## శక్తిస్వరూప నిరూపణము

అయితే శక్తియన నేమో తెలియుటగూడ మనకిచట కొంతవరకవసరము; గాన సంక్షేపముగా వివరించెద. యెట్లన:- "చరకస్త్వాహ వీర్యంత ద్యేనయా క్రియ తేక్రియా'' అనెడి సూత్రమందలి వీర్యపదము శక్తినే బోధించుచున్నది. ఇట్టి శక్తి యను పదార్థము లేనిచో యే ద్రవ్యమున్నూ- యే కార్యముహూ జేయజాలదు. ఈ విషయమును శంకరులువారుగూడ "శివశ్శక్త్యాయుక్తో యదిభవతిశక్తః ప్రభవితుం। నచేదేవం దేవోనఖలు కుశలస్స్పందితుమపి'' అని యిట్లు వచించిరి. దీనిసిబట్టి ప్రతి ద్రవ్యమును శక్తియను పదార్థ మాశ్రయించి యున్నదని తెలియుచున్నది. అపుడు ద్రవ్యము నాశ్రయించియున్న శబ్ద స్పర్శాది గుణములకున్ను యీ శక్తిపదార్థము నకున్ను ఆశ్రయిత్వ సాజాత్య ముండుటచే యీ శక్తినిగూడ గుణమనరాదా? యని సంశయము గలుగవచ్చును. అదినిజమె. అయితే శబ్దాదిగుణములకున్ను యీ శక్తి కిన్ని భేద మేమన:- అచేతనములగు ఆకాశాదుల నాశ్రయించినవి శబ్దాదిగుణము లున్ను చేతన ధర్మముగల జీవులను లేక అభిమాని దేవతలను ఆశ్రయించి యున్నది శక్తి యనియు తెలుసుకొనవలెను. గుణశక్తులకింతియే భేదము. ఇదియే శక్తిస్వరూప నిరూపణము.

## నిగమనము

అని యిట్లు వేద-కపిల-కణాద-చరక-సుశ్రుత-వ్యాస-జైమిని-శంకర-విద్యా రణ్యాదుల యాశయముల ననుసరించి పై విషయములను అనగా మూర్త ద్రవ్య-శక్తి- యనెడి పదములనుగూర్చి విమర్శనమును సంక్షేపముగా వ్రాసితిని, ఆధునిక యుక్తి వాదప్రియులకై కొన్ని యుక్తులనుగూడ జూపితిని. చెప్పినంతలో వాతము జడ మనియు- మూర్తద్రవ్యమనియు- చేతనాధాతు సహాయమున కార్యములను జేయు చున్నదనియు- చేతనాధాతువనగా జీవుడనియు మనకు దెలిసినది. ఇదియె నిగమనము.

## పిత్త - శ్లేష్మ నిరూపణము.

ఇట్లే పిత్తశ్లేష్మములనుగూడ సమన్వయించెడి వాక్యములు గలవు. వాటిలో కొన్నిటి నిటజూపెదను. యెట్లన :- పిత్తమున కధిదేవత జఠరాగ్నియని "అహం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహమాస్థితః। ప్రాణాపాన సమాయుక్తః పచా

మ్యన్నం చతుర్విధం” అని గీతలు చెప్పుచున్నవి. ఇచట అహమనగా బింబస్థానీయమగు చైతన్యము; వైశ్వానరుడనగా ప్రతిబింబ స్థానమగు పిత్తాభిమాని దేవత యని భావము. ఈ యర్థమునే జెప్పుచూ “జాఠరోభగవానగ్నిః ఈశ్వరోఽన్నస్యపాచకః। సౌక్ష్మ్యాద్రసానాదదానో వివేక్తుం నైవశక్యతే” (సు.సూ.35అ-27 శ్లో) వ్యా॥ అగ్నేరిదానీం ప్రత్యక్షేణానుపలభ్యస్యాపి అస్తిత్వ మాహ జాఠర ఇతి ...... సూక్ష్మత్వాన్న దృశ్యతే; కార్యై రుపలభ్యతే! ననుయద్య సావీశ్వరః తత్కథ మస్యమాంద్యాదయః? సత్యం, పురుషస్య ప్రాక్తన కర్మణా మాంద్యాదయః భవంతి। అథవా అగ్నిఃపిత్తాశ్రితః, తతఃపిత్త విఘాతాదగ్నిమాంద్యాదయో దోషాః నస్వతః॥ ఇతి॥ అని సుశ్రుతమున గానవచ్చుచున్నది. (అనగా ప్రాణులు తినిన యన్నమును వాటి జఠరమందున్నట్టిన్ని షడ్గుణైశ్వర్యములతో గూడినట్టిన్ని సర్వప్రభునైనట్టి అగ్నిహోత్రుడు పచనము చేయుచున్నాడు. అట్టి అగ్నిహోత్రుడుమన శరీరమందలి రసములను గ్రహించుచున్న వాడైననూ అతి సూక్ష్ముడగుటచే వానిని మన మింద్రియములచే గ్రహింపజాలకుంటిమి. గాని వాడు జేయు కార్యములను వాని యునికిని మన మూహింపవలసి యున్నది. అయితే వాడీశ్వరుడు గదా! వానికి మాంద్యాదు లెట్లు సంభవించునని శంకించినచో జీవుడు చేసిన కర్మవశముచే గల్గెనని సమాధాన మీయవలెను. లేక అగ్ని పిత్తము నాశ్రయించి యున్నందున ఆశ్రయమగు పిత్తముయొక్క వృద్ధి క్షయములు ఆశ్రయియందుగూడ సంభవించునని యైనను సమాధాన మీయవలెను అని భావము) అయితే ఆశ్రయము యొక్క వృద్ధి క్షయములు భగవంతుడగు యగ్నియందెట్లు సంభవించు ననగా:— విద్యుత్తరంగము దీపగోళము నాశ్రయించి ప్రకాశించుటలో పెద్ద గోళము నాశ్రయించి యధికముగా ప్రకాశింప తగినంత పెద్దదయ్యును; అదియే చిన్న గోళము నాశ్రయించి చిన్నదిగనె ప్రకాశించును; గాని తనకున్న పెద్దతనము నంతను జూపజాలదు. అట్లే యొకడు మణుగుబరువు నెత్తగల శక్తిగలవాడయ్యును వీశబరువు గల ద్రవ్యమును యెత్తుటలో తనకున్న శక్తినంతనూ వినియోగింపజాలడు. ఇచట ఆశ్రయగ్రాహ్య ద్రవ్యముల దౌర్బల్యమునుబట్టియేగదా విద్యుత్తరంగ- మనుజ-శక్తుల దౌర్బల్యము గానవచ్చుచున్నది! మరియు గొప్పదగు సముద్రములో ముంచబడిన ఘటములలో వానివాని న్యూనాధికభావమునుబట్టి వాటివాటిచే గ్రహింపబడిన జలముల పరిమాణము లుండునుగాని సముద్రజల పరిమాణముయొక్క యతిశయ మా ఘటజల పరిమాణములలో గానరాదు. ఇట్లే ఆకాశముగూడ తనకులేని న్యూనాధిక భావమును ఘటముల పరిమాణమును బట్టియే పొందుచున్నది. ఇదే తీరుగా సర్వాంతర్యామియగు పరమాత్మ బ్రహ్మాది స్తంబపర్యంతమూ యున్న జీవోపాధుల తారతమ్యమును బట్టియే తనకులేని న్యూనాధిక భావమును వ్యావహారికముగా వహించుచున్నాడు. గాన పైన డల్హణుడు జెప్పిన, కర్మలచే జీవోపాధులకున్ను వాటికి సంబంధించిన పిత్తాది భౌతిక ద్రవ్యములకున్ను న్యూనాధిక భావము

గల్గుటయు అందువల్ల వాని కధిదేవతలగు బ్రహ్మ- జఠరాగ్ని- మొదలగు వాటికి గూడ హెచ్చుతగ్గులు గల్గుటయు యుక్తముగనే యున్నది. జీవోపాధ్యంశ మగు బుద్ధియందు న్యూనాధిక భావమన గా యందలి సత్త్వాది గుణత్రయ తారతమ్యమునుబట్టి అందలి చైతన్య (ఆత్మ) ప్రతిబింబమందు అనగా తదభి మాని దేవతయగు బ్రహ్మయందుగూడ న్యూనాధిక భావ మేర్పడును. అపుడె తమః ప్రధానమందు మానసికరోగములున్ను సత్త్వప్రధానమందు మహాయోగి త్వాదులున్ను బుట్టుచున్నవి. గనుకనే మానసికరోగములకు "ధీధైర్యాత్మాది విజ్ఞానం మనోదోషౌషధం పరం" అనెడి చికిత్సను వాగ్భటాదులు వచించిరి. అనగా సత్త్వప్రధానమగు ఆత్మాది విజ్ఞానము తమః ప్రధానమగు మానసిక రోగములకు చికిత్సయని భావము. ఇట్లే శ్లేష్మమునుగూర్చి గమనింపవలెను. శ్లేష్మయనగా "అపోహవై శ్లేష్మప్రథమగ్ంసం బభూవ" అనెడి శ్రుతినిబట్టి యుదకములె శ్లేష్మ ధాతువై నదని తెలియుచున్నది. దీని కభిమానిదేవత సోముడని చరకాదులు వచించిరి.

## ఫలితాంశ నిరూపణము

గనుక ఆయుర్వేదములో జెప్పబడిన వాత- పిత్త- శ్లేష్మములనునవి క్రమ ముగా వాత- అగ్ని- జలము లను మహాభూతముల వలన బుట్టిన వికృతి ద్రవ్యములే గాని (అనగా విండ్- బైల్- ఫ్లం- అనెడి ద్రవ్యములేగాని) పై యుక్తులనుబట్టి శక్తులు గాజాలవు. వీటికి మూర్తద్రవ్య ధర్మములగు వృద్ధి క్షయములనెడి చికిత్స గలదు గాన అమూర్త ద్రవ్యములుగూడ గాజాలవు. గాన యీ వాతాదిదోష త్రయము వాతాది మహాభూతములయొక్క కారణానురుద్ధ కార్యరూప వికృతు లని సిద్ధమగుచున్నది. గనుకనే పాంచభౌతికములగు అన్నపానాదులవలన వాటికి వృద్ధిక్షయములు గల్గునని చరకుడు "యథాస్వం తాని యథావిభాగే న యథాస్వం ధాతూ నాపూరయం త్యేవమిదం శరీరమశితపీత లీఢఖాదిత ప్రభవం। అశితపీతలీఢఖాదిత ప్రభవాశ్చాస్మిన్ శరీరేవ్యాధయో భవంతి॥ (చ. సూ. 28. అ. 3 సూ.) ఇట్లు జెప్పియున్నాడు వాగభటుడుగూడ వృద్ధిస్సమానైస్సర్వేషాం విపరీతైర్వి పర్యయః" అని సమాన పద విశిష్టమగు సూత్రమును సూత్రించెను. గాన పై విషయముల నన్నిటిని బాగుగా జదివినచో వాత – పిత్త – శ్లేష్మములనగా; చరకాదులు వాటికి యెచట భగవాన్- ఈశ్వరః – అచింత్యవీర్యః – ఇత్యాది విశేషణముల నిచ్చెదరో యచట వాటి కభి మాని దేవతలగు వాతాదులనియు, వృద్ధిహ్రాసాది ధర్మములను గల్గించెడి చికిత్స లనుగాని రూక్షాదిగుణములనుగాని యెచట వర్ణించెదరో యచట జడములగు భౌతి కములైన వాయువు – అగ్ని – జలము అనువాటి-వికారము లనియు తప్పక తెలియ నగును. ఇదియే ఫలితాంశము.

## ఉపాసనావశ్యకతా నిరూపణము :

అవతరణిక :— ఇంతవరకు చేసిన చర్చవలన తెలిసిన వాతాది దోషత్రయ సామ్యావస్థయె స్వస్థునకు ముఖ్య లక్షణమని "సమదోషస్సమాగ్నిశ్చ సమధాతు మలక్రియః। ప్రసన్నాత్మేంద్రియమనాః స్వస్థ ఇత్యభిధీయతే" అనెడి శ్లోకము దెల్పుచున్నది. ఇట్టిస్వాస్థ్యతను సంపాదించుటకై విషమ ధాతువులుగలవాడు అనగా రోగి చికిత్సను జేసికొనవలెననెడి చికిత్సావశ్యకతను సూచించుటకై ప్రథమమున ఉపాసనావశ్యకతను నిరూపించుచున్నాను.

పై జెప్పిన అభిమాని దేవతాప్రసంగములో "సంతి హి సర్వేషు వస్తుషు అభిమాని దేవతాః" అని జెప్పి జుహూపభృదాది దారుపాత్రలకుగూడ యభిమాన దేవత లున్నట్లు వప్పించిరి. అట్టివాటికి మూలభూతమగు చైతన్య మఖండశక్తిమత్తైనను జుహూపభృదాది క్షుద్రోపాధుల నాశ్రయించియున్నందున పై జెప్పిన రీతిని విద్యుత్తరంగ సముద్రాది దృష్టాంతానుసారముగా యభిమాన దేవతలకు అల్పశక్తు లున్నవనక తప్పదుగదా ! అట్టి యల్పశక్తులకో, జీవకోటిలో నుత్తముడని చెప్ప బడెడి మానవున కేమి ప్రయోజనము ? వాటి నేల యుపాసింపవలెను ? యని శంక గల్గినచో- జెప్పెద వినుము ! యెట్లన:— నీవొక విలువగల వస్త్రమును కుట్టుకొన దలచినచో బజారుకుబోయి పెద్ద విలువయు, పెద్ద యాకారముగల పలుగును (గునప మును) కొనవుగదా ! నీ కోటితో గట్టిగా నొక్కినచో విరిగెడి అల్పమగు విలువ గల చిన్న సూదినే కొనెదవు నీ గోరునకుకూడా చాలనంతటి యల్పమగు సూది నేలకొనెదవు ? పోనిండు- సూది యల్పమైనను దాని శక్తి గొప్పదని తలంచెదము. అయితే పెరటిలోనున్న తక్కువవిలువ (పావలా విలువ) గల యొక మామిడి మొక్కను త్రవ్వుటకై యట్టి గొప్పశక్తిగల సూది నేల యుపయోగింపవు ? పెద్ద పలుగునకై యేల యత్నించెదవు ? ఆలోచింపగా యీ పనియందు పలుగే యుప యోగించును; ఆ పనియందు సూదియే యుపయోగించును. దానిపనియం దిదిగాని, దీనిపనియం దదిగాని యుపయోగింపనేరవు అని తెలియును. గాన యొక వస్తువు యల్పమనియు, వేరొకటి గొప్పదనియు మనము నిర్ణయింపజాలము. అందుచేత వస్తు నిష్ఠ న్యూనాధిక భావము వ్యావహారికముగా కల్పింపబడినదేగాని వాస్తవము కాదని సిద్ధాంతిత మగుచున్నది. గనుక ఆయా యీ కార్యములయందు వేదములో- "ఇంద్రాయ స్వాహా" "సూర్యాయ స్వాహా" ఇత్యాదులే గాక "వనస్పతిభ్య స్స్వాహా" "మూలేభ్య స్స్వాహా" "తూలేభ్య స్స్వాహా" ఇత్యాది మంత్రములు గూడ పఠింపబడినవి. ఈ ఇంద్ర, సూర్య, వనస్పతి, మూలా ద్యుపాధులయందు

ప్రతిబింబించిన చైతన్యము వాస్తవమునకు వక్కటైనను ఉపాధుల భేదముచే నానా త్వమును బొంది తత్తదభిమానిదేవత లను పేరుతో నానాకార్యములను జేయు చున్నది. గాన బింబస్థానీయమగు చైతన్యమే దేవతాపదవాచ్యమనియు; అదియే కర్మఫల ప్రదాతయనియు వ్యాసులవారి యభిప్రాయమై యున్నదనిన్ని, ఫలభేదము

లను గల్పించుటకు మాత్రము అపూర్వమును వప్పినచో జైమినిగూడ యెదురాడక దేవత నొప్పినవాడేయనిన్ని విద్యారణ్యులువారు "ఈశ్వరస్య ఫలదాతృత్వేపి నా పూర్వనైయర్థ్యం ఫలవిశేషే. తత్తారతమ్యేవా అపూర్వస్యైవ నియామకత్వాత్ జైమినిశ్చాప్యపూర్వాంగీకారేణ తుష్టో న దేవతాంద్వేష్టి" (కా. 1- ప్ర. 1- అ. 12 ) అని యిట్లు భాష్యములో చెప్పియున్నారు. ఈ విమర్శనములో బింబస్థానీయ మైన సర్వాంతర్యామియగు చైతన్యము కర్మఫలముల నిచ్చునని తెలుపబడుటచే రోగియొక్క ఆరోగ్యవిషయములోగూడ నియ్యది అవశ్యోపాస్యమని సూచించు చుంటిమి ఇదియే ఉపాసనావశ్యకతా నిరూపణము.

## సమదర్శనత్వ నిరూపణ పూర్వక కర్మ - ఉపాసనా చికిత్సాప్రాధాన్య నిరూపణము :

మరియు "తత్వం కాలంచ దేశంచ కార్యాణ్యాపేక్ష్య తత్వతః । కారణంచ స్మృతాహ్యేతాః నానార్థేష్విహ దేవతాః । ఏకం నిందతియస్తేషాం సర్వానేవ సనిందతి । ఏకం ప్రశంసమానస్తు సర్వానేవ ప్రశంసతి" (వాయుపురాణం, 66. అ.) అని యిట్లు చెప్పబడియున్నది. అనగా తత్వ - కాలాదులను బాగుగా నాలోచించి వాటియందు ప్రయోజనములను సాధించుటకై అభిమాని దేవతా నానాత్వ కల్పన జేయబడినదేగాని వాస్తవమునకా నానాత్వము యసంగతము గాన యొక దేవతను నిందించువా డన్ని దేవతలను నిందించువాడున్ను, యొక దేవతను స్తుతించువాడు అన్ని దేవతలను స్తుతించువాడున్ను యగుచున్నాడని తాత్పర్యము. అప్పయ్య దీక్షితులువారు గూడ యీ భావమునే "మహేశ్వరేవా జగతామధీశ్వరే జనార్ద నేవా జగదంతరాత్మని । నవస్తుభేద ప్రతిపత్తిరస్తిమె తథాపిభక్తి స్తరుణేందు శేఖరే" అనెడి శ్లోకముతో జెప్పియుండిరి. గాన ఇంద్ర - వనస్పత్యాది సర్వద్రవ్యముల యందు న్యూనాధికభావమును విడనాడి వ్యావహారికకర్మఫలముల నపేక్షించిన నాడు యట్టి ఫలప్రాప్తి సూచకములగు శాస్త్రవచనములనుబట్టి యాగాదికర్మలను - ఉపాసనలను - యట్లే చికిత్సలను జేయక తప్పదు. ఇదియే సమదర్శనత్వ నిరూపణ పూర్వక కర్మ - ఉపాసనా - చికిత్సాప్రాధాన్య నిరూపణము.

ఇట్లు ఆయుర్వేదతత్త్వము లనదగిన వాత - పిత్త - కఫముల స్వరూపాదులు సంక్షేపముగా నిరూపింపబడినవి,

శ్లో॥ ఆయుర్వేదోత్తరె తత్త్వవివేకే భాగఆదిమః ।
శ్రీమాతు రయమానందహేత వేఽస్మ త్పరిశ్రమః ॥
సోఽస్మదర్థోఽత్రిహారీతః ప్రసాదపదలాంఛనః ।
వేంకటాచలపత్యాఖ్యో రాజ్ఞీ వంశసముద్భవః ॥
శ్రీ మాతృలాలిత స్సాంగవేదజ్ఞశ్చ మహాగ్నిచిత్ ।
శిష్యస్సుతశ్చ కళ్యాణీ కళ్యాణ మిథునస్య యః ॥

ఇట్లు ఆయుర్వేద తత్త్వ వివేకమందు
ప్రథమభాగము ముగిసెను.



భారత ముద్రణాలయం, విజయవాడ-2.

# నెం 1 రు. ద్రవ్య పదకము

ద్రవ్యము = " యత్రాశ్రితాః కర్మగుణాః కారణం సమవాయి యత్ । తద్ద్రవ్యం " (చ. సూ. 1 అ. 50 శ్లో)

భేషజం :– (అనగా స్వాభావిక అస్వాభావిక రోగములను హరించునది) దీనినే రోగహరమని పథ్యమని అందురు.

అభేషజం :– (అభేషజంచ ద్వివిధం బాధనం సానుబాధనం) దీనినే అపథ్యమని – రోగకరమని అందురు. వాగ్భటుడు దీనినే కోపన మని చెప్పెను. ఇదియే అవిశుద్ధ – అవిరుద్ధ క్రమోపయోగి ద్రవ్యమని గూడ యనబడును.

బాధనము :– (అనగా తాత్కాలికముగా బాధించునది. ఉ॥ పచ్చి వెలంకాయ మొ॥ వి) అనగా విషము. శ్లో॥ వ్యవాయిచ వికాసిస్యాత్ సూక్ష్మ ఛేదిమదావహం। ఆగ్నేయం జీవితహరం యోగవాహి విషంస్మృతం॥

సానుబాధనము :— (అనగా దీర్ఘకాలమువరకు బాధించుచూ కుష్ఠాదులను బుట్టించునది. ఉ॥ ఇత్తడిగిన్నెలో వండిన అన్నమందలి చిలుము మొ॥వి) దీనిని దూషీవిష మందురు.

వ్యవాయి :– శ్లో॥ పూర్వం వ్యాప్యాఖిలంకాయం తతః పాకంచ గచ్ఛతి। వ్యవాయి తద్యథా భంగా ఫేనం చాహిసముద్భవం॥

వికాసి : – శ్లో॥ సంధిబంధాంస్తు శిథిలాన్ యత్కరోతి వికాసి తత్। విశ్లేష్యౌజశ్చ ధాతుభ్యోయథా క్రముకకోద్రవాః॥

సూక్ష్మ :– శ్లో॥ దేహస్యసూక్ష్మచ్ఛిద్రేషు విశేద్యత్సూక్ష్మముచ్యతె॥

ఛేదనం: – శ్లో॥ శ్లిష్టాన్ కఫాదికాన్ దోషాన్ ఉన్మూలయతి యద్బలాత్। ఛేదనం తద్యథా క్షారమరిచాని శిలాజతు॥

మదకారి :– శ్లో॥ బుద్ధింలుంపతి యద్ద్రవ్యం మదకారి తదుచ్యతె। తమోగుణప్రధానంచ యథా మద్య సురాదికం॥

అభిష్యంది :– శ్లో॥ పైచ్ఛిల్యాద్గౌరవాద్ద్రవ్యంరుద్ధ్వారస వహాస్సిరాః। ధత్తేయ ద్గౌరవంతత్ స్యాత్ అభిష్యంది యథాదధి॥

ఊర్జస్కరం

(దీనినే వాగ్భటుడు స్వస్థహితద్రవ్యమనెను. ఇది, ముసలితనము - ఆకలి - దప్పిక - మొ॥ స్వాభావిక వ్యాధులను హరించును.)

రోగనుత్

(ఇదియె వాగ్భటమతములో శమన మనబడును. అనగా శోధనేనవా శమనేనవా రోగశమనకారిత్వాచ్చమనం. ఉక్తంచ:—శమనంశోధనం స్వస్థహితం ద్రవ్యమితి త్రిధా) ఇదిజ్వరము మొ॥ అస్వాభావికరోగములను హరించును.

శోధనం,

శ్లో॥ స్థానాద్బహిర్నయె దూర్ధ్వం అధోవామలసంచయం।
దేహసంశోధనం తత్స్యాత్ దేవదాలీ ఫలం యథా॥

శమనం,

శ్లో॥ నశోధయతినద్వేష్టి సమాన్ దోషాః తథోద్ధతాః।
సమీకరోతి విషమాన్ శమనం తద్యథామృతా॥

దీపనం

శ్లో॥ పచేన్నామం వహ్నికృచ్చదీపనం తద్యథామిసిః।

పాచనం

శ్లో॥ పచత్యామం నవహ్నించకుర్యాద్యత్తద్ధి పాచనం। నాగకేసర వద్విద్యాత్ చిత్రోదీపన పాచనః॥

ఆతపం

(యెండ)

మారుతం

(గాలి)

గ్రాహి

శ్లో॥ దీపనం పాచనం యత్స్యాత్ ఉష్ణత్వాత్ ద్రవశోషకం। గ్రాహితచ్చయథాశుంఠీ జీరకం గజపిప్పలీ॥

స్తంభనం

శ్లో॥ రౌక్ష్యాచ్ఛైత్యాత్కషాయత్వాల్లఘుపాకాచ్చ యద్భవేత్। వాతకృత్ స్తంభనం తత్స్యాత్ యథావత్సక టుంటుకా॥

వమనం,

శ్లో॥ అపక్వపిత్త శ్లేష్మాణౌ బలాదూర్ధ్వం నయేత్తుయత్। వమనం తద్ధివిజ్ఞేయం మదనస్య ఫలం యథా॥

రేచనం

శ్లో॥ విపక్వం యదపక్వం వా మలాది ద్రవతాంనయేత్। రేచయత్యపితత్ జ్ఞేయం రేచనం త్రివృతా యథా॥

భేదనం

శ్లో॥ మలాదికమబద్ధం యత్ బద్ధం వాపిండితంమలైః। భిత్వాధః పాతయెద్యత్తత్ భేదనం కటుకీయథా॥

స్రంసనం,

శ్లో॥ పక్తవ్యం యద పక్త్వైవా శ్లిష్టం కోష్ఠేమలాదికం। నయత్యధః స్రంసనంతత్ యథాస్యాత్ కృతమాలకః (రే.)॥

అనులోమనం

శ్లో॥ కృత్వాపాకం మలానాం యత్ భిత్వాబంధ మధోనయెత్॥తచ్చానులోమనంజ్ఞేయం యథా ప్రోక్తాహారీతకీ॥

లేఖనం

శ్లో॥ ధాతూన్ మలాదీన్ దేహస్య విశోష్యోల్లేఖయేచ్చయత్। లేఖనంత తద్యథాక్షౌద్రం నీరముష్ణం వచాయవః॥

శోధనం

ప్రమాథి

శ్లో॥ నిజవీర్యేణ యద్రవ్యం స్రోతోభ్యో దోషసంచయం॥
నిరశ్యతి ప్రమాథిస్యాత్ తద్యథా మరిచంవచా॥

నిరూహము | వమనము | విరేచనము | నస్యము | రక్తమోక్షణము